శ్రీరస్తు.

శ్రీమదఖిల జగజ్జననావన సంహారణ కేళీ తత్ప
రుండును, బ్రహ్మాది సకల దేవతా సముదయ.
సంసేవిత చరణారవిందుండును, భక్తజన
సర్వాభీష్టప్రదుండుననగు పరమేశ్వరు
నిచే పార్వతీదేవికుపదేశింపంబడిన,

# దైవజ్ఞశిఖామణి.

అను

జ్యోతిష గ్రంథ రత్నము.



ఇయ్యది,

జ్యోతిష సంప్రదాయ ప్రవర్తకులును
కశ్యపమహాఋషి గోత్రోద్భవులును నగు
శ్రీమత్పుత్సల-గంగయ్యగారి జ్యేష్ఠపుత్రులుననగు
పుత్సల-వీరభద్రసిద్ధాంతిగారిచే
ఆంధ్ర తాత్పర్య సమన్వితముగా
రచియించి,

రాజమహేంద్ర పుర నివాసులు .
బ్రహ్మశ్రీ. సీలావీరభద్రయ్య అండ్ బ్రదర్సువారి
ద్రవ్య సహాయముచే,
చెన్నపురి: ప్రాతచాకలపేటయందుండు
పమ్మి - త్యాగరాయసెట్టిగారి
శ్రీరాజరాజేశ్వరీనికేతన ముద్రాలయమునందు ముద్రింపఁబడియె.



౧౯౨౮ సం. ] — [ వెల రూ. ౨-౮-౦.

PRINTED BY
P. THYAGARAYA CHETTY.
AT THE
SREE RAJARAJESWARI NIKETANAM PRESS.
Washermenpet, Madras.
1928.

శ్రీరస్తు.



సీ. శ్రీపార్వతీనాథ సేవనమకరంద
పానసమాసక్త బంభరుండు
శీలాభిదాను ప్రసిద్ధాన్వవాయదు
గ్ధాంబోధి పూర్ణ సుధాకరుండు
సతతసమాగతాశ్రిత మనోభీష్ట సం
ధానతృణీకృత నాకశాఖి
ధవళస్వకీయ విస్తార యశోరమా
నిర్విణ్ణశారదా నీరదుండు,
అమితసుగుణుండు సాంబమూర్త్యగ్రజుండు
వీరభద్రాహ్వయుండు వివేకధనుఁడు
అస్మదీయపుస్తక ముద్రణార్థమైన
ధనము సంపూర్తి నొసగినన్ ధన్యుఁ జేసె.

ఇట్లు,
పుత్సల - వీరభద్రసిద్ధాంతి.

బండారులంక.

అమలాపురంతాలూకా.

శ్రీ ర స్తు.

సీ. శ్రీమోరిపురమున శ్రీలచే విలసిల్లు
దేవాంగ వంశ ప్రదీపకుండు
స్వచ్ఛమహాపిచ్చికాన్వయవార్ధి చంద్రుండు
మల్లయాహ్వయుని సత్పౌత్రవరుఁడు
గుణఖని శేషాంబకును వీరభద్రున
కావిర్భవించిన యనులయశుఁడు
పుత్రాష్టకంబును బుత్రీత్రయంబును
గలిగి మహోన్నతిఁ జెలఁగు ఘనుఁడు
మల్లయాఖ్యుండు మామక మానసేప్సి
తజ్ఞుఁడయి కరుణార్ద్రహృత్కమలుఁడగుచుఁ
దక్షిణమిడె రూపపట ముద్రణాధనంబు
సకలజనములు మేలని సంస్తుతింప.



సీ. శ్రీసతీభారతీ సీమంతినులు వేని గృహారస నలఁసియించు మంద్రు।
"వం తం" సమాఖ్య గోత్రక్షీరవార్ధికె వ్వాఁడు పూర్ణేందుఁడై పఱ
లుచుండు। వెంకమాంబావీర యార్జిత పుణ్యాల తొలినోము
పంటయే యలఘుగుణుఁడు। సాధువిద్వజ్జన సమ్మాన మొనరింప
నెవ్వఁడహర్నిశ లెదురుచూచు। నట్టి యోగ్యుండు శ్రీకోట
యార్యవరుఁడు వేటపాలెపు వాసి వివేకయుతుఁడు। నాదునీ
గ్రంథపుం ముద్రణంబుకొఱకు నిచ్చెవిన్నాణు రూప్యము లెల
మిమీఱ॥



సీ. వసుధగుమ్మళ్లవంశ సరోవరంబున వరలుచు నున్నట్టి సరసిజంబు।
కార్తాంతికాళి సత్కవిజనాళి హితాళి సుజనాళి పాలిటనురకుం
జరంబు। శరణంటినన్ను రక్షణసేయుమనిన తక్షణము వారలకు
దక్షిణభుజంబు। నమ్మించిచెరచు మానవరక్కసులకెల్ల విజయుని
వద్ధకపిధ్వజంబు। ఇట్టి మల్లయ్యశ్రేష్ఠున కెలమి నెపుడు హరుడు
నగరాజసుతమనోహరుడు। త్రిపుర హరుడు కరుణాకరుడు చంద్ర
ధరుడు పరమగురుడు కాపాడుగాత యెన్నాదు రతేక॥

ఇట్లు, పుత్సల - వీరభద్ర సిద్ధాంతి
బండారులంక అమలాపురం తాలూకా



గ్రంథకర్త.

పుత్సల - వీరభద్రసిద్ధాంతి.



శ్రీరస్తు.

# విషయసూచిక.



ద్వితీయ కాండః.



తృతీయ కాండః.







చతుర్థ కాండః.



పంచమకాండః.

విషయసూచిక సంపూర్ణము.

## ప్రకటన.



## జ్యోతిషగ్రంథములు.



పమ్మి - త్యాగరాయసెట్టి అండు సన్సు. చాకలపేట—చెన్నపట్టణము.

## వేదాంత గ్రంథములు.

గురుగీతాసారము.— దీనిగ్రంథకర్తలు, ప్రాచీనులు, శ. సుబ్రహ్మణ్యయోగీశ్వరులచే ఉపనిషత్తులు, స్మృతులుపురాణములు, మొదలగు 52 వేదాంతగ్రంథములనుండి తీసిన ఉపమనోపమానములతో ఆంధ్రతాత్పర్య విశేషార్థములతో చాలామృదువుగను బోధచేసుకొనుట కనువుగను ఆంధ్ర జనులకు అమూల్యమగు సాధనముగ నుండునటుల వ్రాయఁబడియున్నది. 3-0-0

శుష్క వేదాంత తమోభాస్కరము.— ఇందు 92 విషయములకు శ్లోకతాత్పర్య సహితముగలదు. 1-4-0

ప్రభులింగలీల పద్యకావ్యము. చక్కనిప్రతి. 0-8-0

తత్వార్థముక్తాకలాపము. 0-2-0

రాజయోగసారము— ద్విపదకావ్యము. శుద్ధప్రతి. 0-4-0

వేమనజ్ఞానమార్గపద్యములు. (3002) 2-0-0

అనంతోపనిషత్తు టీకా తాత్పర్య సహితము. 0-5-0

ఆనందరామాయణము.— ఇందు రామాయణ కథయంతయు సమగ్రముగ గలదు. వచనకావ్యము. 1-0-0

శ్లో॥ తా॥ సుందరకాండము పారాయణగ్రంథము రఫ్ప్రతి కిత్తానుబైండు. 1-8-0 డిటో గ్లేజుప్రతి. 2-0-0

ఆశ్చర్యకథాతరంగిణి. ఇందు ౧౦ కథలుగలవు. 0-6-0

జగన్మోహినియను నవల.— ఇందు ఆరుప్రకరణములు అతిచమత్కారమైన కథలుగలిగియుండును. 0-4-0

ముముక్షుజనకల్పకము. 0-6-0

ధ్యానామృతము. రఫ్ 0-4-0

శ్రీతారకబ్రహ్మానుభవి, పూడిపెద్ది-సాంబశివరావుగారి స్వానుభవనీయ ఉపదేశ వాక్యములు. 0-6-0

సుజ్ఞానరత్నావళియను వేదాంతకీర్తనలు. 0-6-0

సుజ్ఞానదీపమను గురుగీతలు, శ్లో॥ టీ॥ తా॥ కిత్తానుబైండు. 1-4-0

రఘువంశము ౧౦ సర్గలు, సవ్యాఖ్యానము. ౦-౧౨-౦

వమ్మె-త్యాగరాయసెట్టి అండు సన్సు. ప్రాతచాకలపేట, మద్రాసు.





# ౧. పీఠిక.

నిఖిల భూమండల మండనాయమానంబగు నీ భరతఖండంబున నుద్భవించి, ఋగ్వేదాది వేదంబులును, శిక్షాది షట్ఛాస్త్రంబులును నమ్మి ప్రవర్తించు మహాజనులకు, శుభాశుభములు తెలనుకొనుటకును, దా నవలంబించి చేయు కార్యములు నిర్విఘ్నముగ జరుగుటకు జ్యోతిశ్శాస్త్రము ముఖ్యావసరమైనదని అందరికి తెలిసినదియె, ఈ జ్యోతిశ్శాస్త్రము,జాతక, సిద్ధాంత, ముహూర్త భాగములని మూడు విధములు. అందు ముహూర్తభాగ మెల్లరకు ప్రతిదినమావశ్యకము, ఇట్టి యావశ్యకమైన భాగము నెల్లరకు సులభసాధ్యముగాక తెలసిన వారివలన తమకు కావలసిన సంగతుల దెలనుకొని కార్యములను నెరవేర్చుకొనుచున్నారు. అట్టి తెలసినవారు సహితము ఊరనూర చిక్కుట దుర్లభము. అట్టిలోపము లేకుండ జేయ నుద్దేశించి యెల్లరకు సులభముగా పండిత సహాయము లేకయె, బోధపడునట్లు తెనుగు తాత్పర్యముతో నొక గ్రంథమున్న మేలు గలుగునని నామిత్రులు ప్రోత్సాహించినందున, ప్రాచీనఋషిప్రోక్తగ్రంథముల ననుసరించి కొన్ని ప్రాచీన శ్లోకములకు సులభమైన తెనుగు తాత్పర్యమును ఉదాహరణముగ వ్రాసితిని.

ఇందు పంచాంగవిమర్శ, నామ నక్షత్రవివేకము, గ్రహావస్థాభేదములు, ఛాయలు, తారాబల, చంద్రబలములు, ప్రశ్నభాగ, ముహూర్తభాగ, జాతకభాగ, గోచారభాగ, వాస్తువిమర్శ, ఖగోళ, భూగోళవిషయములు మొదలగు ననేక విషయములతో బొందుపరచి సామాన్యజ్యోతిష విద్యాజ్ఞానముగల ప్రతిమనుజునకు యీ

గ్రంథస్థ విషయములు స్పష్టముగ తెలియుగలవు. ఈగ్రంథము చూచినంతట సర్వవిషయములును జ్యోతిశ్శాస్త్రములోని నిఖిలమర్మములు అతి సులభముగా బోధపడుటయేగాక, గురుసహాయము లేకయే స్వయముగా జాతకముహూర్త, గోచారాదులు ధారాళముగా గ్రహింపవచ్చును. వేయేల ఈగ్రంథముయొక్క ఫలితమును విషయసూచక చూచినంతనె దీని యుపయోగము తెలియగలదు.

దీనివెల. .... .... .... .... 2—8—0

ఇట్లు.

పుత్సల - వీరభద్ర సిద్ధాంతి.

బండారులంక

గోదావరిజిల్లా.





# ౨. జ్యోతిషశాస్త్ర ప్రభావము.

సర్వశాస్త్రములలో జ్యోతిషశాస్త్రము ముఖ్యావసరమైనదియు భూతభవిష్య ద్వర్తమానంబుల దెలుపునదియు నగు నీశాస్త్రమునకు లోకప్రకాశకుడగు శ్రీసూర్యనారాయణ మూర్తి కర్తగా పూర్వులు వ్రాసిరి.

ఇందుకు ప్రమాణమ్.

శ్లో॥ మూర్తిత్వేపరికల్పిత శ్శశిభృతో వర్త్మా పునర్జన్మనా
మాత్మేత్యాత్మవిదాం క్రతుశ్చయజతాం భర్తామరజ్యోతిషాం
లోకానాం ప్రళయోద్భవస్థితి విభుశ్చానేక థాయఃశ్రుతౌ
వాచంనస్సదదా త్వనేకకిరణః త్రైలోక్యదీపోరవిః॥

టీ॥ శశిభృతః॥ శివునియొక్క అష్టమూర్తులగు॥

శ్లో॥ సూర్యాజలంమహీవాయుః వహ్నిరాకాశమేవచ
యాయజూకశ్చసోమశ్చ రుద్రాదీనంతు మూర్తయః॥

(అనెడు) అష్టమూర్తులలో సూర్యనారాయణమూర్తి నొకమూర్తిగా ఉంటున్నాడు॥ అపునర్జన్మనాం, పునర్జన్మము లేక ముక్తులయ్యేవారికి, వర్త్మ మార్గమైనట్టిన్ని ఆత్మవిదాం ఆత్మవేత్తలైన యోగులకు, ఆత్మా, సచ్చిదానంద స్వరూపుడగు ఆత్మయైనట్టిన్ని॥ ఇందుకు॥

శృతి॥ సూర్యఆత్మాజ గతస్తస్థుషశ్చ॥ అని ప్రమాణమును॥ అగ్నౌప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతి॥ అను ప్రమాణము ననుసరించియు॥ యజతాం యజ్ఞులకు క్రతుశ్చ॥ అగ్నిముఖముగా ఆహుతి పొందుటవలన, యజ్ఞస్వరూపుడైనట్టిన్ని, అనేకకిరణః=అనేకములైన కిరణములు గలిగినటువంటిన్ని, త్రైలోక్యదీపః= మూడులోకములకు ప్రకాశుడైనట్టిన్ని, అమర = దేవతలకు, జ్యోతిషాం = గ్రహనక్షత్రములకు, భర్తా=ప్రభువైనట్టిన్ని, లోకానాం=

భూర్భువాది లోకములయొక్క, ప్రళయోద్భవస్థితి, విభుం, ప్రళయ= నాశనమునకును, ఉదయ = ఉత్పత్తికిని, స్థితి = నిలకడకును, విభుః= కర్తగా నుంటున్నాడు॥ అని ఇత్యాది అనేకశృతుల యందున్న,

అసావాదిత్యోబ్రహ్మః॥ అనగా ఈసూర్యుడే పరబ్రహ్మస్వరూపుడనిన్ని॥ అంతరాదిత్యే హిరణ్మయః పురుషః॥ అనగా॥ ఆదిత్యమండలాంతర్వర్తియైన, హిరణ్మయ స్వరూపుడనిన్ని॥ యీరెండుశృతుల యందు జెప్పబడుటయేగాక ఇంకా అనేకశృతి స్మృతుల యందు గూడా అనేకవిధములుగా సూర్యభగవానుడే,

శ్లో॥ ఉదయ్యం బ్రహ్మస్వరూపం మధ్యాహ్నేతు మహేశ్వరం।
అస్తమానం స్వయంవిష్ణుః త్రిమూర్తిశ్చదివాకరః॥

అని స్మృత్యర్థమందు చెప్పబడినప్రకారమే త్రిమూర్తిస్వరూపుడై కర్మసాక్షిగా భగవత్స్వరూపుడుగా నుంటున్నాడని చెప్పబడుచున్నది.

ఇట్టి సూర్యనారాయణ మూర్తివల్ల స్కంధత్రయాత్మక స్వరూపమైన, జ్యోతిశ్శాస్త్రము ఈభూలోకమునందు దాహరించబడెను॥

దైవజ్ఞవిలాసె.

శ్లో॥ స్కంధత్రయాత్మకంశాస్త్రం ఆద్యంసిద్ధాంత సంజ్ఞకం।
ద్వితీయంజాతకస్కంధం తృతీయం సంహితాహ్వయః॥

---

తాత్పర్యము.

1. ప్రథమస్కంధము............సిద్ధాంతవిచారము.
2. ద్వితీయస్కంధము............జాతకవిషయము.
3. తృతీయస్కంధము............ముహూర్తవిషయము.

ఈప్రకారము స్కంధత్రయాత్మక స్వరూపముగలదై విలసిల్లుచున్నది. ఇంకను ప్రథమాదిస్కంధస్థిత విషయములను వివరించెద.

---



ప్రథమస్కంధస్థవిషయములు.

రవ్యాదిగ్రహములకు.

| | | | |
|---|---|---|---|
| 1 | మధ్యగ్రహసంస్కారము. | 10 | గ్రహసమాగమము. |
| 2 | స్ఫుటనిర్ణయము. | 11 | ఉదయాస్తమయము. |
| 3 | భుక్తినిరూపణము. | 12 | శృంగోన్నతి. |
| 4 | తిథ్యాదినిర్ణయము. | 13 | పాతనిర్ణయము. |
| 5 | దిక్సాధన. | 14 | మహాపాత. |
| 6 | ఛాయాసాధన. | 15 | సామాన్యపాత. |
| 7 | లగ్నకాలనిర్ణయము. | 16 | దీర్ఘపాత. |
| 8 | చంద్రార్కగ్రహణము. | 17 | ద్వార్భవపాత. |
| 9 | గ్రహయుద్ధము. | 18 | ఖగోళము. |

మొదలగు నీవిషయములన్నియు సిద్ధాంతసంబంధములు. ఈ సిద్ధాంత గ్రంథములు మూడు విధములు॥ అందు॥

---

1. సిద్ధాంత గ్రంథములనియును.
2. తంత్రగ్రంథములనియును.
3. కరణగ్రంథములనియును వాడుదురు.

1. కల్పాది లేక సృష్ట్యాది అహర్గణము సాధించునవి సిద్ధాంతములు.
2. యుగాదిగా అహర్గణము సాధించునవి, తంత్రములు.
3. శాలివాహనశకాదిగా అహర్గణము సాధించునవి, కరణములు.

ఇవియన్నియు ప్రథమస్కంధములోనివే॥

---

ద్వితీయస్కంధస్థవిషయములు.

| | | | |
|---|---|---|---|
| 1 | గర్భధారణవిషయము. | 5 | అంతరాంతర్దశలు. |
| 2 | జన్మకాల లక్షణము. | 6 | సూక్ష్మదశలు. |
| 3 | ఆయుర్దాయవిషయము. | 7 | ప్రాణదశావిచారము. |
| 4 | దశాభేదవివరము. | 8 | అష్టకవర్గు. |

| | | | |
|---|---|---|---|
| 9 | రాజయోగములు. | 13 | దృష్టిఫలము. |
| 10 | చాంద్రయోగములు. | 14 | స్త్రీజాతకము. |
| 11 | ద్విగ్రహాద్యాది యోగములు | 15 | నిష్టానిష్టవిచారము. |
| 12 | రాశిశీలము | 16 | నష్టజాతకనిర్ణయము |

మొదలగు జాతకవిచార ఫలములున్ను,

---

తృతీయస్కంధస్థవిషయములు.

| | | | |
|---|---|---|---|
| 1 | ముహూర్తవిచారము. | 10 | నృపాభిషేకము |
| 2 | ఉపగ్రహవిషయము | 11 | దేవతాప్రతిష్ఠ. |
| 3 | సూర్యసంక్రాంతినిర్ణయము | 12 | గృహకర్మ |
| 4 | గోచారక్రమము. | 13 | ఆరూఢవిషయము. |
| 5 | చంద్ర తారాబల నిర్ణయము. | 14 | ఆగ్న్యాధానము |
| 6 | షోడశకర్మలు. | 15 | మేఘ, మేఘగర్భలక్షణము. |
| 7 | ఛురికాబంధనము. | 16 | ఉత్పాతలక్షణము |
| 8 | యాత్రావిషయము. | 17 | కూపవాస్తు. |
| 9 | సద్మప్రవేశము. | 18 | శాంతిక్రమము. |

మొదలగు ముహూర్తవిషయములును చెప్పబడుచున్నవి.

---

{ ఇట్టి స్కంధత్రయాత్మక స్వరూపమైన
జ్యోతిశ్శాస్త్ర ప్రభావం బెట్టిదనిన. }

సిద్ధాంతశిరోమణౌ

శ్లో॥ శబ్దశాస్త్రం ముఖం జ్యోతిషం చక్షుషీశ్రోత్రయుగ్మం।
నిరుక్తంచ కల్పఃకరౌ యాతుశిక్షాస్య వేదస్య।
నాసికాపాద పద్మద్వయం ఛందఆద్యైర్బుధైః॥

అను శాస్త్రప్రమాణముచే వేదపురుషునికి.

శ్లో॥ శిక్షావ్యాకరణంఛందో నిరుక్తంజ్యోతిషంతథా।
కల్పశ్చేతిషడంగాని వేదస్యాహుర్మనీషిణః॥



తా॥ శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, ఈషడంగములతో వేదము విలసిల్లెను॥ అందుకు॥

1. శిక్ష॥ దీనికిపాణినికర్త॥ ఇందు వేదశబ్దములయొక్క అక్షరముల స్థానజ్ఞానమును ఉదాత్తానుదాత్త స్వరిత ప్రచయాది స్వరముల జ్ఞానమును జెప్పబడెను.

2. వ్యాకరణము॥ దీనికి పాణినికర్త కాత్యాయనులును పతంజయలును వ్యాఖ్యానములను రచించియున్నారు.

3 ఛందస్సు॥ దీనికి వేదమునందు జెప్పబడిన గాయత్రీ మొదలగు ఛందస్సులయొక్క జ్ఞానమును, లక్షణజ్ఞానమున్ను, బోధించును.

4. నిరుక్తము॥ వేదమంత్రములయొక్క ప్రయోజనమును అర్థములును బోధింపబడును॥ మరియు వేదశబ్దవివరణ నిఘంటువునందు గలదు.

5. జ్యోతిషము॥ ఇందుకు ఆదిత్యాదులు కర్తలు వైదికకర్మల నారంభించుటకు వలయు కాలజ్ఞానమును, తత్ఫలమును, భవిష్యత్సూచనలును వివరింపబడియున్నవి. వీనిని వివరించు సూర్యసిద్ధాంతాదిగ్రంథము లనేకములు గలవు॥ మరియు॥

సూర్యచంద్రులును కుజాది పంచగ్రహంబులును ఈశ్వరునియొక్క స్వరూపమై యుండెను. గనుక జ్యోతిశ్శాస్త్రము నభ్యసించి గ్రహగతులను కాలజ్ఞానమును దెలుసుకొనిన మహనీయులీశ్వరుని తెలుసుకొనినవారే యగుదురు. ఋషీశ్వరులు మొదలగు మహానుభావు లిట్టి దివ్యజ్ఞానమును గలిగియే ఆగతానాగతంబుల నవలీలగ జెప్పియుండిరి. ఇట్టి దివ్యజ్ఞానదాయకంబగు జ్యోతిశ్శాస్త్రం బద్వితీయపరబ్రహ్మంబును గుర్తెరుంగుటకు సోపానంబైయుండు ననుటకావంతయు సందియంబు లేదు.

6. జ్యోతిశ్శాస్త్రము॥ వేదముయొక్క షడంగములలో ప్రధానాంగమై వెలుంగుచున్నది. జగత్సృష్టికర్తయగు చతురాననునివలన వేదంబులు ప్రకటింపబడెను.

వేదము॥విత్॥ అను ధాతువునుండి పుట్టినది॥ వేదయతీతి వేదః॥ అనగా దీనివలన ధర్మాధర్మములు తెలియబడును. ఈ వేదమునకు॥ శృతిః॥ ఆమ్నాయః॥ అను నామములు వాడుకలోనున్నవి. శ్రూయత ఇతి శృతిః, అనగా వినబడుట.

( పరమేశ్వరుని యందుండియే వినబడినందున )

శ్రుతిః॥ అనియుం జెప్పబడెను॥ అమ్నాయః॥ ఆమ్నాయతే॥ పరం పరయేత్యామ్నాయః॥ అభ్యసించుటంబట్టి ఆమ్నాయమన బడెను. వల్లించుటయని యర్థము॥ ఈ వేదమునందుండు విషయము లత్యంతశ్లాఘనీయమైనవియు, నైహికాముష్మిక విషయజ్ఞానముసు బోధించునట్టివియునునై యున్నవి.

లోకములో ప్రతిమనుజుడు నిహపరసాధనమగు సత్కర్మను సాధించుట ముఖ్యావశ్యముయేగదా అట్టిసత్కర్మను జేయుటకు వేదము, కాలజ్ఞానము నాధారములై యుండెను. నట్టి కాలజ్ఞానమును దెలసుకొనుటకు జ్యోతిషమే యాధారము. జీవశరీరమునకు నేత్రమెట్టిదియో వేదశరీరమునకు జ్యోతిషమట్టిది.

సర్వాంగములలో నేత్రములు యేవిధముగా శ్రేష్ఠమైనవో అటువలెనే సమస్తశాస్త్రములలో జ్యోతిశ్శాస్త్రము, కేవలము శ్రేష్ఠముగా నుంటున్నది.

( ఇందుకు॥ దృష్టాంతరం )

శ్లో॥ అంగైర్యుతోన్యః పరిపూర్ణమూర్తిః॥
చక్షుర్విహీనః పురుషోనభాతిః॥

తా॥ ఎవరైననేమి, పరిపూర్ణమైన సర్వాంగములతో చేరి యున్నను, నేత్రవిహీనుడైనప్పుడు, ప్రకాశింపడు గదా॥

శ్లో॥. ముఖమర్ధశరీరంస్యా త్సర్వంవా ముఖముచ్యతే।
తత్రాపినాశికా శ్రేష్ఠా నాశికాయాస్తు చక్షుషః॥

తా॥ ప్రతిమనుష్యునికిన్ని దేహమందు ముఖం అర్ధాంగమన్నిన్ని శేషించిన దేహమర్ధ శరీరమనిన్ని, అందులో ముఖమునందు



శ్రేష్ఠమైనది నాశికమనిన్ని ఆనాశికముకంటె శ్రేష్ఠాంగము నేత్రములనిన్ని చెప్పబడుచున్నందున॥ యేతాదృశ నేత్రస్వరూపమైనట్టి జ్యోతిశ్శాస్త్రమే సర్వశాస్త్రములలో నాధిక్యమైన దాయెను.

శ్లో॥ విఫలాన్యన్యశాస్త్రాణి వివాదాస్తేషు కేవలం।
సఫలంజ్యోతిషంశాస్త్రం చంద్రార్కౌ తత్రసాక్షిణౌ॥

తా॥ అన్యశాస్త్రాణి॥ సమస్త శాస్త్రములు ఫలరాహిత్యములనిన్ని ఆశాస్త్రములయందు కేవలం వాదభేదములుగా నుండడమే గాని ప్రత్యక్షములు కావనిన్ని, ఈ జ్యోతిశ్శాస్త్రము ఫలసహితమైనదనిన్ని॥ యిందుకు॥ శృతిః॥ చంద్రమా మనసోజాతః చక్షుఃసూర్యో అజాయతః॥ అనుశృత్యర్థప్రకారము విరాట్స్వరూపునియొక్క మనస్సునుంచిన్ని, చక్షువుల వలనున్ను ఉద్భవించిన చంద్రసూర్యులకు గలుగు గ్రహణములే నిదర్శనముగా యుంటున్నవి, గాన సర్వశాస్త్రములకంటె యీ జ్యోతిశ్శాస్త్రము సర్వోత్కృష్టమైనదని చెప్పుటకు పైనచెప్పబడిన శాస్త్రాధారములేగాక యింకా అనేక శాస్త్రాధారములు కలవు॥

( మరియొక విశేషము॥ )

ఎవ్వడూహింప శక్యముగాని యగోచర స్వరూపము గలిగి గుణాతీతుండై సచ్చిదానంద స్వరూపుండై లోకాధారమూర్తి యని నెన్నబడుచుండెనో అట్టి పరమేశ్వరుండే పరబ్రహ్మంబు అట్టి పరబ్రహ్మంబే కాలము అట్టికాలమును దెలిసినవాడే జ్యోతిష్కుడు కాలమనగా ఏది సర్వత్ర వ్యాపించి సత్యజ్ఞానానంద స్వరూపంబై యలరారుచుండెడి వెల్గులకు నిలయమై యుండెనో యదియే సూర్యుడనబడును॥ ఆ సూర్యుని తేజస్సే తక్కిన గ్రహంబులును నక్షత్రములునై ప్రకాశించుచున్నవి.

(ఉదాహరణము) ఒక యింటియొక్క పైకప్పునవున్న రంధ్రముగుండ సూర్యునికాంతి ఆయింటిలోనికి బ్రవేశించి భూమి సరా

నరికి వ్యాపించిన యొకవిధమైన నాళమువలె గనుపించుచుండును॥ అప్పుడు॥ మన మొక మూడు పలకలుగల గాజుకడ్డీని పై నాళము నందు ఆ రంధ్రమున కభిముఖముగ వుంచి చూచినయెడల యేడు రంగులు గలిగియుండును. ఈ యేడురంగులే యేడు గ్రహములకుం జెప్పిన ఛాయలై యున్నవి॥

ఇట్టి పరమోత్తమమగు నీశాస్త్రమును పూర్వోక్త॥ శ్రీ సూర్య నారాయణమూర్తిచే॥

మయోనామ మహాసురః॥ మయుడనెడు నొక రాక్షసశ్రేష్ఠున కుపదేశింపబడెను॥

అదిమొదలు భువిలో యీ శాస్త్రంబు విస్తారంబై ప్రకాశింపు చుండెను.

( ఏతచ్ఛాస్త్రాధికారులు॥ )

శ్లో॥ సూర్యఃపితా మహోవ్యాసః వశిష్ఠోత్రిః పరాశరః।
కశ్యపోనారదోగర్గో మరీచి ర్మనురంగిరః।
లోమశోపౌలశ్చైవ చ్యవనో యవనోభృగుః।
శౌనకాష్టాదశో హ్యేతే జ్యోతిశ్శాస్త్ర విశారదాః॥

తా॥ యీ పదునెనిమిది గురి వల్లనున్నూ యింకా కొందరైన ఋష్యుత్తముల వల్లనున్నూ యీ జ్యోతిశ్శాస్త్రము సిద్ధాంత, జాతక, ముహూర్తాది భాగములుగా జెప్పబడెను॥

అందులో ప్రథమస్కంధమై సిద్ధాంతభాగమందు సూర్య, సోమ, ఆర్యభట, బ్రహ్మ, లోమశ, వ్యాస, పౌలస్త్య, వాసిష్ఠము లను అష్ట సిద్ధాంతములు గలవు॥ మహాత్ములచే వ్రాయబడిన ఈ సిద్ధాంతసారములచే భాస్కరాచార్యులు మొదలగువారు చేసిన గ్రంథము లనేకములు గలవు. అవి మనకు మహోపకారములు చేయుచున్నవి.

అట్టి మహాత్ములచే రచియింపబడిన॥



గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1 | అహోబిలనాథీయము | 9 | సిద్ధాంతప్రతిభాగ |
| 2 | వెంకటాచలనాథీయము | 10 | గణకానందము |
| 3 | సిద్ధాంతశిరోమణి | 11 | సిద్ధాంతమానసము |
| 4 | సిద్ధాంతరత్నాకరము | 12 | గ్రహలాఘవము |
| 5 | సిద్ధాంతసింధు | 13 | ఖచరదర్పణము |
| 6 | సిద్ధాంతకౌముది | 14 | పంచాంగపద్ధతి |
| 7 | సిద్ధాంతముక్తావళి | 15 | పంచాంగభూషణము |
| 8 | తిథిచక్రము | 16 | మల్లినాథీయము |

ఇత్యాది కొన్ని తాంత్రికములు సిద్ధాంతోపయోగములుగానున్న

ద్వితీయస్కంధమందు.

| | | | |
|---|---|---|---|
| 1 | బృహజ్జాతకము | 16 | జాతకకల్పతరు |
| 2 | శ్రీపతి | 17 | జాతకసింధు |
| 3 | జాతకశిరోమణి | 18 | జాతకచంద్రిక |
| 4 | జాతకపారిజాతము | 19 | గోపాలరత్నాకరము |
| 5 | జాతకరత్నావళి | 20 | భావార్థరత్నాకరము |
| 6 | జాతకముక్తావళి | 21 | బృహన్నారదీయము |
| 7 | జాతకాలంకారము | 22 | పారాశర్య |
| 8 | లఘుజాతకము | 23 | జైమునీసూత్రము |
| 9 | వృద్ధపారాశర్య | 24 | జ్యోతిషకౌముది |
| 10 | చింతామణి | 25 | జాతకకౌముది |
| 11 | సర్వార్థచింతామణి | 26 | నీలకంఠతాజకము |
| 12 | ఫలగ్రంథము | 27 | బాలనారదీయము |
| 13 | దశాభుక్తి ఫలగ్రంథము | 28 | నారదీయము |
| 14 | ఉడుదశాప్రదీపిక | 29 | సభారంజని |
| 15 | రామతాజకము | 30 | కేరళము |

ఇత్యాద్యనేక గ్రంథములు జాతకోపయోగములుగనున్న॥

## తృతీయస్కంధమందు.

| | | | |
|---|---|---|---|
| 1 | కాలామృతము | 5 | ముహూర్తదీపిక |
| 2 | ముహూర్తమార్తాండము | 6 | ఫలగ్రంథము |
| 3 | ముహూర్తదర్పణము | 7 | దైవజ్ఞవిలాసము |
| 4 | కాంస్యంసంహిత | 8 | ముహూర్తరత్నాకరము |

ఇత్యాదిగ్రంథములు ముహూర్తములకున్ను,

| | | | |
|---|---|---|---|
| 1 | కృష్ణవాస్తు | 3 | శిల్యవాస్తు |
| 2 | సనత్కుమారవాస్తు | 4 | మయవాస్తు |

ఇత్యాదిగ్రంథములు గృహారూపాది విషయములకున్ను॥

| | | | |
|---|---|---|---|
| 1 | భువనప్రదీపిక | 3 | చప్పన్నము |
| 2 | లంపాకము | 4 | పంచపక్షి |

ఇత్యాదిగ్రంథములు ప్రశ్నవిచారమునకున్ను॥

1. సర్పఫణి. 2. సప్యానందము. మొదలగునవి వర్షమునకున్ను॥

ఈప్రకారము యీశాస్త్రములు త్రిస్కంధముల కాధారములుగా పైవారలచే చెప్పంబడినవి.

ఇట్టి మహాశాస్త్రము ఈ ప్రపంచకమునందు సర్వజనులకు సర్వవిధములుగా కరతలామలకముగా నుండు ఈజ్యోతిశ్శాస్త్రము యొక్క మూడుశాఖలలో సిద్ధాంతజాతకము లనెడి రెండుశాఖల యందు జెప్పబడిన దృష్టాంతరములు కేవలనిదర్శనములుగా నుండే టప్పుడు శేషించిన మూడవశేఖయందు గర్భాదానసీమంత నామకరణ, అన్నప్రాశనచౌల, ప్రయాణవైవాహిక, నూతనగృహప్రతిష్ఠాది సమస్తముహూర్తములకు, జ్యోతిష్కుడు నిర్ణయించిచెప్పబడిన సుముహూర్తములయందు ఆయాశుభకార్యములు యజమానులు జరిగించినంతట శుభఫలముల ననుభవించుచుండు రనుటకు యీవిషయములు అప్రత్యక్షములుగా నున్ననూ॥



దృష్టాంతరము యేమంటే॥

ఒక ఫలవృక్షమునందు కొన్నిశాఖలు గలవు. అట్టిశాఖలయందుద్భవించిన యావత్ఫలములు ఒకేవిధముగా నుండున ట్లనుభవమే గదా అటువలెనే మూడవశాఖలో జెప్పంబడు ఫలములున్ను పై రెండిటికి తుల్యముగానే వుండుననుట కేలాటి సందేహములు లేవు. గాన ఇట్టి ప్రత్యక్షరూపమైన ఈ శాస్త్రమునే కేవల దైవస్వరూపముగ నమ్మిన॥

శ్లో॥ జ్యోతిశ్శాస్త్రాజ్జాయతేచా యుషాదా।
ఆయుజ్ఞానా జ్జాయతే ధర్మబుద్ధిః।
ధర్మజ్ఞానా త్ప్రాప్యతే బ్రహ్మవిద్యా।
బ్రహ్మజ్ఞానా త్ప్రాప్యతే మోక్షలక్ష్మీ॥

తా. ఈ జ్యోతిషశాస్త్రమువల్ల ఆయుర్భావాదులు తెలియబడును. అట్లు ఆయురోగ్యాదులు తెలియుటచే ధర్మబుద్ధి గలుగును. ఈ ధర్మబుద్ధిచేత బ్రహ్మవిద్య తెలియబడును. అట్టి బ్రహ్మవిద్యవల్లనుండి మోక్షలక్ష్మిని పొందగల్గుననిన్ని తాత్పర్యము.

శ్లో॥ జ్యోతిశ్శాస్త్రే వినిశ్చిత్య హోరారికం ఫలమీరితమ్।
ఇష్టానిష్టపరిజ్ఞానా దనిష్టస్యప్రశాంతయే।
ఇష్టసాధనసిద్ధ్యర్థ ముపాయోయం ప్రదర్శితః॥

తా॥ జ్యోతిశ్శాస్త్రమును చక్కగ నాలోచించిన యెడల శుభాశుభ ఫలముల జక్కగ దెలిసికొనవచ్చును. మనకు దెలియబడకయే వచ్చునట్టి శుభాశుభములను దెలిసికొనుటకు భగవంతుడీ శాస్త్రమును నిర్మించెనని తాత్పర్యము॥

యీశాస్త్రము ప్రత్యక్షఫల జనంబగుటచే మన భరత ఖండమునందేగాక ఐరోపా, అమెరికా, మొదలగు విదేశ జాతీయుల వల్లను అంగీకరింపబడి గౌరవము పొందబడుచున్నది॥

[ జాతక సారావళి॥ ]

శ్లో॥ విధాత్రాలిఖితాయాసా లలాటాక్షరమాలికా।
దైవజ్ఞస్తాంపఠేద్వ్యక్తం హోరానిర్మలచక్షుషా॥

తా॥ జాతకుడు మాతృగర్భమునందు ప్రవేశించినప్పుడు వాని లలాటమునందు బ్రహ్మ వారివారి సుకృత దుష్కృత ఫలమును నక్షరపంక్తిగ వ్రాసియేయుంచెను. వాటిని కాలజ్ఞానమును దెలసిన జ్యోతిష్కుడు జాతకమనెడు నిర్మల నేత్రమువలన చూచి జదివి వినుపించుచున్నాడు॥

శ్లో॥ యస్యనాస్తి ఖలుజన్మపత్రిక, యాశుభాశుభఫలప్రదర్శినీ।
అంధకంభవతితస్య, జీవితం దీపహీన మివమందిరంనిశి॥

తా॥ యెవనికి శుభాశుభ ఫలములను దెల్పు జాతకము లేదో వాని జీవితము రాత్రియందు దీపములేని గృహమువలె వ్యర్థమై యుండును॥

జ్యోతిషము తెలియనివానిస్థితియు నదేవిధముగా యుండును. గనుక యీ శాస్త్రమును ప్రతివారును శ్రద్ధతో నభ్యసించుట మిక్కిలి యావశ్యకము॥

శ్లో॥ అర్థార్జనేసహాయః పురుషాణా మాపదార్ణవేపోతః।
యాత్రాసమయేమంత్రీ జాతకమపహాయనాస్త్యపరః॥

తా. అని జాతకసారావళియందు జెప్పబడిన ప్రకారము జ్యోతిశ్శాస్త్రము పురుషునకు ధనసంపాదనంబున సహాయంబును ఆపత్సముద్రంబున నోడవలెను యాత్రాసమయమున మంత్రివలె నుండును॥

1. అర్థార్జనే సహాయః॥

వ్యవసాయ, విద్య, ఉద్యోగ, వాణిజ్యాది ప్రయత్నమును జేయువారికి జ్యోతిష్కుడు జాతకమునుజూచి ముందు శుభఫలముల నిచ్చు గ్రహములయొక్క మహాదశాంతర్దశలు వచ్చుచున్నవి. యనియు నప్పుడు గొప్ప ధనలాభము గలుగుననియు దలచినపని చేకూరుననియు జెప్పునప్పుడున్ను॥

2. ఆపదార్ణవేపోతః॥

ఎవనికైననూ రాజ్యముగాని దేశముగాని భూములుగాని పోయియుండి ఆపత్సముద్రములో మునిగియున్నపుడు జ్యోతిష్కుడు



జాతకముజూచి పోయిన యాస్తినిగాని రాజ్యము మొదలగునవిగాని తిరిగివచ్చునని చెప్పునపుడును ఎవనికైనను భార్యగాని సంతానము గాని పోయినపుడును,రోగపీడితుడై యుండునపుడును తిరిగి వివాహ మగుననియు సంతానము కలుగుననియు ఆరోగ్యభాగ్యములు గలుగు నని జెప్పునపుడును॥

3. యాత్రాసమయే మంత్రీ॥

యాత్రాసమయమునం దేదిక్కునకు బోయిన జయమగునో ఎట్టిసమయమున వెడలిన తలచినకార్యము సఫలమగునో చెప్పు నపుడు ప్రతిమనుష్యునకు నొకవిధమైన నాశయు మనోల్లాసము ఉత్సాహమును గలిగి బహుధైర్యముగ నుందురు. అట్టిధైర్యము వలన సాహసము గలిగి తాము చేయునన్నిపనులును నన్నియత్నము లును పట్టుదలతోడను శ్రద్ధాభక్తులతోడను జేయుట గలుగును. అం దువలన బ్రతివానికి దాముచేయు ప్రయత్నమును గోరికలను నీడేరి సఫలమగుచుండును॥

శ్లో॥ అగణిత సాంవత్సరిక మద్గుణహీనస్తు జగతియోమంత్రి।
శాస్త్రవిహీనో వైద్యస్త్రయః పురుషాభవంతి యమదూతాః॥

తా॥ గణితము తెలియని దైవజ్ఞుడును, గుణహీనుడగు మం త్రియు, శాస్త్ర విహీనుడగు వైద్యుడును ఈముగ్గురు లోకమునకు యమదూతలని యర్థము॥

శ్లో॥ జ్యోతిషంవ్యవహారంచ ప్రాయశ్చిత్తం చికిత్సకం
వినాశాస్త్రేణయోబ్రూయాత్తమాహుర్బ్రహ్మఘాతినం॥

తా॥ జ్యోతిష, వ్యవహార, ప్రాయశ్చిత్త వైద్యములయందు శాస్త్రంవినాయెవరు చేయుదురో అట్టివారు బ్రహ్మహత్య అనే మహా పాతకమును బొందుదురు॥

[ దైవజ్ఞలక్షణం॥ ]

శ్లో॥ అధీతవేదఃకులశీలయుక్తః సిద్ధాంతహోరా ఖిలసంహితజ్ఞః।
అచంచలోరూపయుతః కృపావాన్, త్రిస్కంధశాస్త్రాధ్యయ ను నాధికారీ॥

తా॥ వేదాధ్యయనము చేయబడిన దాచారయుతుడుగానుండి సిద్ధాంత హూరా శాస్త్రాదులు చక్కగా తెలుసుకొనబడి నిశ్చల చిత్తుడుగాను రూపవంతుడుగాను ఆర్ద్రహృదయుడుగాను నున్నవాడే యీశాస్త్రమున కధికారియగును॥

శ్లో॥ అద్వేషీనిత్యసంతోషీ గణితాగమపారగః।
సౌమ్యశ్చసత్యభాషీచ సదైవజ్ఞః ప్రకీర్తితః॥

తా॥ ద్వేషములేక నిత్యసంతోషిగా సిద్ధాంతాది స్కంధ త్రయములు బాగుగా తెలియబడి శాంతవృత్తితో సత్యభాషిగా నుండువాడే దైవజ్ఞుడని తాత్పర్యము॥ గనుక యీశ్లోకార్థముల ప్రకారముండువాడు దైవజ్ఞుడు అనగా జ్యోతిష్కుడు॥

ఇట్టి జ్యోతిశ్శాస్త్రమును॥

శ్రీమదఖండధాత్రీ మండలమండనాయమాన భారతసార్వభౌములగు శ్రీయుత విక్టోరియామహారాణీ సప్తమయడ్వర్డు ఇండియా ప్రస్తుత సార్వభౌములగు శ్రీమేరీ జార్జిచక్రవర్తిగారికిని వీరి రాజకుటుంబములలోని వారికిని గ్రీసు, ఇటలీరాజులకును, రష్యా జపాన్ చక్రవర్తులు మొదలగువారికి జాతకములున్నవి॥

మరియు,

వేదములయందును భగవంతునియందును నమ్మకములేని బౌద్ధమతస్థులుకూడ యీశాస్త్రమును నమ్మియున్నట్లు తెలియుచున్నది। ఎట్లనిన॥

సుమారు 2500 సంవత్సరములక్రిందట హిమవత్పర్వతమునకు దక్షిణమునన్న నేపాళదేశములో రోహిణీనదీతీరమునందు కపిలవాస్తువను గ్రామముండెను ఈగ్రామమును శుద్ధోదనుడను రాజు పాలించుచుండెను ఇతనికి మాయాదేవియను భార్యగలదు. వీరికి నొకపుత్రు డుదయించెను. ఈపుత్రునకు సర్వార్థసిద్ధుడని నామకరణం బొనర్చిరి. అప్పుడక్కడనుండు బౌద్ధజ్యోతిష్కుడగు అసిత ఋషిచేతను జాతకమును వ్రాయించిరి. ఆజాతకమును జూచి తుషితలోకవాసియైన ప్రభాపాలు డిట్లవతరించెననియు, నీ శిశువునకు దేవతాలక్షణములు ముప్పదిరెండును, మనుష్యలక్షణము లెనుబదియును గలవనియును లోకమంతయు నుతింపదగిన మతాచార్యు డగుననియు మతమును స్థాపించుననియు మొదలగు ఫలములు చెప్పెను, ఈ జాతకప్రకారము సర్వార్థసిద్ధుడు సకలవిద్యలునేర్చి బోధివృక్షము (రావిచెట్టు) క్రింద వీరాసనస్థుడై నిమీలితలోచనుండై నిష్ఠాగరిష్ఠతను బొందియుండుట వలన బుద్ధుడని పేరువడసె. ఈయనయె బౌద్ధమతమును స్థాపించెను. ఈబుద్ధుని కాలముననే లంకాపట్టణమందు ఆ నవముదర్శియను బౌద్ధుడు జ్యోతిష్కుడుగనుండి దైవజ్ఞకామధేనువు అను జ్యోతిషగ్రంథమును రచియించెను. ఇంకనూ,



శ్లో॥ మ్లేచ్ఛాహి యవనస్తేషు సమ్యక్శాస్త్ర మిదంస్థితం।
ఋషివత్తేపిపూజ్యంతే కింపునర్దైవవిద్ద్విజః॥

తా॥ అను గార్గ్యవచన ప్రకారము మహమ్మదీయులు కొందరు యీ శాస్త్రమును దెలుసుకొని ఋషులవలె పూజింప బడుచుండిరి. మొగలాయి చక్రవర్తి గారికి కూడా జాతక ముండెను. యవనాచార్యులనువారు వృద్ధ యవనజాతకమును, యవన తాచకమును మొదలగు జ్యోతిష గ్రంథముల జేసియుండిరి

సిద్ధసేనుడు మొదలగు బౌద్ధులును జైనులును, ననేక జ్యోతిష గ్రంథములు జేసియుండిరి.

మహీంద్రసూరియను బౌద్ధ జ్యోతిష్కుడు యింద్రరాజనును నామంబున యంత్రశాస్త్రమును రచియించెను.

వేదములు నిజమనియు భగవంతు డున్నాడనియు ప్రత్యక్షముగ నెవరివలన దెలియునో యట్టి శ్రీరాములు, శ్రీకృష్ణమూర్తి మొదలగు నీశ్వరాంశ సంభూతులును ధర్మరాజు, అర్జునుడు మొదలగు దేవతాంశ సంభూతులును మతోద్ధారకులును మతమును బోధించెడు గురువులును నగు శ్రీ ఆదిశంకరులు, నీలకంఠులు,

ర్రామానుజులు, మధ్వాచార్యులు, అప్పయదీక్షితులు సాంబలింగ మూర్తిస్వాములు, నల్లాచార్యులు, నాగాచార్యులు, రుద్రముని స్వాములు, నాగలింగమూర్తిస్వాములు మొదలగు వారలు జాతక ములు గలిగియుండిరి.

గనుక సర్వజనసమ్మతంబై యాదరణంబొందిన ఈ జ్యోతిశ్శాస్త్రమున్ని శాస్త్రములకును మూలమైయున్నది. అట్టి శాస్త్రమునకు మూలకారణమగు భగవత్స్వరూపమైన శింశుమార చక్రము యొక్కస్వరూపము నుదహరించెదను.



### 3. శింశుమార చక్రస్వరూప లక్షణము.

పరిపూర్ణసత్యజ్ఞానానందాది లక్షణయుత పరబ్రహ్మంబు స్వ మాయాశక్తివలన పాంచభౌతికాంత ర్భూతంబగు భచక్రంబుగాను రవ్యాది గ్రహమండలంబులుగాను పరిణమించెను. వీని గుణధర్మం బులు భూగోళమందు వ్యాపించినందున ప్రారబ్ధకర్మాను సారముగా భూమియందు జన్మించు మనుష్యాదులకు జంతువులకు సుఖదుఃఖ ఫలంబులు కలుగుచున్నవి. అట్టుకలిగెడు ఫలములం దెలియుటకై సర్వజ్ఞులగు ఋష్యాదులు జాతకశాస్త్రములను నిర్మించిరి. జాతక ఫలములు స్పష్టముగా దెలియుటకును, నిత్యనైమిత్తిక యజ్ఞాది కర్మలం జేయుటకును (భచక్రగ్రహగతి) మూలకారణమైయున్నది.

( భచక్రస్వరూప మేమనిన )

అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర్ష, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, (అభిజిత్) దీనిపూర్వభాగము ఉత్తరాషాఢకున్ను ఉత్తరభాగము



శ్రవణమునకున్ను చేరియున్నది, శ్రవణము, ధనిష్ఠ, శతతార, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి. ఇవి ౨౭ నక్షత్రములు. ఈ ౨౭ నక్షత్రాత్మకమే భచక్రమనబడును.

మరియు నక్షత్రము ౧-కి నాలుగేసిపాదములచొప్పున భచక్రమునకు ౧౦౮ నక్షత్రపాదములగును. మరియు॥

అశ్వని ౪ పాదములును భరణి ౪ పాదములును కృత్తికలో ౧ పాదమును చేరి నక్షత్రపాదములు ౯ కి ఒక మేషరాశియగును. ఇట్లు నక్షత్రపాదములు ౯ - ఒక్కొక్కరాశివంతున ౧౦౮ నక్షత్ర పాదములకు క్రమముగా మేషము, వృషభము, మిధునము, కర్కాటకము మొదలైన సంజ్ఞలుగల ద్వాదశరాశ్యాత్మక చక్రమగును. ఈద్వాదశరాశ్యాత్మకచక్రము భగణ, రాశి, భాగ, లిప్త, విలిప్తా, రూపములుగా గుణింపబడును.

అందు విలిప్తలు ౬౦ కి ఒకలిప్తవంతునను, లిప్తలు ౬౦ కి ఒక భాగము వంతునను, భాగములు ౩౦ కి ఒక రాశి వంతునను, రాసులు ౧౨ కి ఒక భగణమువంతున నెరుంగవలయును.

మరియు ఒక నక్షత్రపాదమునకు ౩ దినములు ౨౦ ఘడియల వంతున భచక్రమునకు ౩౬౦ భాగము లగును. మరియు॥ భాగము నకు ౬౦ లిప్తలువంతున భచక్రమునకు ౨౧౬౦౦ లిప్తలగును. ఒక లిప్తకు ౬౦ విలిప్తలవంతున గుణించుకొనవలయును. నక్షత్రము ౧ కి ౮౦౦ లిప్తలును నక్షత్రపాదము ౧ కి ౨౦౦ లిప్తలును అయినవి.

మరియు॥ అశ్వనికి తూర్పున భరణియు భరణికి తూర్పున కృత్తికయు కృత్తికకు తూర్పున రోహిణియు రోహిణికి తూర్పున మృగశీర్షయు ఈప్రకారము ౨౭ నక్షత్రములును వరుసగా మండలాకారము గలిగి తూర్పుముఖముగా నున్నవి. ఈభచక్రము తూర్పు నుండి పడమరకు దిరుగుచు ఒకదినమునకు ఒకపర్యాయము కులాల చక్రమువలె దిరుగుచున్నది. ఆచక్రముతో గూడ రవ్యాదిగ్రహ

ములు లాగబడుచు పడమరకు బోవునట్లు తోచుచున్నదేగాని కులాల చక్రముమీద దానికి వ్యత్యయముగ దిరుగుచుండు. కీటకమువలె ఆరవ్యాదిగ్రహంబులు పడమరదిశనుండి నక్షత్రక్రమంబున తూర్పునకు బోవుచున్నవి. కనుక రవ్యాదిగ్రహంబులకు సత్యమైనది ప్రాగ్గతియేగాని ప్రత్యగ్గతికాదు ఇట్లు సూర్యసిద్ధాంతమందు.

శ్లో॥ పశ్చాద్వ్రజంతో౽తిజవాన్నక్షత్రైస్సతతంగ్రహాః।
జీయమానాస్తులంబంతే తుల్యమేవ స్వమార్గగాః।
ప్రాగ్గతిత్వమతస్తేషాంభగణైః ప్రత్యహంగతైః।
పరిమాణవశాద్భిన్నాతద్వశాద్భానిభుంజతే॥

అని చెప్పబడియున్నది. మరియు॥ యుగభగణోపదేశముం జేయునపుడు

శ్లో॥ యుగేసూర్యజ్ఞశుక్రాణాంఖచతుష్కరదార్ణవాః।
కుజార్కిగురుశీఘ్రాణాంభగణాః పూర్వయాయినాం॥

అను వాక్యమందు రవ్యాదులకు (పూర్వయాయినాం) అనెడి పదము ప్రయోగించినందున వారలకు ప్రాగ్గతియేగాని పశ్చాద్గతి కాదు ౨౧౬౦౦ లిప్తలుగల భచక్రక్షేత్రము ననుసరించి.

1 దానిక్రింద ............ శనికక్ష్యయు.
2 దానిక్రింద ............ గురుకక్ష్యయు.
3 దానిక్రింద ............ కుజకక్ష్యయు.
4 దానిక్రింద ............ సూర్యకక్ష్యయు.
5 దానిక్రింద ............ శుక్రకక్ష్యయు.
6 దానిక్రింద ............ బుధకక్ష్యయు.
7 దానిక్రింద ............ చంద్రకక్ష్యయు.
8 దానిక్రింద ............ భూగోళంబును నున్నవి.

ఈకక్ష్యలు అల్పాధికభావములం గలిగియున్నందున గ్రహములకు గతిభేదము గలుగుచున్నది అధికగతిగల గ్రహము భచక్రము న్వల్పకాలమునకు చుట్టివచ్చును. గనుక అట్టి గ్రహములు



శీఘ్రులనియు అల్ప గతిగల గ్రహము భచక్రమును బహుకాలమునకు చుట్టివచ్చును. గనుక అట్టి గ్రహములు మందులనియు సంజ్ఞలు చేయబడి యున్నవి.

సూర్యుడు రమారమి దినమునకు ౬౦ లిప్తల క్షేత్రమును నడుచును. గనుక ఒక దినమునకు ౧ భాగమువంతున నెల ౧ కి ఒక రాశి ౧౮౦౦ లిప్తల క్షేత్రమును నడుచును.

ఇట్లు సంవత్సరము ౧ కి ౨౧౬౦౦ లిప్తల క్షేత్రమైన ద్వాదశరాశ్యాత్మక భచక్రమును ఒక చుట్టిచుట్టి వచ్చును. ఇట్టి సంవత్సరములు ౪౩,౨౦,౦౦౦ గలది ఒక మహాయుగ మనబడును మహాయుగమనగా కృత, త్రేతా, ద్వాపర, కలియుగము లనెడు నాల్గింటి సముదాయము అందు॥

| | | |
|---|---|---|
| కృతయుగ ప్రమాణము | ౧౭౨౮౦౦౦ | సంవత్సరములును |
| త్రేతాయుగ ప్రమాణము | ౧౨౯౬౦౦౦ | సంవత్సరములును |
| ద్వాపరయుగ ప్రమాణము | ౮౬౪౦౦౦ | సంవత్సరములును |
| కలియుగ ప్రమాణము | ౪౩౨౦౦౦ | సంవత్సరములును |

అట్టి మహాయుగములు ౭౧-కి ఒక మన్వంతర మగును॥ అట్టి మన్వంతరములు ౧౪ అయినయెడల బ్రహ్మకు పగటికాలము ఒక (అహస్సు) అగును. అదియే కల్పమనబడును. సంధికాలములం జేర్చగా ఒక కల్పమునకు ౧౦౦౦ వేయి మహాయుగము లగును. ఇట్టి కల్పములు ౨కి బ్రహ్మకు ఒక అహోరాత్రము (దినము)అగును. అట్టి దినములు ౩౬౦ చేత బ్రహ్మకు ఒకసంవత్సర మగును. అట్టి (౧౦౦) నూరు సంవత్సరము లాయువు గలవాడు బ్రహ్మదేవుండు. బ్రహ్మకు అట్టి శతసంవత్సరములలో యిప్పటివరకు ౫౦ వత్సరములు గతించినవి. ౫౧ సంవత్సరములో ప్రథమకల్పంబున స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుషులు అనెడు (౬) అరుగురు మనువులు గతించిరి. ఇపుడు (౭) సప్తమంబగు వైవస్వత

మన్వంతరములో ౨౮ దవ మహాయుగములో కలియుగము జరుగ చున్నదని తెలియవలెను.

చంద్రుడు దినము ౧-కి సుమారు ఒక నక్షత్రమనగా ౮౦౦ లిప్తలు క్షేత్రమును నడుచును.

కుజుడు దినము ౧-కి ౩౧ ¼ లిప్తల క్షేత్రమును
బుధుడు దినము ౧-కి ౨౪౫న్నర లిప్తల క్షేత్రమును
గురువు దినము ౧-కి ౫ లిప్తల క్షేత్రమును
శుక్రుడు దినము ౧-కి ౯౬ లిప్తల క్షేత్రమును
శని దినము ౧-కి ౨ లిప్తల క్షేత్రమును
రాహువు దినము ౧-కి ౩ లిప్తల ౧౧ విలిప్తల క్షేత్రమును
కేతువు దినము ౧-కి ౩ లిప్తల ౧౧ విలిప్తల క్షేత్రమును
నడచెదరు.

అందు. రవ్యాది సప్త గ్రహంబులు సవ్య గ్రహంబులును రాహు కేతువులు అపసవ్యగతి గలవారు నగుదురు. అందు సూర్య చంద్రులకు వక్రగతి లేదు. కుజాది పంచతారాకార గ్రహములకు॥

శ్లో॥ వక్రానువక్రాకుటిలా మందామందతరాసమా।
శీఘ్రాతిశీఘ్రవిజ్ఞేయా గ్రహాణామష్టధాగతిః॥

అను సూర్యసిద్ధాంత ప్రకారము వక్రాది అష్టవిధ భిన్న గతులు గలవు. గ్రహము సూర్యునకు దూరమైనపుడు వక్రించును. సూర్యునకు సమమైనపుడు అస్తమించును. అస్తమంబున అతిచార గతియు, వక్రంబున మందగతియు నగును. ఆయాగ్రహగతుల ప్రకారము ఇష్టకాలమునకు గ్రహస్ఫుటీకరణము కొరకు తిథి, నక్షత్ర, యోగ, కరణ, త్యాజ్య, గ్రహయుద్ధ, సమాగమ, విక్షేప, క్రాంతి, గ్రహణాది, కాలపరిమాణ జ్ఞానముకొరకు సూర్య, బ్రహ్మ, వాసిష్టాది అష్టసిద్ధాంత శాస్త్రములు యేర్పడియున్నవి.



గనుక నోసదయులారా జ్యోతిశ్శాస్త్రమనెడి పాలసముద్రమును బరిశోధించుటవలన గలిగిన సారాంశమును సంగ్రహించి సకలవిద్వత్సమూహ రమ్యంబగునట్లు మృదుపదములు గలదియును, బాలురకు సహితము సులభముగ దెలియునదియును నగు "దైవజ్ఞ శిఖామణి" యను గ్రంథమును సూక్ష్మముగా నితర గ్రంథాపేక్ష లేనట్లు నాచే సంగ్రహరూపముగా సిద్ధాంత, జాతక, ముహూర్తాది విషయములు, ప్రశ్న భాగ వాస్తులక్షణము, మొదలగు ననేకవిషయములు జేర్చి సామాన్య జ్ఞానముగల ప్రతిమనుజునకు దెలియునటుల ముద్రింపించితిని. గాన తాము ఈగ్రంథమును సమగ్రముగా నాలోకించి యిందలి విషయములను చక్కగా గ్రహించి తత్ఫలితమును బొందగోరుచున్నాను.

ఈప్రథమ ముద్రణమున కొన్ని లోపములున్నను నుండవచ్చును గుణగ్రహణ ధురీణులగు విద్వచ్ఛిఖామణులు మన్నించి తెలియజేసిన పునర్ముద్రణమున సవరణ చేయబడును.

ఇట్లు.
పుత్సల - వీరభద్ర సిద్ధాంతి.

---

శ్రీరస్తు.

# దైవజ్ఞ శిఖామణి.

## ఇష్ట దేవతా ప్రార్థన.

శ్లో॥ వందే విశ్వేశ్వరం దేవం గణనాథం గజాననమ్।
ధ్యానేన యస్యప్రత్యూహా విలయంయాంతి దూరతః॥

తా॥ ధ్యానము చేయుటవలన, సకలవిఘ్నములును, దొలగించువాడును, ప్రపంచమున కీశ్వరుడును, గణాధిపతియును సర్వప్రపం

చమునకును, నధిపతియును, ఏనుగయొక్క ముఖముగలవాడును, నగు విఘ్నేశ్వరునకు నమస్కారము చేయుచున్నాను॥

శ్లో॥ శ్రీగౌరీకుచయుగ్మగుచ్ఛ విహరద్భృంగం శరణ్యంసదా।
సంసారార్ణవ కర్ణధారమఖిలా భీష్టప్రదంముక్తిదం॥
శ్రీమత్కౌశిక పావనీనదితటే ప్రత్యగ్దిశోభాసురం।
వందే శ్రీబండారులంక నిలయం శ్రీరామలింగేశ్వరం॥

అథ గురు ప్రార్థనమ్.

శ్లో॥ ఆద్యాం ఈశ్వరఫాలనేత్రజననం బ్రహ్మాదిభిః పూజితం।
ప్రావీణ్యం పరమంపవిత్రకుశలం సూత్రాదికారం మహత్।
ఓంకారాంతరదీప్యమాన నిగమ స్తోత్రార్హమానంశివం।
శ్రీదేవాంగ గురున్నమామి సతతం హృత్సారసేభావయే॥

శ్లో॥ లక్ష్మీశ్రేష్ఠికులాంభోధేః సంజాతేం దుపరోయశః।
కాళహస్తీశ్వరాభిఖ్యం శివజ్ఞంమద్గురుంభజే॥

గ్రంథకర్త తానిప్పుడు గ్రంథమును, నిర్విఘ్నముగా సమాప్తినొందుటకు, శ్రీమంతమగు రజితగిరి పర్వతమందు, కృతయుగాదిగా, నివసించునట్టియు, ఆదిమధ్యాంత రహితుండును, దేవదేవుండును, ఇష్టముల నిచ్చువాడును, మంగళప్రదుండును, పార్వతీసమేతుండును, పాపనాశకరుండును, భక్తవత్సలుండును, నగు శ్రీరామలింగేశ్వరునకు నమస్కరించి అస్మద్గురువులగు లక్ష్మీశ్రేష్ఠి కాళహస్తీశ్వర సిద్ధాంతిగారికి నమస్కారములు జేసినవాడై, గంగయామాత్యునివలన జన్మించిన, వీరభద్రసిద్ధాంతిచే, ఈగ్రంథము, శాలివాహన శకము 1844 సంవత్సరము, గతమగుచుండగా, దుందుభినామసంవత్సర వైశాఖశుక్లపూర్ణిమా గురువాసరంబున వ్రాతసంపూర్తిచేయబడెను॥

[6]

శ్రీరస్తు.

శ్రీబాలా పరమేశ్వరీ దేవ్యైనమః.



# దైవజ్ఞశిఖామణి.

## ప్రథమ కాండః.



### పార్వత్యువాచ.

శ్లో॥ దేవదేవమహాదేవ త్రికాలజ్ఞమహేశ్వరః।
దైవజ్ఞస్యశిఖామణి స్సంక్షేపేణ వదస్వమే॥

తా. పార్వతీదేవి మహేశ్వరునిగాంచి యో దేవాదిదేవ నీవు వర్తమాన భవిష్య ద్భూతకాలముల నెరింగిన వాడవు ఓ మహేశ్వరా నాకు దైవజ్ఞశిఖామణియను, గ్రంథరత్నమును, సంగ్రహముగ దెలుపుము.

శ్లో॥ అనుగ్రహార్థంలోకస్య మయికారుణ్య మాశ్రితః।
దైవజ్ఞశాస్త్రంసారంచ ఫలభాగం వదస్వమె॥

తా. ఓ దేవా లోకముల ననుగ్రహించుకొరకు, నాయందు కారుణ్యముచేసి జ్యోతిషశాస్త్రమున సారముగనుండెడి ఫలభాగమును, నాకు చెప్పుము. అని అడిగెను. అందుకు ఈశ్వరుడు చెప్పుచున్నాడు.

### ఈశ్వర ఉవాచ.

శ్లో॥ శ్రుణుదేవి ప్రవక్ష్యామి సావధానేనచేతసా॥

తా. ఓపార్వతీ నీవడిగిన జ్యోతిశ్శాస్త్ర సారమును చెప్పె

దను జాగరూకతగల మనస్సుతో వినుము.

శ్లో॥ సప్తవింశతితారాణా మశ్వాదీనాం పృథక్పృథక్।
పాదైశ్చతుర్భిర్గగనే శింశుమారం ప్రతిష్ఠితం॥

తా. నాలుగు పాదములుగల అశ్విన్యాది ౨౭ నక్షత్రములకును, ఆకాశమందు భగవంతునిచేత నివాస యోగ్యమగు శింశుమారమను పేరుగల చక్రమొకటి నిర్మింపబడెను.

శ్లో॥ ప్రాక్ప్రాగ్గతోడుచక్రంత దష్టోత్తరశతాంఘ్రికం।
ప్రత్యఙ్ముఖం చలత్యేవ మేరోర్నిత్యం ప్రదక్షిణమ్॥

తా. ఉడుచక్రము, ప్రాగ్భాగమునందు నూటయెనిమిది పాదముల ప్రమాణముగలదై నిర్మింపబడినది. అది ప్రత్యఙ్ముఖముగా మేరుపర్వతమునకు, ప్రదక్షిణ క్రమమున దిరుగుచుండునని తాత్పర్యము.

మూ॥ తదధశ్శని గురుర్వార సూర్యశుక్ర బుధేందవః।
ప్రాగ్యాయినోపి చక్రేణ యాంతిభూమేః ప్రదక్షిణం॥

తా. ఆ చక్రమునందుండు, శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్రులనెడి గ్రహములు పడమరనుంచి, తూర్పు గమనము గలవారైనను, భచక్రముచేత భూమికి ప్రదక్షిణము బొందుచున్నారు.

మూ॥ భూతారాగ్రహగోళానాం ఖస్థానాం గుణసంక్రమాత్।
భౌతికానాంచ జంతూనాం భిత్యం తేహి గుణక్రియాః॥

తా. ఆకాశమందుండెడి భూమియొక్కయు, నక్షత్రగ్రహగోళములయొక్కయు, గుణసంకీర్ణమువలన, పృథివ్యాది భూతకార్యములకును, మనుష్యాది జంతువులకును, గుణక్రియలు భేదింపుచున్నవి.



మూ॥ తత్తత్కర్మవిపాకస్య సూచకం గోళలక్షణం।
జ్ఞాత్వాతదను సారేణ జన్మాదిఫలమున్నయేత్॥

తా. ఆయాకర్మ పరిపక్వసూచకమగు గోళలక్షణం బెరింగి, దాని యనుసరణముగా జన్మాదిఫలము నూహించవలెను.

మూ॥ భౌమఃకవిజ్ఞేం ద్వినసౌమ్యశుక్ర
వక్రేజ్య మందార్క సుతామరేజ్యాః।
మేషాదిభానా మధిపాఃక్రమేణ
తదంశకానామ పితేభ వేయుః॥

తా. మేషాది ద్వాదశరాసులకును, అనవాంశ రాసులకును, క్రమంబున, కుజశుక్రబుధ, చంద్రరవిబుధ, శుక్ర, కుజ, గురు, శని, శని, గురువులు, అధిపతు లగుదురు.

మరియు॥ భూమియందు మనుష్యులకు, జాతకభావమందు యేఫలము చెప్పబడునో, దానిని, ప్రశ్నభాగమందును ఋషులు చెప్పుచున్నారు. ప్రశ్నకాలఫలంబు జననకాల ఫల సమానమైనది, గనుక, ప్రశ్నమునకును జననమునకును, కొంచమైనను ఫలభేదము కలుగదు. అనగా జాతకశాస్త్రమంతయు ప్రశ్నభావమందును వుపయోగించవలయునని యభిప్రాయము, ఇపుడు మొదట, ప్రభవాది సంవత్సరములు, చాంద్ర సౌర, రాశి తదీశ్వర వివేకము క్రమముగా జెప్పుచున్నాడు.

ఈగ్రంథమునందు ఒకానొకచోట, చెప్పిన విషయమే, ప్రసంగవశముచేత, జ్ఞప్తికి వచ్చుటకు మరల చెప్పబడును, గనుక, పునరుక్తిదోషముగా గ్రహింపకూడదని తాత్పర్యము.

### 6. ప్రభవాది సంవత్సరనామములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ప్రభవ | 21 | సర్వజిత్ | 41 | ప్లవంగ |
| 2 | విభవ | 22 | సర్వధారి | 42 | కీలక |
| 3 | శుక్ల | 23 | విరోధి | 43 | సౌమ్య |
| 4 | ప్రమోదూత | 24 | వికృతి | 44 | సాధారణ |
| 5 | ప్రజోత్పత్తి | 25 | ఖర | 45 | విరోధికృత్ |
| 6 | ఆంగీరస | 26 | నందన | 46 | పరీధావి |
| 7 | శ్రీముఖ | 27 | విజయ | 47 | ప్రమాదీచ |
| 8 | భావ | 28 | జయ | 48 | ఆనంద |
| 9 | యువ | 29 | మన్మథ | 49 | రాక్షస |
| 10 | ధాతు | 30 | దుర్ముఖి | 50 | నల |
| 11 | ఈశ్వర | 31 | హేవళంబి. | 51 | పింగళ |
| 12 | బహుధాన్య | 32 | విళంబి | 52 | కాళయు |
| 13 | ప్రమాది | 33 | వికారి | 53 | సిద్ధార్థి |
| 14 | విక్రమ | 34 | శార్వరి | 54 | రౌద్రి |
| 15 | వృష | 35 | ప్లవ | 55 | దుర్మతి |
| 16 | చిత్రభాను | 36 | శుభకృత్ | 56 | దుందుభి |
| 17 | స్వభాను | 37 | శోభకృత్ | 57 | రుధిరోద్గారి |
| 18 | తారణ | 38 | క్రోధి | 58 | రక్తాక్షి |
| 19 | పార్థివ | 39 | విశ్వావసు | 59 | క్రోధన |
| 20 | వ్యయ | 40 | పరాభవ | 60 | క్షయ. |

### 7. చాంద్రమాస నిర్ణయః.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | చైత్రము | 5 | శ్రావణము | 9 | మార్గశిరము |
| 2 | వైశాఖము | 6 | భాద్రపదము | 10 | పుష్యమాసము |
| 3 | జ్యేష్ఠము | 7 | ఆశ్వయుజము | 11 | మాఘము |
| 4 | ఆషాఢము | 8 | కార్తీకము | 12 | ఫాల్గుణము. |



### 8. ఋతునిర్ణయః.

శ్లో॥ క్రమాచ్ఛిశిరవాసంత గ్రీష్మాస్స్యుశ్చోత్తరాయణే।
వర్షాశ్శరచ్ఛ హేమంత ఋతవో దక్షిణాయనే॥

1 చైత్రవైశాఖమాసములు. వాసంతఋత్.
2 జ్యేష్ఠాషాఢమాసములు. గ్రీష్మఋత్.
3 శ్రావణభాద్రపదమాసములు. వర్షఋత్.
4 ఆశ్వయుజ కార్తీకమాసములు. శరదృత్.
5 మార్గశిర పౌషమాసములు. హేమంతఋత్.
6 మాఘఫాల్గుణమాసములు. శిశిరఋత్.

ఈపదిరెండుమాసములు ఆరు ఋతువులుగా వ్యవహరింపబడెను.

### 9. అథ సౌరమాసః రాశినిర్ణయః.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | మేషము | 5 | సింహము | 9 | ధనుష్షః |
| 2 | వృషభము | 6 | కన్య | 10 | మకరము |
| 3 | మిథునము | 7 | తుల | 11 | కుంభము |
| 4 | కర్కాటకము | 8 | వృశ్చికము | 12 | మీనము. |

### 10. మేషాదిరాసుల స్వరూపములు.

మేషము గొర్రెవలెను, వృషభము ఎద్దువలెను. మిథునము గదవీణలను ధరించిన పురుషస్త్రీలం గలిగి స్త్రీపురుష ద్వంద్వము వలెను, కర్కాటకము ఎండ్రకాయవలెను, సింహరాశి సింహము వలెను, కన్య సస్యదీపములనుచేతబట్టుకొని తెప్పమీదనుండుస్త్రీవలెను, తుల త్రాసునుధరించిన పురుషునివలెను, వృశ్చికము తేలువలెను, ధనస్సు గుఱ్ఱపుపిరుదులవంటి పిరుదులం గలిగిన విల్లునుధరించిన వానివలెను, మకరము మృగముఖమునంటి ముఖముగల మొసలి వలెను. కుంభము భుజమందు ఉత్తకడవను దాల్చిన పురుషునివలెను, మీనము, అన్యోన్య పుచ్ఛాభిముఖమైన మచ్ఛద్వయమువలెనుండునని తెలియవలెను.

### 11. కాలపురుషునకు అంగవిభాగములు.

మేషమును, అశ్వినియును, మొదలుగా గలిగిన తొమ్మిదేశి నక్షత్రపాదములుగల, మేషాదిరాసులు, కాలపురుషునియొక్క అవయవములు, అదియెట్లన్నను.

అశ్వినీ భరణీ కృత్తికాపాదము మేషము, ఈప్రకారముగానే, తొమ్మిదేసి నక్షత్రపాదములకు ఒక్కొక్కరాశిలెఖ్ఖను, అశ్విని మొదలుగాగల ౨౭ నక్షత్రములకును, మేషాదిరాశి చక్రమందున్న ద్వాదశరాసులు అవుచున్నవి. కావున, అట్టిరాసులలో కాలపురుషునకు,

| | | | |
|---|---|---|---|
| 1 | మేషము....శిరస్సు. | 8 | వృశ్చికము....పురుషచిహ్నమైన లింగము. |
| 2 | వృషభము....ముఖము. | 9 | ధనస్సు....రెండు తొడలు. |
| 3 | మిధునము....రొమ్ము. | 10 | మకరము....మోకాళ్లు. |
| 4 | కర్కాటకము....హృదయం. | 11 | కుంభము....రెండుపిక్కలు. |
| 5 | సింహము....కడుపు. | 12 | మీనము....రెండుపాదములు. |
| 6 | కన్య....కటిప్రదేశము. | | |
| 7 | తుల....నాభిలింగమధ్యప్రదేశము. | | |

ఇందుకు ప్రయోజనమేమనిన, జన్మకాలమందు, పాపగ్రహాంతమైనరాశి, కాలపురుషునియొక్క, యేయంగమందుండునో, ఆయంగమందు, ఉపఘాతమును. శుభగ్రహాక్రాంతమైనరాశి, యేయంగమందుండునో, ఆయంగమునకు, పుష్టియు, జాతకునికి గలుగునని చెప్పవలెను.

### 12. రాశితుల్య వర్ణములు.

1 మేషము....రక్తవర్ణము.
2 వృషభము....శ్వేతవర్ణము
3 మిధునము....ఆకుపచ్చవన్నె.
4 కర్కాటకము....శ్వేతరక్తవర్ణము.



5 సింహము....పొగవన్నె గూడిన తెలుపు.
6 కన్య....చిత్రవర్ణము.
7 తుల....నీలవర్ణము.
8 వృశ్చికము....బంగారువన్నె.
9 ధనస్సు....కపిలవర్ణము.
10 మకరము....శుక్లకపిలమిశ్రవర్ణము.
11 కుంభము....నలుపుగూడిన తెలుపు.
12 మీనము....స్వఛ్ఛవర్ణము.

### 13. రాత్రిదిన బలరాసులును పృష్ఠోదయ శీర్షోదయ రాసులు వివరము.

మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, ధనస్సు, మకరము, ఈ ౬ రాసులును, రాత్రిబలరాసులు, మిధునముగాక తక్కిన ౫ రాసులు, పృష్ఠోదయరాసులు. మిగిలిన, సింహకన్య, తుల, వృశ్చిక, కుంభములు దిన బలరాసులు. ఈదినబలరాసులును, శీర్షోదయరాసులు, మీనము, పృష్ఠశీర్షములవలన, లగ్నగతంబై ఉదయించుచున్నది, అనగా, మీనము, ఉదయోదయమని తాత్పర్యము.

### 14. రాసులకు క్రూరసౌమ్య విభాగములు.

మేష, మిధున, సింహ, తుల, ధనస్సు, కుంభము, ఈ ౬ రాసులున్ను విషమరాసులు, అనగా క్రూరములు. వృషభము, కర్కాటకము, కన్య, వృశ్చికము, మకరము, మీనము, ఈ ౬ రాసులున్ను సమరాసులు, అనగా సౌమ్యములు, ఈసంజ్ఞలకు ప్రయోజనమేమున్నను, విషమరాసులయందు బుట్టినవారు క్రూరస్వభావులును, సమరాసులందు బుట్టినవారు, సౌమ్య స్వభావులును అగుదురని తెలియనగును.

### 15. ( రాసులకు స్త్రీపురుష విభాగములు. )

మేష, మిధున, సింహ, తుల, ధనస్సు, కుంభము మొదలగు రాసులు 6 ను పురుషరాసులు, వృషభము, కర్కాటకము, కన్య,

వృశ్చికము, మకరము, మీనము మొదలగు రాసులు ౬ ను స్త్రీరాసులు, ఇందుకు ప్రయోజనము—పురుషరాసులయందు బుట్టినవారు తేజోవంతులును, స్త్రీరాసులయందు బుట్టినవారు తేజోహీనులని యును జెప్పనగును. మరియు పురుషరాసులనే, విషమరాసులనియు బేసిరాసులనియు, ఓజరాసులనియు, సమరాసులను స్త్రీరాసులనియు యుగ్మరాసులనియు వాడుకకలదు.

16. ( అంధకబధిర పంగురాసులు. )

శ్లో॥ మేషాదిచాంధకం షట్కం చత్వారో బధిరా స్తథా।
ద్వాచపంగూతు విజ్ఞేయా తద్భేదాః ప్రకీర్తితాః॥

తా. మేష, వృషభ, మిథున, కర్క, సింహ, కన్యారాసులు గుడ్డిరాసులు. తుల, వృశ్చిక, ధనుర్మకరరాసులు, చెవిటిరాసులు, కుంభమీనములు, కుంటిరాసులు, ఈరాసుల భేదముల తెలియ జేయుచున్నాము,

శ్లో॥ అజోవృషోమృగేంద్రశ్చ అర్ధరాత్రేమహాంధకాః।
యుగ్మాంగనా కుళీరాశ్చ మధ్యాహ్నేచాంధకా స్మృతాః॥
ఇత్యేవంకాలభేదేన శుభదాశ్చప్రకీర్తితాః॥

తా. మేష, వృషభ, సింహములు అర్ధరాత్రియందు గుడ్డిరాసులు, మిథున, కన్యాకర్కాటకములు, మధ్యాహ్నకాలమందు గుడ్డిరాసులు, ఈప్రకారము, కాలభేదముచేతను, శుభఫలదము లని చెప్పబడినవి.

మరియు॥ తులావృశ్చికములు, పగటియందు చెవిటిరాసులు, మకరధనస్సులు, రాత్రియందు చెవిటిరాసులు, కుంభమీనరాసులు, ప్రాతస్సాయం సంధ్యలయందు కుంటిరాసులుగా చెప్పబడినవి.

17. మేషాది రాశి ఘటికా ప్రమాణము.

1 మేషము....౪-౦ ఘడియలు.
2 వృషభము....౪-౩౦ ఘడియలు.
3 మిథునము....౫-౧౫ ఘడియలు.



4 కర్కాటకము....౫-౩౦ ఘడియలు
5 సింహము....౫-౩౦ ఘడియలు
6 కన్య.... ౫-౧౫ ఘడియలు
7 తుల....౫-౧౫ ఘడియలు.
8 వృశ్చికము....౫-౩౦ ఘడియలు.
9 ధనస్సు....౫-౩౦ ఘడియలు.
10 మకరము....౫-౧౫ ఘడియలు.
11 కుంభము....౪-౩౦ ఘడియలు.
12 మీనము....౪-౦ ఘడియలు.

ఈ ప్రకారము సర్వదేశములకు సముదాయ ఘటికలు.

రాజమహేంద్రవరమునకు లగ్నప్రమాణము.

| | రాసులు. | ఘ | వి | | రాసులు. | ఘ | వి |
|---|---|---|---|---|---|---|---|
| 1 | మేషము | ౪ | ౧ | 7 | తుల | ౫ | ౧౫ |
| 2 | వృషభము | ౪ | ౨౯ | 8 | వృశ్చికము | ౫ | ౨౯ |
| 3 | మిథునము | ౫ | ౧౧ | 9 | ధనస్సు | ౫ | ౩౫ |
| 4 | కర్కాటకము | ౫ | ౩౫ | 10 | మకరము | ౫ | ౧౧ |
| 5 | సింహము | ౫ | ౨౯ | 11 | కుంభము | ౪ | ౨౯ |
| 6 | కన్య | ౫ | ౧౫ | 12 | మీనము | ౪ | ౧ |

రాజమహేంద్రమునకు దృక్సిద్ధ స్ఫుటలగ్న ప్రమాణము.

| | రాసులు. | ఘ | వి | | రాసులు. | ఘ | వి |
|---|---|---|---|---|---|---|---|
| 1 | మేషము | ౪ | ౨౦ | 7 | తుల | ౫ | ౨౪ |
| 2 | వృషభము | ౪ | ౫౬ | 8 | వృశ్చికము | ౫ | ౩౩ |
| 3 | మిథునము | ౫ | ౨౬ | 9 | ధనస్సు | ౫ | ౧౯ |
| 4 | కర్కాటకము | ౫ | ౩౧ | 10 | మకరము | ౪ | ౩౩ |
| 5 | సింహము | ౫ | ౨౦ | 11 | కుంభము | ౪ | ౧౦ |
| 6 | కన్య | ౫ | ౧౬ | 12 | మీనము | ౪ | ౨ |

శికింద్రాబాదునకు ధృక్సిద్ధ స్ఫుటలగ్న ప్రమాణములు.

| | |
|---|---|
| మేషస్య....౪-౨౨ | తులాయః....౫-౨౫ |
| వృషభస్య....౫-౦ | వృశ్చికస్య....౫-౩౩ |
| మిథునస్య....౫-౨౯ | ధనుషః....౫-౧౭ |
| కర్కాటకస్య....౫-౩౧ | మకరస్య....౪-౪౦ |
| సింహాస్య....౫-౧౮ | కుంభస్య....౪-౮ |
| కన్యాయాః....౫-౧౫ | మీనస్య....౪-౧ |

కాలవ్యత్యాసముచే అహూరాత్ర ప్రమాణములు ౩౨-౪౨న్ను + ౨౭-౨౮న్ని × ౨౭-౨౮న్ని × ౩౨-౪౨న్ను ఈప్రకారముమారుచుండును.

దేశభేదములచే గలుగబోవు దేశాంతర స్థిత యోజనములు చరఖండములు, మేషాది ఘటికా ప్రమాణములు గల చక్రమొకటి ముందు చూపబడును.

18. చరస్థిర ద్విస్వభావ విభాగము.

మేష, కర్కాటక, తులా, మకరములు. చరలగ్నములు.

వృషభ, సింహ, వృశ్చిక, కుంభములు. స్థిరలగ్నములు.

మిథున, కన్యా, ధనుర్మీనములు. ద్విస్వభావములు.

19. రాశ్యాధిప నిర్ణయః కాలామృతే.

శ్లో॥ మేషోగార్మిథునం కుళీర మృగరాట్కన్యా తులావృశ్చికా।
శ్చాపాఖ్యోమకరోఘటో ఝషఇతి హ్యేతేగ్రహాఖ్యాఃక్రమాత్।
భౌమశ్శుక్రబుధేందు సూర్యశశిజా భృగ్వారజీవాసితా।
మందోజీవ ఇతిక్రమేణ గృహపా ఏతేహిషడ్వర్గపాః।
సౌమ్యానాముపిరాశయ శ్శుభగృహాః క్రూరగృహాఃపాపినాం॥

తా. మేష, వృషభ, మిథున, కర్కా, సింహ, కన్య, తుల, వృశ్చిక, ధనస్సు, మకర, కుంభ, మీనములు ౧౨న్ను, రాసులనియు. ఈ రాసులకు అధిపతులు.



మేష వృశ్చికములకు—అంగారకుడు.

వృషభ తులలకు —శుక్రుడు.

మిథున కన్యలకు —బుధుడు.

కర్కాటకమునకు —చంద్రుడు.

సింహమునకు —సూర్యుడు.

ధనుర్మీనములకు —బృహస్పతి.

మకర కుంభములకు—శనైశ్చరుడు.

వీర లీక్రమమున రాశ్యాధిపతులనియు వీరలే షడ్వర్గాధిపతులని సౌమ్యగ్రహ సంబంధిరాసులు శుభరాసులనియు, పాపగ్రహ సంబంధిరాసులు క్రూరరాసులనియు తాత్పర్యము.

20. షడ్వర్గ లక్షణము.

శ్లో॥ త్రింశద్భాగాత్మకం లగ్నం హూరాతస్యార్ధముచ్యతే।
రాశిత్రిభాగో ద్రేక్కాణః నవాంశో నవభాగకః॥
ద్వాదశాంశో ద్వాదశాంశ త్రింశాంశ త్రింశదశకః।
షడ్వర్గలక్షణంప్రోక్తం సర్వలగ్నేష్వయంక్రమః॥

తా. లగ్నము 30 భాగలు ప్రమాణముగలది. ఆ లగ్నము రెండుభాగములు చేయునది హూరయనియు, మూడుభాగల్లు చేయునది ద్రేక్కాణమనియు, తొమ్మిదిభాగలు చేయునది నవాంశమనియు, పది రెండుభాగలు చేయునది ద్వాదశాంశమనియు, ముప్పదిభాగలు చేయునది త్రింశాంశమనియు, ఈప్రకారము షడ్వర్గలక్షణము సర్వలగ్నములకు చెప్పబడినదని తాత్పర్యము.

21 హూరానిర్ణయము.

శ్లో॥ హూరార్కచంద్రయోరోజే, యుగ్మేచంద్రసూర్యయోః॥

తా. ఓజరాసులగు, మేష, మిథున, సింహ, తుల, ధనుషి, కుంభము. మొదలగు ప్రథమహూరకు సూర్యుడు ద్వితీయహూరకు చంద్రుడు.

యుగ్మరాసులగు, వృషభ, కర్కాటక, కన్య, వృశ్చిక
మకర, మీనరాసులకు ప్రథమహోరకు చంద్రుడు. ద్వితీయ
హోరకు సూర్యుడును, అధిపతు లగుచున్నారు. ఈ హోరలకు రవి
చంద్రులే అధిపతులు ఇతరగ్రహంబులు కారు.

### 22. ద్రేక్కాణ నిర్ణయము.

లగ్నము మూడుభాగములుజేసి 18 వ విషయమున జెప్పబడు
ప్రకారము, చర, స్థిర, దిస్వభావరాసులను దెలుసుకొని ముహూర్త
కాలమునకు ద్రేక్కాణాధిపతుల నిర్ణయించవలయును.

చరరాశి మొదట భాగమునకు, స్వరాశ్యాధిపతి, ద్రేక్కాణా
ధిపతి. రెండవభాగమునకు, తనరాశికి, పంచమరాశ్యాధిపతి ద్రేక్కా
ణాధిపతి. తృతీయభాగమునకు తనరాశికి, నవమరాశ్యాధిపతి ద్రే
క్కాణాధిపతి. స్థిరరాశికి, మొదటిభాగమునకు, తొమ్మిదవరాశ్యాధి
పతి ద్రేక్కాణాధిపతి. రెండవభాగమునకు దనరాశ్యాధిపతి, ద్రే
క్కాణాధిపతి. మూడవభాగమునకు తనరాశికి, అయిదవరాశ్యాధి
పతి ద్రేక్కాణాధిపతి. దిస్వభావరాశికి, మొదటిభాగమునకు, తన
రాశికి, పంచమరాశ్యాధిపతి ద్రేక్కాణాధిపతి,

రెండవభాగమునకు, తనరాశికి, ఆరవరాశ్యాధిపతి, ద్రేక్కా
ణాధిపతి. మూడవభాగమునకు, తనరాశ్యాధిపతి ద్రేక్కాణాధిపతి,
యనిక్రమముగా పండ్రెండు రాసులకు - ద్రేక్కాణాధిపతులను దెలు
సుకొనేది. యిదే సిద్ధాంతవచనము. యింకాకొందరు కొన్నివిధము
లుగా జెప్పియున్నారు అవియన్నియు పూర్వపక్ష వచనములని
వ్రాయలేదు.

చరలగ్నమగు మేషమును, మూడు భాగములుజేయగా.

ప్రథమభాగమునకు స్వరాశ్యాధిపతియగు, కుజుడును. ద్వితీ
యభాగమునకు మేషము మొదలుకొని అయిదవరాశియగు సింహ
రాశ్యాధిపతి సూర్యుడును.



తృతీయభాగమునకు, మేషము మొదలుకొని తొమ్మిదవరాశి
యగు, ధనూరాశ్యాధిపతియైన గురుడును ద్రేక్కాణాధి పతులగు
దురు. ఈప్రకారముననే.

స్థిరలగ్నమగు వృషభమునకు, ౧ శని, ౨ శుక్రుడు, 3 బుధుడు,
దిస్వభావరాశియగు మిథునమునకు ౧ శుక్రుడు, ౨ కుజుడు, 3 బుధు
డును క్రమముగా ద్రేక్కాణాధిపతు లగుచున్నారు.

### 23. నవాంశ క్రమము.

లగ్నము తొమ్మిదిభాగములుచేసి, ముహూర్తకాల ఘడియ
లకు యే నవాంశకాలమగునో, ఆనవాంశను మేష, సింహ, ధనస్సు
లైన త్రికోణరాసులకు, మేషము మొదలుకొని ఆసంఖ్య నవాంశ
యని దెలుసుకొనునది.

తుల, కుంభ, మిథునములైన త్రికోణరాసులకు తులారాశి
మొదలుకొని చూచుకొనవలసినది.

కన్యా, మకర, వృషభములైన త్రికోణరాసులకు, మకరము
మొదలు చూచుకొనవలయును.

మీన, కటక, వృశ్చికములైన, త్రికోణరాసులకు, కర్కాట
కము మొదలుకొని చూచుకొనవలయును.

### 24. ద్వాదశాంశ క్రమము.

లగ్నము పండ్రెండు భాగములుచేసి నిశ్చయమైన ముహూ
ర్తకాలమునకు, యేభాగమునకు యేరాశియగునో అదిలగ్నాది ఆసం
ఖ్య ద్వాదశాంశ యనియు ఆరాశ్యాధిపతియే ద్వాదశాంశాధిపతి
యని తెలుసుకొనేది.

మరియు॥ మేషము మొదలుకొని మీనము పర్యంతమును,
వృషభము మొదలు మేషము పర్యంతము, మిథునము మొదలు
వృషభము పర్యంతము, కర్కాటకము మొదలు, మిథునము పర్యంత
మును ఈక్రమముగా దక్కినరాసులకును చూచుకొనవలయును.

## 25. త్రింశాంశ లక్షణము.

లగ్నము, ౩౦ భాగములుచేసినది త్రింశాంశ యనబడును, ఆభాగములను.

| | బేసిరాశికి. | | సమరాశికి. |
|---|---|---|---|
| 1 | కుజునికి—౫-భాగములు. | 1 | శుక్రునకు-౫-భాగములు. |
| 2 | శనికి—౫-భాగములు. | 2 | బుధునికి—౭-భాగములు. |
| 3 | బృహస్పతికి ౮-భాగములు | 3 | బృహస్పతికి ౮-భాగములు |
| 4 | బుధునికి—౭-భాగములు. | 4 | శనికి—౫-భాగములు. |
| 5 | శుక్రునికి—౫-భాగములు. | 5 | కుజునికి—౫-భాగములు |

ఈప్రకారము పంచగా మూహూర్తఘటిక లేవనిభాగములో నుండునో ఆగ్రహమును, లగ్నము బేసిరాశియైనట్టయితే కుజునిభాగములు మొదలుకొని క్రమముగా నాభాగములు గలవాఁడు త్రింశాంశాధిపతియని తెలియవలెను, ఆలగ్నము సమరాశియైనట్టయితే శుక్రునిభాగము మొదలుకొని వ్యుత్క్రమముగా నాభాగములు గలవాడు త్రింశాంశాధిపతి యని తెలుసుకోదగినదని భావము. ఈక్రమము విమర్శగా వ్రాసియేయున్నాము—గణితోదాహరణ ముందు జూపెదము.

## 26. పుష్కరాంశాః.

శ్లో॥ ఏకవింశోమనుశ్చైవ చతుర్వింశతి సప్తచ।
మేషాదిమీనపర్యంతం పుష్కరాంశాః ప్రకీర్తితాః॥

తా. మేష, సింహ, ధనుర్లగ్నములకు, ౨౧ టో భాగ పుష్కరాంశ, వృషభ, కన్యా, మకరలగ్నములకు ౧౪ గో భాగ పుష్కరాంశ, మిధున, కుంభ, తులాలగ్నములకు ౨౪ గో భాగ పుష్కరాంశ, కర్కటక, వృశ్చిక, మీనలగ్నములకు, ౭ డో భాగ పుష్కరాంశ, ఈ ప్రకారము ద్వాదశలగ్నములకు పుష్కరాంశ లగును.



ఉదాహరణము॥ ఏలగ్నమునకు పుష్కరాంశ కట్టవలయునో, ఆలగ్నప్రమాణ ఘడియావిఘడియలలో ఘడియలను ౬౦ చే గుణించి విఘడియలనుజేర్చి భాగప్రమాణము అనగా ౩౦ చే భాగించగా శేషము విఘడియలు, లిప్తలువచ్చును, ఆవిఘటికా లిప్తలును, పుష్కరభాగంచే గుణియించి ౬౦ చే భాగించగా ఘడియా విఘడియలు వచ్చును.

ఇపుడు కర్కాటకలగ్నమునకు పుష్కరాంశ చేయుచున్నాను.

కటకలగ్న ప్రమాణఘడియా విఘడియలు. ౫-౩౧

| | |
|---|---|
| ౫-౩౧ | కటకలగ్నప్రమాణం |
| ౬౦ | గుణించగా |
| ౩౦)౩౩౧(౧౧ | విఘడియలు |
| ౩౩౦ | |
| ౧ | శేషము |
| ౧౧ | లబ్ధము |
| ౬ చే | గుణించగా |
| ౬౦)౬౬(౧ | లబ్ధము ఘడియలు |
| ౬ | శేషము విఘడియలు. |

కర్కాటక లగ్నములో పుష్కరాంశ ప్రమాణము ౧-౬ ఘడియా విఘడియలు వచ్చినవి. ఇవి గతలగ్నములలో చేర్చగా పుష్కరకాల ప్రారంభమౌను. ఈ ప్రమాణ ఘడియా విఘటికల యనంతరము పుష్కర కాలమని యెరుంగవలెను.

పుష్కరాంశ ప్రమాణ ఘడియా విఘడియలు.

| | రాసులు. | ఘ | వి | | రాసులు. | ఘ | వి |
|---|---|---|---|---|---|---|---|
| 1 | మేషము | ౨ | ౫౮ | 7 | తుల | ౪ | ౮ |
| 2 | వృషభము | ౨ | ౮ | 8 | వృశ్చికము | ౧ | ౬ |
| 3 | మిధునము | ౪ | ౯ | 9 | ధనుషిః | ౩ | ౩౨ |
| 4 | కర్కాటకము | ౧ | ౬ | 10 | మకరము | ౧ | ౫౮ |
| 5 | సింహము | ౩ | ౩౩ | 11 | కుంభము | ౩ | ౧౧ |
| 6 | కన్య | ౨ | ౧౬ | 12 | మీనము. | ౦ | ౦౮ |

ఇతి శ్రీ మహాగోదావరీ నదీతీరమునకు తేబడిన దృక్సిద్ధ లగ్న పుష్కరాంశలు.

## ఉదాహరణ.

ఇపుడు మృగశీర్షానక్షత్ర జాతకునకు వివాహ ముహూర్తము నిశ్చయించవలెను. గనుక, ప్రభవ సం॥ వైశాఖ శుద్ధ ౧౮ భానువాసరమున స్వాతీనక్షత్రముగాన ఈరోజున ఉదయలగ్నము వృషభం. ఉదయభుక్తి 4 విఘటికలుపోను, శేషం ఘ 4-52 విఘటికలు మిధునలగ్నప్రమాణము ఘ 5-26 చేర్చగా ఘ 10-18 విఘటికలు. పైన వ్రాసిన కటకల్నములో వచ్చిన పుష్కరాంశ ఘటికలు 1-6 న్ను చేర్చగా ఘ 11-24 విఘటికలాయెను. గనుక ఈరోజున కర్ణాటక లగ్నమునకు వివాహముహూర్తము రహితమాయెనని యెరుంగవలెను.

28. గ్రహములకు మిత్రశత్రు సమత్వములు

| | గ్రహములు | మిత్రులు. | శత్రులు. | సములు |
|---|---|---|---|---|
| 1 | సూర్యునికి | కుజ, గురు, చంద్రులు | శని శుక్రులు | బుధుడు |
| 2 | చంద్రునికి | రవి, బుధులు | | కుజ, గురు, శని, శుక్రులు |
| 3 | కుజునికి | రవి, గురు, చంద్రులు | బుధుడు | శుక్ర, శనులు |
| 4 | బుధునికి | రవి, శుక్రులు | చంద్రుడు | కుజ, గురు, శనులు |
| 5 | గురువునకు | చంద్ర, కుజులు | బుధ, శుక్రులు | రవి, శనులు, |
| 6 | శుక్రునికి | శని, బుధులు | రవి, చంద్రులు | కుజ గురువులు, |
| 7 | శనికి | శుక్ర బుధులు | రవి, చంద్ర కుజులు, | గురువు |



గ్రహములకు ఉచ్ఛ నీచ పరమోచ్ఛ సంజ్ఞలు.

| నవగ్రహములు | | స్వక్షేత్రములు | ఉచ్ఛక్షేత్రములు | పరమోచ్ఛ | నీచ | పరమనీచ |
|---|---|---|---|---|---|---|
| 1 | రవికి | సింహాము | మేషము | 10-భాగం | తుల | 10-భాగం |
| 2 | చంద్రుడు | కర్కాటకం | వృషభం | 3-భాగం | వృశ్చికం | 3-భాగం |
| 3 | కుజుడు | మేష, వృశ్చికములు | మకరము | 28-భాగం | కటకం | 28-భాగం |
| 4 | బుధుడు | మిధున, కన్యలు | కన్య | 15-భాగం | మీనము | 5-భాగం |
| 5 | గురుడు | ధనుర్మీనములు | కర్కాటకము | 5-భాగం | మకరం | 5-భాగం |
| 6 | శుక్రుడు | వృషభ, తులలు | తుల | 27-భాగం | మేషం | 27-భాగం |
| 7 | శనికి | మకర కుంభములు | తుల | 20-భాగం | మేషం | 20భాగం |
| 8 | రాహు | కన్య | వృషభము | | వృశ్చికము | |
| 9 | కేతు | కుంభము | మీనము | | కన్య | |

సర్వగ్రహములకు ఉచ్ఛలో పరమోచ్ఛ నీచలో పరమనీచ గలుగుచుండును.

శ్లో॥ అంధం దిగంబరం మూర్ఖం పరపుపిండోప జీవనం।
కురుతామతి నీచస్థా పురుషం శశిభాస్కరా॥

అని గార్గ్యఋషి వచించెను.

శత్రు మిత్ర సమక్షేత్రములు.

| | గ్రహములు | శత్రు క్షేత్రములు | మిత్ర క్షేత్రములు | సమక్షేత్రములు |
|---|---|---|---|---|
| 1 | సూర్యునికి | మకర, కుంభ, వృషభ. తులలు. | కటక, మేష, వృశ్చిక, ధనుర్మీనములు. | మిథున, కన్యలు. |
| 2 | చంద్రునకు | | సింహ, మిథున, కన్యలు. | మేష,వృశ్చిక,ధనుర్మీనమకర, కుంభ,తులా,వృషభములు. |
| 3 | అంగారకునకు | మిథున, కన్యలు. | ధనుర్మీన, కర్కాటక, సింహములు. | వృషభ, తుల, మకర, కుంభములు. |
| 4 | బుధునకు | కర్కాటకము. | సింహ, తుల, వృషభములు. | మేష, వృశ్చిక, ధనుర్మీన, మకర, కుంభములు. |
| 5 | గురునకు | మిథున, కన్య, తులా, వృషభములు. | కటక, మేష, వృశ్చికములు. | సింహ, మకర, కుంభములు. |
| 6 | శుక్రునకు | కర్కాటక, సింహములు. | మిథున, కన్య, మకర, కుంభములు. | మేష. వృశ్చిక, ధనుర్మీనములు. |
| 7 | శనికి | కర్క, సింహ, మేష, వృశ్చికములు. | వృషభ, తుల, మిథున, కన్యలు. | ధనుర్మీనములు. |



శ్లో॥ సూర్యాదీనాం గ్రహాణామప్యుచ్చస్థానానిచస్మృతాః।
రాహుకేత్వోస్తుసర్వేపి రాశయస్స్వగృహాస్స్మృతాః॥

తా. సూర్యాదిగ్రహములకు ఉచ్చాది క్షేత్రములుగలవు. రాహు కేతువులకు, ఎల్లరాసులును గృహములే. అనగా వీర్లకు స్వాసాధారణమైన గృహములు లేవు.

30. గ్రహాణాం క్రూరసౌమ్య పురుష, స్త్రీ నపుంసక సంజ్ఞాం జాతి నిర్ణయః.

శ్లో॥ క్రూరభానుతమశ్శని ధ్వజకుజాశ్శుక్రార్యసౌమ్యేందవ।
స్సౌమ్యాస్త్రీపురుషాఃకుజార్కగురవో రాహ్విందుశుక్రాఃస్త్రియః।
తచ్ఛేషాస్తు నపుంసకాగురుభృగూవిప్రౌకుజార్కౌనృపౌ।
వైశ్యౌచంద్రబుధౌతదన్య కులజోమందస్తువర్ణేశ్వరః॥

తా. రవి, కుజ, శని, రాహు, కేతువులు, పాపగ్రహములు. చంద్ర, బుధ, గురు, శుక్రులు, శుభగ్రహములు. కొందరి మతము నందు బుధునికి పాపగ్రహముతో చేరినప్పు డశుభత్వమును, క్షీణ చంద్రునికి పాపత్వమును, పూర్ణచంద్రునికి శుభత్వమును, జెప్పబడి యున్నది ఇందుకు బాలబోధిని యనెడి గ్రంథమునందునుదాహరణ.

శ్లో॥ బుధఃపాప యుతఃపాపః క్షీణచంద్ర స్తథైవచ॥

తా. బుధుడు, పాపగ్రహముతో గూడినట్లయితే పాపియనిన్ని, చంద్రుడు క్షీణదశయందు పాపియనిన్ని, పూర్ణదశయందు శుభకుడనిన్ని తాత్పర్యము.

రవి, కుజ, గురులు. 3-ను....పురుషగ్రహములు.
చంద్ర,శుక్ర,రాహువులు. 3-ను....స్త్రీగ్రహములు.
బుధ, శని, కేతువులు. 3-ను....నపుంసక గ్రహములు.
గురు, శుక్రులు. 2-ను....బ్రాహ్మణగ్రహములు.
రవి, కుజులు. 2-ను....క్షత్రియగ్రహములు
చంద్ర, బుధులు. 2-ను....వైశ్యగ్రహములు.

శనైశ్చరుడు, శూద్ర వ్యవహారికాది పంచదశ వర్ణముల కధిపతియైన శూద్రుడు.

మరియు॥ కొన్ని గ్రంథములయందు శనైశ్చరుండు, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, కులములకంటె, అన్యమైన కులమందుబుట్టిన,

శూద్రకులాధిపతి యనియు రాహువు-మ్లేచ్ఛగ్రహమనియు, కేతువు-ఛండాలగ్రహమనియు, శుక్రుడు-వేశ్యాగ్రహమనియు, జెప్పబడెను.

### 31 - క్షీణ, పూర్ణచంద్రఫల నిర్ణయః.

చంద్రుడు, శుక్లాష్టమి మొదలు, కృష్ణాష్టమి పర్యంతము, పూర్ణుడును, కృష్ణ శుక్లాష్టములకు, మధ్యమ దినములయందు క్షీణుండును, పూర్ణచంద్రుడు శుభకరుండును, క్షీణచంద్రు డశుభకరుడును మరియు శుక్లపక్షైకాదశి మొదలు కృష్ణ పంచమివరకు పూర్ణచంద్రు డౌటవలన, శుభకరమనియు, శుక్లపక్ష షష్టి మొదలా దశమివరకు, కృష్ణపక్ష షష్ఠి మొదలు కృష్ణదశమి పర్యంతము, మధ్యమచంద్రు డౌటవలన, నల్పఫలప్రదమనియు, కృష్ణైకాదశి మొదలు, శుద్ధ పంచమివరకు, మిక్కిలి క్షీణచంద్రు డౌటవలన నశుభకరమనియును తాత్పర్యము.

### ( 32 = వర్గోత్త మూల త్రికోణములు. )

పూర్వము వ్రాయబడు, చర, స్థిర, దిస్వభావరాసులయందు,ఆది మధ్యాంతములైన నవాంశలు వర్గోత్తమాంశములౌచున్నవి ఎట్లనగా,

చరరాసులైన, మేష, కర్కాటక, తులా, మకరములయందు ప్రథమనవాంశ వర్గోత్తమాంశ—స్థిరరాసులైన, వృషభ, సింహ, వృశ్చిక, కుంభములయందు పంచమ నవాంశవర్గోత్తమాంశ—దిస్వభావరాసులైన, మిధున, కన్యా, ధనుర్మీనములయందు అంత్య నవాంశయైన నవ నవాంశ వర్గోత్తమాంశ.

సింహాదిరాసులు రవ్యాది గ్రహములకు మూలత్రికోణ రాసులగుచున్నవి. అది యెట్లన్నన్నా॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | సూర్యునకు | సింహము | 4 | బుధునకు | కన్య |
| 2 | చంద్రునకు | వృషభము | 5 | గురువునకు | ధనస్సు |
| 3 | కుజునకు | మేషము | 6 | శుక్రునకు | తుల |



శనికి, కుంభము, మూల త్రికోణరాసులు॥ లఘుజాతక ప్రకారము, రాసులయందు మూలత్రికోణ స్వక్షేత్రభాగములు.

### లఘూపాయముగా తెలిసికొను చక్రము.

| గ్రహములు. | రాసులు. | మూలత్రికోణములు. | స్వక్షేత్రములు. |
|---|---|---|---|
| సూర్యునకు | సింహమందు | మొదట 20 భాగలు | తరువాత 10 భాగలు |
| చంద్రునకు | వృషభములో | మొదట 3 భాగలు ఉచ్ఛ | తరువాత 27 భాగములు |
| కుజునకు | మేషమందు | మొదలు 18 భాగములు | తరువాత 12 భాగములు |
| బుధునకు | కన్యయందు | 15 భాగములు | 10 భాగములు |
| గురునకు | ధనుస్సునందు | మొదట 10 భాగలు | తరువాత 20 భాగములు |
| శుక్రునకు | తులయందు | మొదట 15 భాగములు | తరువాత 15 భాగములు |
| శనికి | కుంభమందు | మొదలు 20 భాగములు | తరువాత 10 భాగములు |

ఇంకా సారావళియందు, మాధవాచార్యులు మొదలగువారు అనేకవిధములుగా జెప్పియుండిరి.

### సూర్యాది గ్రహములకు క్రూరత్వము సిద్ధించుట.

పాపగ్రహములతో గూడిన నక్షత్రము జ్వలితసంజ్ఞక మనియు, పాపగ్రహముకు వెనుకనున్న నక్షత్రము భస్మసంజ్ఞకమనియు, పాపగ్రహముకు ముందున్న నక్షత్రము, ధూమిత సంజ్ఞక మనియు, ఈమూడు నక్షత్రములు మృత్యుప్రదము లౌటవలన, వివాహాది శుభకర్మల విషయమై నిషేధింపవలయు ననియు, పాపగ్రహ యుక్త

నైన రాశియును. జ్వలితసంజ్ఞకమే గనుక ముందుజెప్పిన ఫలప్రద మనియు, మిగిలిన పృష్టాగ్రగతరాసులు, భస్మితధూమిత సంజ్ఞకము లైనను, శుభగ్రహ యుక్తములాయెనేని శుభప్రదమగును.

పంచశలాక చక్రము.




(అథ పంచశలాక పాపగ్రహావిద్ధదోషః.)

అడ్డగీతలు ౫ వ్రాసి, దానిమీద ౫ నిడువుగీతలు వ్రాసి. ఈచక్రకోణములయందు రెండేసిగీతలు వ్రాసి ఈశాన్యకోణమందు వ్రాయబడిన రెండురేఖలు మొదలుకొని యన్నిరేఖాగ్రముల యందును, క్రమముగా కృత్తికాది ౨౮ నక్షత్రములు అభిజిత్ సహితముగా వ్రాసి పరిశోధించి, పాపగ్రహవేధలేని, నక్షత్రమందు, వివాహాది శుకర్మలుచేయుట శాస్త్రసమ్మతము

పైన కనుబరచిన ఈ పంచశలాకలో లేని క్రూర వేధలు సప్తశలాకయందు చూడవలెను, ఆసప్తశలాక చక్రమునందును క్రూర వేధలు లేనియెడల శుభకరంబౌను.



సప్తశలాక చక్రము.




నక్కకూత, తుమ్ము, పశుతుమ్ములకు ఫలము.

శ్లో॥ ప్రాగాద్యా శనివాసరాది గదితాః సూర్యోదయేష్టాగ్రహాః।
నాగానాగనగాని శీధనభోనా ద్యోనసోనాడికాః।
హానిప్రీతిదురుక్తి బంధుకనక స్నిగ్ధాన్నతా పార్తిదాః।
శ్రోతుఃక్రోష్టురుతేక్షుతే ఫలమిదం మృత్యుస్సదా గోక్షుతం॥

తా. శనివారము పగలు ౩౦ ఘడియలు తూర్పుదిక్కునందును. ఈరాత్రి ౩౦ ఘడియలు, ఆగ్నేయదిక్కునందును. ఆదివారము పగలు ౩౦ ఘడియలు దక్షిణదిక్కునందును, ఈరాత్రి ౩౦ ఘడియలును సోమవారము ౬౦ ఘడియలువరకు నైఋతిదిక్కునందును, మంగళవారము ౫౦ ఘడియలువరకు పశ్చిమదిక్కునందును, మంగళవారము రాత్రిశేషించిన ౧౦ ఘడియలును, బుధవారము పగలు ౩౦ ఘడియలును, గురువారమునందు ౫౦ ఘడియలువరకు నుత్తరదిక్కునందును, గురువారము రాత్రిశేషించిన ౧౦ ఘడియలును, శుక్రవారమునందు ౬౦ ఘడియలు వరకు నీశాన్యదిక్కునందును, ఈప్రాగాది దిక్కులందు, సూర్యాది సప్తగ్రహములు, రాజులైయుండును, ఆరాజుదిక్కు మొదలుకొని, నక్కకూతలు, తుమ్ములు, పశువుల తుమ్ములు, ఇది మొదలైనవి యేదిక్కున వినబడునో ఆదిక్కు

నరకు, పైన జెప్పబడిన ఫలములను, క్రమముగా దెలియునది, మరియు, తుమ్ము, రాజు నివసించిన దిక్కునహాని, వానికి రెండవదిక్కున, విశ్వాసఫలము, మూడవదిక్కున దురుక్తియు, నాలవదిక్కున బంధులాభము, ఐదవదిక్కున స్వర్ణలాభము, ఆరవదిక్కున భోజనసౌఖ్యము, ఏడవదిక్కున శోకము, ఎనిమిదవ దిక్కున పీడయని యీక్రమముగా దెలిసికొనునది, (మరియు)

( అథశకునఫలము. )

వసంతరాజః॥

శ్లో॥ సర్వస్యసర్వత్రచ సర్వకాలం క్షుతంనకార్యే క్వచిదేవశస్తం।
జాతేక్షుతేతేన నకించిదేన కుర్యాత్క్షుతం ప్రాణహారం గవాంతు।
నిషిద్ధముగ్రేక్షిణి దక్షిణేచ ధనక్షయం దక్షిణకర్ణదేశే।

భోగాయవామశ్రవణస్య పృష్ఠే కర్ణేచవామేచరితే జయాయ।
సర్వార్థలాభాయచ వామనేత్రేజాతంక్షుతం మర్త్యభయంత్వనిష్టం।
క్రమాన్నిషేధం గమనస్య విఘ్నంకలింసమృద్ధిం క్షుధముగ్రరోగం।
కరోతి రోగక్షయమర్థలాభ మింద్రాదిదిక్ష్వేం క్షుదినే ఫలంస్యాత్।
ప్రాజ్ఞస్యపుంసః పరతోపరస్య పునఃపునర్వాయది దేహదోషాత్।
నదోషచూహుః ఫలమస్యనాస్తి కదాచిదేతచ్ఛకునంత్వకస్మాత్॥

తా. కార్యారంభమందు యెవరుతుమ్మినా చెడ్డది, ఆవేతుమ్మితే మరణసూచన, తుమ్మినవారికి తుమ్మినపుడు వికారము యెక్కువైతే అనిష్టసూచన, కార్యకర్తకు ముందరను, కుడిప్రక్కను తుమ్మితే ధనక్షయము, ఎడమప్రక్కను వెనకను, తుమ్మితే భోగము, జయము గలుగును, యేదిక్కులో తుమ్మితేదానికి తగినఫలమును, ప్రాగాదిక్రమముగా చూచుకొనవలసినది. ఎట్లనిన, ౧ ప్రయాణవిఘ్నము. ౨ కార్యవిఘ్నము, 3 కలహము, ౪ సమృద్ధి, ౫ క్షుద్బాధ, ౬ రోగము, ౭ ఆరోగ్యము, ౮ అర్థలాభము, యీఫలము ఒకదినములో సూచింపబడును, ముందర, నొకడు, ప్రక్కలోను, వెనుకను అనేకులు తుమ్మితే దోషములేదు, గాటు, వెగటు, కారము, ఇత్యాదులచేత తుమ్మితే దానికి ఫలములేదు.



33. గ్రహములకు అన్యోన్య దృష్టిస్థానములు, నైసర్గికదృష్టిబలము॥

శ్లో॥ అర్కేన్ద్వారబుధాచార్యాభృగు మందాహికేతవః॥

తా॥ సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహు, కేతువు మొదలగు నవగ్రహంబులును.

శ్లో॥ త్రిసప్తదశమాన్ సౌరీ, త్రికోణంతు బృహస్పతిః।
చతురష్టౌ కుజస్సర్వే సప్తమేపూర్ణవీక్షణాః॥

తా॥ సూర్యాది నవగ్రహములు, తామున్నస్థానమునకు సప్తమస్థానమును, సంపూర్ణముగా వీక్షింపుచున్నారు॥ మరియు॥

శనైశ్చరుడు॥ తానున్నరాశికి॥ ౩-౮ స్థానములు పాదదృష్టిచేతను॥

బృహస్పతి, తానున్నరాశికి, ౫-౯ స్థానములు అర్ధదృష్టిచేతను, అంగారకుడు, తానున్నరాశికి, ౪-౮ స్థానములు త్రిపాదదృష్టిచేతను, విశేషముగా చూచుచుందురు, తక్కిన, సూర్య, చంద్ర, బుధ, శుక్రులును, రాహుకేతువులును తామున్నరాశికి సప్తమస్థానమును సంపూర్ణదృష్టిచే చూతురు॥

సారావళి కారక, మాధవాచార్య, గార్గ్యాదుల అభిప్రాయము,

సర్వగ్రహంబులకును, సప్తమస్థానదృష్టి అస్థిరమైయున్నప్పటికిని, సూర్య, చంద్ర, బుధ, శుక్రులకు, సప్తమస్థానము సంపూర్ణదృష్టిచెప్పుటవలన, ఇతరగ్రహములకంటె నీరవిచంద్ర బుధశుక్రులు సంపూర్ణదృష్టియందు అధికఫలప్రదులని తెలియదగును॥ అని॥

అనేకగ్రంథకర్తలు ఒప్పుకొని యున్నారు,—

శని, గురు, కుజులు, ఇతరగ్రహములను జూచుటయందు. పాదాభివృద్ధియందు ఫలప్రదులు (అనగా) శని, పాద, దృష్టియందును॥ గురుడు అర్ధదృష్టియందును॥ అంగారకుడు, త్రిపాదదృష్టియందును, అధికఫలప్రదులు.

ఇదిగ్రహముల నైసర్గికదృష్టిఫలము, ఆయాస్థానబలమువలన, విశేషదృష్టిఫలము లూహింపదగినవని చెప్పుదురు॥

34. నవగ్రహములకు రక్తశ్యామలాది వర్ణములు॥

1. సూర్యుడు॥ రక్తశ్యామలమిశ్రవర్ణుడు, అనగా పాటలపుష్పవర్ణము గలవాడు.

2. చంద్రుడు॥ శ్వేతవర్ణము గలవాడు, మిక్కిలి ఉన్నతశరీరము గానివాడు.
3. అంగారకుడు॥ రక్తవర్ణుడు, అనగా పద్మపత్రము వంటి మెరుపు గలవాడు.
4. బుధుడు॥ గరికవంటి శ్యామలవర్ణుడు, అనగా ఆకుపచ్చఛాయ గలవాడు.
5. బృహస్పతి॥ పసపుచాయగలవాడు, అనగా, తప్తకాంచన వర్ణుడు.
6. శుక్రుడు॥ తెలుపు వర్ణముగలవాడు.
7. శనైశ్చరుడు॥ నీలవర్ణుడు, అనగా నలుపు దేహముగలవాడు.
8. రాహు॥ కృష్ణలోహితముగల శరీరముగలవాడు.
9. కేతువు॥ మంచి చిత్రవర్ణముగల దేహముగలవాడు.

ఇందుకు ప్రయోజనము, జన్మకాలమందు ఏగ్రహము బలవంతమైయుండునో, ఆగ్రహముయొక్క వర్ణముగలవాడు, జాతకుండౌనని యు, హృతనష్టాది ప్రశ్నలయందు, చోరాదులు బలవద్గ్రహసమాన వర్ణులనియు తెలుసుకొన గలుగుననుట.

## 35॥ వేదాధిపతుల నిర్ణయము॥

ముహూర్తదర్పణే॥

శ్లో॥ ఋగ్వేదాధిపతి ర్జీవో యజుర్వేదాధి పస్సితః।
సామవేదాదిపోభౌమశ్శశిజో థర్వనాయకః॥

| | |
|---|---|
| గురుడు॥ ఋగ్వేదమునకు॥ | అంగారకుడు॥ సామవేదమునకు॥ |
| శుక్రుడు॥ యజుర్వేదమునకు॥ | బుధుడు॥ అధర్వణవేదమునకు॥ |

వీరలీక్రమమున వేదాధిపతు లనంబడుదురు.

ఇందుకు ప్రయోజనము॥ బ్రాహ్మణాది జన్మకాలముల యందును, (ఉపనైనవిషయమునందును.) ఏశాఖాధిపతి బలవంతుడైయుండునో జాతకుడాశాఖాధ్యయన పరుడగునని తెలియవలయును, గ్రహము లనిష్టస్థానగతులై యున్నప్పుడు తద్గ్రహోక్తశాఖామంత్రములచే గ్రహశాంతి చేయవలయును.



## 36॥ గ్రహములకు స్థానవస్త్రద్రవ్యములు॥

1 సూర్యుడు॥ తామ్రము, ముదుగైనవస్త్రము, దేవస్థానము దేవపూజాగృహము మొదలగువాటికి, అధిపతి॥
2 చంద్రుడు॥ మణులు, క్రొత్తవస్త్రము, జలసమీపమునకును, స్నానశాలలకును అధిపతి॥
3 అంగారకుడు॥ బంగారము, సఖచుకాలిన వస్త్రము, అగ్నిసమీపమునకును, పాకశాలలకును అధిపతి॥
4 బుధుడు॥ పిత్తళి, కంచుమొదలైన వాటికిని, నీళ్లచేతపికిలిన వస్త్రమునకును, క్రీడాగృహమునకును అధిపతి॥ మరియుతడిసిన బట్టయని కొందరు చెప్పుచున్నారు.
5 గురుడు॥ వెండి, నడిపాతదైన వస్త్రము, బొక్కసపు గృహము మొదలగువాటికి అధిపతి॥
6 శుక్రుడు॥ ముత్యములు, గట్టివస్త్రము, శయనగృహము సుగంధద్రవ్యపుష్పము మొదలగు క్రీడావినోదములకు అధిపతి॥
7 శని॥ ఇనుము, సీసము, చినిగినవస్త్రమునకును భూపరాగరాశికిని, అధిపతి॥ ఆయాయావస్తుసముదాయములయందు ఆయాగ్రహములు అధికప్రీతిగల వారలగుదురు.

ఇందుకు ప్రయోజనము, బలవద్గ్రహవశంబున, జన్మకాలమందు, ఆయాగ్రహములకు జెప్పబడిన, స్థానమందు ప్రసవమనియు హృతనష్టాదిప్రశ్నలయందు బలవద్గ్రహముండుస్థానమున చోరు డపహరించిన ద్రవ్యముండుననియును, సూతికావస్త్రంబును. చోరాది వస్త్రంబును, జన్మకాలమందు ఏగ్రహము బలవంతమైయుండునో, ఆగ్రహదశయందు, ద్రవ్యలాభము, బలహీనగ్రహదశయందు, ద్రవ్యక్షయము మొదలగువాటిని తెలుసుకొనవలయును॥

## 37॥ గ్రహములకుధాతు సారములు॥

సూర్యునకు ఎముకలు, చంద్రునికి నెత్తురు, కుజునికి ఎముకలలోనుండుధాతు విశేషము, బుధునికిచర్మము, గురువునకు మెదడు, శుక్రునికి శేతస్సు, శనికినరములు, బలవత్తరములై యుండును, ఇందుకు ప్రయోజనము.

జన్మకాలమందు ఏగ్రహము బలవంతమైయుండునో ఆగ్రహ స్వరూపమును, ఆగ్రహమునకు జెప్పియున్న ధాతు సారమును జాతకునికి గలుగును॥

38॥ గ్రహములకును, కాలపురుషునకును గలసంబంధము॥

మేషాదిరాశ్యాధిపతులైన గ్రహములు కాలపురుషునియొక్క ఆత్మాదులనియు, జగత్పాలకులగు, రాజాదులు గ్రహములనియు చెప్పవలయును॥

అది యెట్లనిన॥ కాలపురుషునికి ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | సూర్యుడు | ఆత్మ | 5 | గురుడు | జ్ఞానసుఖములు |
| 2 | చంద్రుడు. | మనస్సు | 6 | శుక్రుడు | మన్మథుడు |
| 3 | కుజుడు | బలము | 7 | శని | దుఃఖము |
| 4 | బుధుడు | వాక్కు | | | |

ఈరీతిగా కాలపురుషునికి చెప్పుటవలన సకల ప్రపంచమునకు జెప్పినట్లయ్యెను.

గనుక జన్మకాలమందు కాలపురుషునికి ఆత్మాదులుగా చెప్పబడిన గ్రహములు బలవంతము లయ్యేనేని జాతకునికి ఆత్మాదులు బలము గలిగియుండును. లేకుండిన బలహీనములగును॥ మఱియు॥

సూర్యచంద్రులు - రాజులు॥ కుజుడు - సేనాధిపతి॥ బుధుడు- యువరాజు ॥ గురుశుక్రులు - మంత్రులు ॥ శని - దాసుడు ॥ గనుక, పూర్వోక్తప్రకారము తమతమ సంజ్ఞలకు తగినట్లుగా కార్యాకార్యములు కలుగజేయుదురు. ప్రశ్నకాలమందును యీదేవిధముగా బలాబలములు యోచించి ఫలములు చెప్పవలయును॥

39 (గ్రహములకు॥ అధిదేవతలు॥)

సారావళియందు...............

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | సూర్యునకు | అగ్నిహోత్రుడు | 5 | గురునకు | దేవేంద్రుడు |
| 2 | చంద్రునకు | ఉదకము | 6 | శుక్రునకు | శచీదేవి |
| 3 | కుజునకు | కుమారస్వామి | 7 | శనికి | బ్రహ్మ |
| 4 | బుధునకు | విష్ణువు | | అధిదేవత లగుచున్నారు॥ | |



( ఇందుకు॥ ప్రయోజనము॥ )

నవగ్రహ పూజాదులయందు, గ్రహోక్త దేవతాపూజ చేయుట మొదలగు, వానియందు యుక్తమని చెప్పబడియున్నది ॥

40 నవగ్రహములకు దిగాధిపత్యములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | సూర్యుడు | తూర్పుదిశకు | 5 | శని | పశ్చిమదిశకు |
| 2 | శుక్రుడు | ఆగ్నేయదిశకు | 6 | చంద్రుడు | వాయవ్యదిశకు |
| 3 | కుజుడు | దక్షిణదిశకు | 7 | బుధుడు | ఉత్తరదిశకు |
| 4 | రాహువు | నైఋతిదిశకు | 8 | గురుడు | ఈశాన్యదిశకు |

అధిపతు లగుచున్నారు॥

ఉదాహరణము.

| | | | | |
|---|---|---|---|---|
| ఈ | | తూ | | ఆగ్నే |
| | గు | ర | శు | |
| ఉ | బు | | కు | ద |
| | చ | శ | రా | |
| వా | | పశ్చి | | నై |

గనుక, జననకాలమందు కేంద్రమందే గ్రహముండునో, ఆ గ్రహమునకు జెప్పబడిన దిక్కున సూతికాగృహద్వారమని యెరుంగవలయును, హృతనష్టాదులయందు చోరాదుల గమనమును నెరుంగవలయును. ఈ చక్రము వాస్తుప్రకరణములో శల్యాది శోధనయందుకూడా నుపయోగము గలదు॥

41 గ్రహములకు పంచభూతాధి పత్యములు ॥

రవి కుజులు॥ అగ్నికిని, శుక్రచంద్రులు॥ జలమునకును, బుధుడు॥ భూమికిని, బృహస్పతి॥ ఆకాశమునకు, శని॥ వాయువునకును, అధిపతు లగుచున్నారు॥ ఇందుకు ప్రయోజనము॥

శ్లో॥ ఛాయాంమహా భూత కృతాంచసర్వే
భవ్యంజయంతి స్వదశామవాప్య ।
అని దశాఫల మందు జెప్పబడి యున్నది॥

42. గ్రహములకు, సత్వరజస్తమోగుణములు.

రవిచంద్ర గురువులు॥ సత్వగుణంబు గలవారును॥
బుధ శుక్రులు॥ రజోగుణంబు గలవారును॥
అంగారక శనైశ్చరులు॥ తమోగుణంబు గలవారును॥

అధిపతులగుచున్నారు, గనుక, జన్మకాలమందు జాతకునికి బలవద్గ్రహగుణము గలుగును॥ మరియు॥

యవనేశ్వరుడు॥ అంగారకుని సత్వగుణాధిపతిగా జెప్పియున్నాడు॥ ఇందుకు॥

సత్యాచార్యమతము॥ సత్వమనగా శౌర్యమని శబ్దార్థము॥

వరాహమిహిరాచార్యులు గూడ, ఇందుకు సమ్మతించినారు, ఈప్రకారము, వరాహమిహిరాచార్య, యవనేశ్వరులకు, మతభేదము ఎక్కడెక్కడ గలుగుచున్నదో, అక్కడక్కడ, సత్యాచార్యమతమే వరాహమిహిరాచార్య సమ్మతమని తెలియవలయును॥

## 43. అయనాది కాలములు.

సూర్యాదిగ్రహములకు అయనాదికాలముల దెలుపబడును॥

సూర్యునికి॥ ఆరునెలలు, చంద్రునకు ఒకముహూర్తమగును కుజునికి ఒకదినము, బుధునికి రెండునెలలు, గురునికి ఒకనెల, శుక్రునికి 15 దినములు, శనికి ఒకసంవత్సరము, ఈప్రకారము కాలము నెరుంగునది॥

దీని ప్రయోజనము, ప్రశ్నకాలలగ్నమునకు ఏగ్రహసంబంధమైన నవాంశ ముదయించుచున్నదో, ఆగ్రహమునకు చెప్పబడిన కాలముపైని శుభాశుభములు జరుగునని నిర్ణయించవలెను॥ కొందరు లగ్నమందు ఎంతసంఖ్యగల నవాంశ ముదయింపుచున్నదో అంతసంఖ్యగల అయనాదికాలము అంశనాధునివలన నిర్దేశింపదగినదని చెప్పుదురు, ఈప్రకారమే మణిసిద్ధుడును జెప్పియున్నాడు॥ యింకను, యవనులు బాదరాయణులు, సత్యాచార్యులు, గార్గ్యాదులు వరాహమిహిరుడు మొదలగు ఋషిపుంగవులును, వీరికి సమ్మతముగాని ననేక విషయములు బహుగ్రంథకర్తలు ముహూర్తాది శాస్త్రములయందు వాదభేదములుగా జెప్పబడిరి, అవియన్నియు విమర్శించుటకు గ్రంథవిస్తరభీతిచేతను అవి అనర్హములనియును, యోచించి ముఖ్యాంశములే వ్రాయబడినవి॥



## 44. గ్రహములకు కటుకాది రసములు॥

సూర్యునికి కారము, చంద్రునికి లవణము, కుజునికి చేదు, బుధునికి షడ్రసములకూటమి, శుక్రునికి పులుసు, శనికి వగరును చెప్పుదురు॥

భోజన విషయమైన ప్రశ్నయందును, జన్మకాలమందు జాతకుడుభుజియించు వస్తువులయందును నిర్ణయింప వలయును॥

## 45॥ గ్రహముల స్వరూపములు॥

సూర్యుడు॥ తేనెవలెపింగళవర్ణమైన కన్నులును, చతుష్కోణమై ప్రసారిత భుజద్వయప్రమాణ సమోచ్ఛ్రాయమైన శరీరమును, స్వల్పకేశములు, పిత్తాధిక స్వభావముగలవాడు.

చంద్రుడు॥ కృశమై వర్తులమైన దేహమును, అధికవాత శ్లేష్మవ్యామిశ్రదేహుండును, మంచిమేధయు, మధురమైనకాక్కు, శ్రేష్ఠమైన దృష్టి మొదలగు స్వభావముగలవాడు॥

అంగారకుడు॥ నిత్యయౌవన యుక్తశరీరుడును, పైత్యాధికమై సన్నమైననడుము, ఈవి,చపలచిత్తము, మొదలగుస్వభావముగలవాడు॥

బుధుడు॥ గద్గదభాషియు, ఎల్లప్పుడు పరిహాసమందు ప్రీతియు, పైత్య, వాతశ్లేష్మములనెడు, త్రిగుణదోషములతో గూడిన స్వభావము గలవాడు॥

బృహస్పతి॥ స్థూలశరీరుడు, స్వర్ణవర్ణమైన వెంట్రుకలు, కన్నులును, ధర్మబుద్ధియు, శ్లేష్మాధిక స్వభావమును గలవాడు॥

శుక్రుడు॥ నిత్యసుఖాసక్తుడును, సుందరమైన శరీరమును, మంచినేత్రములును, నల్లనైవక్రములైన తలవెంట్రుకలును, శ్లేష్మవాతాధికస్వభావములు గలవాడు॥

శని॥ పనులయందు త్వరలేనివాడును, కపిలవర్ణములైన కన్నులును, కృశించిపొడవైన శరీరమును, గొప్పదంతములు, ముండ్లవలె, తీక్ష్ణమైన రోమములు తలవెంట్రుకలును గలవాడగును॥

46॥ నక్షత్రాధిదేవతలు, విషామృతధ్రువములు, యోగములు గల చక్రము॥

| సంఖ్య | నక్షత్రములు. | అధిదేవతలు. | విష ధృవః. | అమృత ధృవః. | యోగములు. |
|---|---|---|---|---|---|
| 1 | అశ్విని | అశ్వినీదేవతలు | ౫౦ | ౪౨ | విష్కంభము |
| 2 | భరణి | యముడు | ౨౪ | ౪౮ | ప్రీతియోగము |
| 3 | కృత్తిక | అగ్నిదేవుడు | ౩౦ | ౫౪ | ఆయుష్మాన్ |
| 4 | రోహిణి | బ్రహ్మ | ౪౦ | ౫౨ | సౌభాగ్యము |
| 5 | మృగశిర | చంద్రుడు | ౧౪ | ౩౮ | శోభనము |
| 6 | ఆర్ద్ర | శివుడు | ౨౧ | ౩౫ | అతిగండము |
| 7 | పునర్వసు | అదితిదేవి | ౩౦ | ౫౪ | సుకర్మము |
| 8 | పుష్యమి | గురుడు | ౨౦ | ౫౪ | ధృతియోగము |
| 9 | ఆశ్లేష | సర్పములు | ౩౨ | ౫౬ | శూలయోగము |
| 10 | మఖ | పితృదేవతలు | ౩౦ | ౫౪ | గండయోగము |
| 11 | పుబ్బ | భగుడనేసూర్యుడు | ౨౦ | ౪౪ | వృద్ధియోగము |
| 12 | ఉత్తర | ఆర్యమ్ణుడనేసూర్య | ౧౮ | ౪౨ | ధృవయోగము |
| 13 | హస్త | సూర్యుడు | ౨౧ | ౪౫ | వ్యాఘాతము |
| 14 | చిత్ర | ఇంద్రుడు | ౨౦ | ౪౪ | హర్షణము |
| 15 | స్వాతి | వాయువు | ౧౪ | ౩౮ | వజ్రయోగము |
| 16 | విశాఖ | ఇంద్రాగ్నులు | ౧౪ | ౩౮ | సిద్ధియోగము |
| 17 | అనోరాధ | మిత్రుడనేసూర్యుడు | ౧౦ | ౩౪ | వ్యతీపాత |
| 18 | జ్యేష్ఠ | దేవేంద్రుడు | ౧౪ | ౩౮ | వరీయాన్ |
| 19 | మూల | రాక్షసుడు | ౫౬ | ౪౪ | పరిఘయోగము |
| 20 | పూర్వాషాఢ | ఉదకము | ౨౪ | ౪౮ | శివయోగము |
| 21 | ఉత్తరాషాఢ | విశ్వదేవతలు | ౨౦ | ౪౪ | సిద్ధయోగము |
| 22 | శ్రవణము | విష్ణువు | ౧౦ | ౩౪ | సాధ్యయోగము |
| 23 | ధనిష్ఠ | అష్టవసువులు | ౧౦ | ౩౪ | శుభయోగము |
| 24 | శతతార | వరుణుడు | ౧౮ | ౪౨ | శుక్లయోగము |
| 25 | పూర్వాభాద్ర | అజైకపాదుడు | ౧౬ | ౪౦ | బ్రహ్మయోగము |
| 26 | ఉత్తరాభాద్ర | అహిర్బుధ్న్యుడు | ౨౪ | ౪౮ | ఐంద్రయోగము |
| 27 | రేవతి | పూషాఅనేసూర్య | ౩౦ | ౫౪ | వైధృతియోగము |



శ్లో॥ విష్కంభః ప్రీతిరాయుష్మాన్ సౌభాగ్యంశోభనంతథా।
అతిగండః సుకర్మాచ ధృతిశ్శూలం తథైవచ।
గండోవృద్ధిర్ధ్రువశ్చైవవ్యాఘాతో హర్షణంతథా।
వజ్రంసిద్ధిర్వ్యతీపాతోవరీయాన్ పరిఘశ్శివః।
సిద్ధంసాధ్యం శుభంశుక్లం బ్రహ్మైంద్రంచ వైధృతిః।
చంద్రార్కయోగ సంజాతా యోగాస్తే సప్తవింశతిః॥

ఈ శ్లోకార్థము పై నుదహరించిన చక్రమునందు విశదముగా వ్రాసియే యున్నది.

---

పై చక్రమునం దుదహరించిన ప్రకారము ఆయానక్షత్రములకు అధిపతులని తెలియునది. ఇందుకు జెప్పబడిన సూర్యవిశేషులు ద్వాదశాదిత్యులలో గొందరని తెలుసు కొనవలయును॥

---

పూర్వోక్త చక్రమునందు, ఉదహరించిన ప్రకారము, 27 నక్షత్రములకును, ఏర్పడిన, విషధృవామృత ధృవసంఖ్యలచేత విషామృతాది ఘటికాప్రారంభ కాలమును సాధించవలెను॥

ముందుగా నక్షత్ర, ఆద్యంతఘడియలను నెరుంగవలెను॥

47॥ విషఘటికా సాధనము॥

శ్లో॥ షష్టేశోద్యం పూర్వఋక్షం, వర్తమానర్క్ష సంయుతం।
ఋక్షాద్యంతం భవేత్తత్ర, నాడికాశ్చ వినాడికాః॥

తా॥ ౬౦ ఘడియల ప్రమాణములో, పూర్వనక్షత్ర ఘడియా విఘడియల నుతివిచి, మిగిలిన శేషము వర్తమాన నక్షత్రఘడియా విఘడియలలో చేర్చగా, నక్షత్ర, ఆద్యంత ఘడియా విఘడియలగును.

శ్లో॥ ఋక్షాద్యంతం ఘటీమానం, విషమానేనతాడితః।
షష్ట్యాప్తం హరతేలబ్ధం, పూర్వఋక్షేణ యోజయేత్॥

తా॥ ఆయానక్షత్ర ఆద్యంతఘడియలను ఆయానక్షత్ర విషధృవములచే గుణించి ౬౦ చే భాగించిన లబ్ధము ఘడియలును, శేష

ము విఘడియలునగును, ఈలబ్ధఘడియా విఘడియలను, పూర్వనక్షత్ర ఘడియలయందు జేర్చగా త్యాజ్యకాల ప్రారంభమగును॥

### త్యాజ్య పరిమాణ నిర్ణయము॥

శ్లో॥ ఋక్షాద్యంతం ఘటీమానం, చతుఘ్నం షష్టిభాజితం।
తల్లబ్ధం ఘటికా జ్ఞేయః, తచ్ఛేషాస్తు వినాడికాః॥

తా॥ నక్షత్రఆద్యంత ఘడియలను ౪ చే గుణించి ౬౦ చే భాగించిన లబ్ధము, ఘడియలు, శేషము విఘడియలు అనగా త్యాజ్యకాలప్రమాణము॥

{ త్యాజ్యకాల పరిమాణమునకు, లఘూపాయము ఇయ్యది సిద్ధాంతనిర్ణయము॥ }

శ్లో॥ నక్షత్రాద్యంత తిథ్యంశం, త్యాజ్యమానం భవేదిదం।
రాత్రిత్యాజ్య ఘటీయుక్తం, రాత్రిమానాధికం యది।
తన్మానేన విహీనం, తచ్ఛేష త్యాజ్య మితీరితం।
త్యాజ్యకాలే సమస్తాని, శుభకర్మాణి వర్జయేత్॥

తా॥ నక్షత్రఆద్యంత ఘడియలయొక్క ౧౫ భాగము త్యాజ్యకాలప్రమాణమగును, ఆత్యాజ్య పరిమాణము రాత్రి కాలత్యాజ్య ప్రారంభ ఘటికాయుక్తమైనదగుచు, రాత్రి కాలప్రమాణము కంటె అధికమైన యడల, నపుడు, దానిలో రాత్రి కాలప్రమాణమును తివచగా మిగిలిన, ఘడియావిఘడియలు శేషత్యాజ్య ఘడియలగును, అమృతఘటికలు నిదేవిధమున తేవలెను, త్యాజ్యకాలమందు, శుభకర్మలును జేయదగదనుట.

### ఉదాహరణము

చైత్రశుక్ల ౮ శనివారము ౪౮-౧౧ పునర్వసూ నక్షత్రపరిమాణము ౩౫-౨౦ దినం ౩౦-౫౦ రాత్రిప్ర ౨౯-౧౦ శుక్ల ౯ ఆదివారము ౪౯-౩౬ పుష్యమీనక్షత్ర పరిమాణము ౩౮-౪౭ దినం ౩౦-౫౩ మేషలగ్నభుక్తి ౦-౧౫ విఘడియలు ఈవర్తమాన పుష్యమీనక్షత్రమునకు ఆద్యంతఘడియలు, విషఘటికాసాధనమును కనుగొనవలయును॥



### త్యాజ్య ప్రారంభమునకు॥

పూర్వోక్త 47 విషయప్రకారము
60—0 అహోరాత్రప్రమాణమ్
పునర్వసు 35—20
శేషం 24—40
పుష్యమి 38—47
63—27 నక్షత్ర ఆద్యంతం
20 విషధృవము
60)1260—540(9 విఘడియలు
9 540
60)1269(21 లబ్ధము ఘడియలు
120
69
60
శేషము 9 విఘడియలు

ఈప్రకారము అన్ని నక్షత్రములకును ఆయా గుణకార భాగహారములచేత సాధించవలయును.

ఇట్లు సాధించగా వచ్చిన ఘడియా విఘడియలు—21—9.

ఈ ఘడియావిఘడియలు పూర్వ నక్షత్రము అనగా, చైత్రశుక్ల ౮ శనివారము, పునర్వసూ నక్షత్ర ఘడియా విఘడియలు 35—20 టిలో చేర్చగా ఉదయాది 56—29 ఘడియలకు త్యాజ్య ప్రారంభకాలమాయెను.

ఈ 56—29 టిలో దినప్రమాణ ఘడియా విఘడియలు 30—50 న్ని తీసివేయగా రాత్రి 25—39 ఘటికలకని యర్థము. త్యాజ్య ప్రమాణముకూడా చూపబడును.

నక్షత్రఆద్యంతము. 63-27
4
60)252—108(1
60
అధోత్తరముచేయు 2—48 చేర్చగా
60)254(4 ఘడియలు
240
శేషము 14 విఘడియలు

ఇట్లు చేయగా త్యాజ్యప్రమాణ ఘడియా విఘడియలు 4—14

మరియొకవిధము.

15)63—27(4—13
60
3
60
207
15
57
45
12 అధోత్తరము చేయగా పై ప్రకారము 4—14 లు ఆయెను ఇది లఘూపాయము

ఈ త్యాజ్యప్రమాణ ఘడియా విఘడియలు త్యాజ్య ప్రారంభ ఘడియలగు 25—29 టిలో చేర్చగా 29—53 ఆయెను.

ఇచ్చట రాత్రిప్రమాణము కంటె త్యాజ్యప్రమాణము అధికమై

నందున రాత్రిప్రమాణ ఘడియా విఘడియలు 29—10 తీసివేయగా మరుదినమనగా చైత్రశుక్ల ౯ ఆదివారము ఉదయం శేషత్యాజ్య ఘడియా విఘడియలు 0—43 దీనినే శేషవర్జ్య మందురు.

అమృత ఘటికలును, విషఘటికలు వలెనే సాధించవలయును.

48॥ చరస్థిరక్షిప్ర మృదుదారుణ నక్షత్రములు॥

అశ్విని, హస్త, పుష్యమి యీ 3ను, క్షిప్రనక్షత్రములు
మూల, ఆర్ద్ర, జ్యేష్ఠ ఆశ్రేషలు ౪ను, దారుణనక్షత్రములు
చిత్ర, రేవతి, మృగశిర్షానోరాధలు ౪ను, మృదునక్షత్రములు
రోహిణి, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలు ౪ను, ఉగ్రములు
భరణి, మఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఈ ౫ను, క్రూర నక్షత్రములు
కృత్తికా,విశాఖ ౨ను సాధారణ స్వభావముగల నక్షత్రములు
స్వాతీ, పునర్వసు, శ్రవణ, ధనిష్ఠ, శతతారలు ౫ను, చరనక్షత్రములు

ఈ చెప్పబడిన నక్షత్రములు, తమతమ సంజ్ఞాఫలములనిచ్చును, అనగా క్షిప్రనక్షత్రములు-శీఘ్రఫలమును, దారుణనక్షత్రములు-భయఫలమును, మృదునక్షత్రములు - మృదుఫలమును, స్థిరనక్షత్రములు-స్థిరఫలమును, ఉగ్రనక్షత్రములు - ఉగ్రఫలమును, సాధారణ నక్షత్రములు - సామాన్యఫలమును, చరనక్షత్రములు - చంచలఫలమును, నిచ్చుచున్నవి॥

49॥ అంధకాది నక్షత్రములు.

శ్లో॥ అర్కాక్రాన్తితర్క్షాది చతుర్భిరంధాః । షడ్భిర్ద్వినేత్రం నవైకనేత్రం । నేత్రాణి యుగ్మాని తథైవపంచ । త్రీణ్యాసురంధాః క్రమశః ఫలాని ॥

| సూర్యుడున్న నక్షత్రము మొదలు. |
|---|
| 4 ...అంధత్వ నక్షత్రములు. |
| 6 ...ద్వినేత్ర నక్షత్రములు. |
| 9 ...ఒకనేత్రముగలనక్షత్రములు |
| 5 ...ద్వినేత్ర నక్షత్రములు. |
| 3 ...అంధత్వ నక్షత్రములు. |



ఈ ౨౭ నక్షత్రములు క్రముగాతమతమ స్వభావ ఫలముల నిచ్చునని చెప్పుదురు.

ఇందుకు॥ సూర్యుడు మఖానక్షత్రమునందున్నప్పుడు, ఆమఖ మొదలు లెక్కించవలయును, మనమ యే నక్షత్రము నందు ముహూర్త నిర్ణయము చేసితిమో ఆనక్షత్రమువరకు లెక్కించగా ఎన్నవనక్షత్రమగునో, ఆనక్షత్రమునకు జెప్పబడినఫలమునుగ్రహించవలెను॥ ఏకనేత్ర, అంధత్వనక్షత్రములు నిందితములు॥

50॥ జీవ నిర్జీవ నక్షత్రములు ॥

శ్లో॥ అర్కేణముక్తస్థితగమ్యతారాస్త్రిస్రోమృతాస్సప్తతు చార్ధజీవా,ఏకోమృతోష్టౌచసు పూర్ణజీవా,ఏకోమృతస్సప్తసుపాదజీవా ॥

తా॥ సూర్యునిచేత విడువబడిన నక్షత్రమును, సూర్యుడున్న నక్షత్రమును, పొందబోయ్యే నక్షత్రమును కలసి.

| |
|---|
| 3 ...మృతనక్షత్రములు |
| 7 ...అర్ధజీవ నక్షత్రములు |
| 1 ...మృతనక్షత్రము |
| 8 ...సంపూర్ణ జీవనక్షత్రములు |
| 1 ...నిర్జీవ నక్షత్రము |
| 7 ...పాదజీవ నక్షత్రములు |

ఎట్లన్నను॥ సూర్యుడు కృత్తికా నక్షత్రమందుండగా, వెనకటిదైన భరణీ నక్షత్రమును కృత్తికయును పొందబోయ్యే రోహిణీ నక్షత్రమును మొదుకోతగ్గది, పాతజీవ, నిర్జీవమృత నక్షత్రములు, అమంగళప్రదమును గలుగజేయుచున్నవని ఋషులు జెప్పియుండిరి.

(5. తిథ్యాధిప, వారాధిపతుల జెప్పుచున్నాడు॥)

| సంఖ్య | తిథులు | అధిపతులు | సంఖ్య | తిథులు | అధిపతులు |
|---|---|---|---|---|---|
| ౧ | పాడ్యమి | అగ్ని | ౯ | నవమి | అష్టవసువులు |
| ౨ | విదియ | బ్రహ్మ | ౧౦ | దశమి | దిగ్గజములు |
| 3 | తదియ | పార్వతి | ౧౧ | ఏకాదశి | యముడు |
| ౪ | చవితి | విఘ్నేశ్వరుడు | ౧౨ | ద్వాదశి | విష్ణువు |
| ౫ | పంచమి | ఆదిశేషుడు | ౧3 | త్రయోదశి | మన్మథుడు |
| ౬ | షష్ఠి | కుమారస్వామి | ౧౪ | చతుర్దశి | కలిపురుషుడు |
| ౭ | సప్తమి | సూర్యుడు | ౧౫ | పూర్ణిమ | చంద్రుడు |
| ౮ | అష్టమి | శివుడు | ౧౬ | అమావాస్య | పితృదేవతలు |

వీరలీక్రమంబున తిథ్యాధిపతు లనంబడుదురు. మరియు వారాధిపతులు.

| సంఖ్య | వారములు | అధిపతులు | సంఖ్య | వారములు | అధిపతులు |
|---|---|---|---|---|---|
| 1 | ఆదివారము | సూర్యుడు | 5 | గురువారము | బృహస్పతి |
| 2 | సోమవారము | చంద్రుడు | 6 | శుక్రవారము | శుక్రుడు |
| 3 | మంగళవారము | అంగారకుడు | 7 | శనివారము | శనైశ్చరుడు |
| 4 | బుధవారము | బుధుడు | | | |

వీనలీ క్రమముగా వారాధిపతు లనంబడుదురు.

52॥ కరణ నామాని॥

శ్లో॥ బవశ్చబాలవశ్చేతి, కౌలవోతైతులస్తతః।
గరజశ్చవణిగ్భద్ర,. స్సప్తైతాని చరాణివై॥
తా॥ బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వనజి, భద్ర, మొదలగు నీయేడు కరణంబులును, చరములనబడును॥

శ్లో॥ కరణాన్య థకృష్ణేతు, చతుర్ధస్యుత్తరేదళే।
శకునీదర్శ పూర్వార్ధే, చతుష్పాదుత్తరేదళే॥
నాగవస్యాచ్ఛుక్ల పక్షేకింతుఘ్నః ప్రతిపద్యతః।
స్థిరాణి కరణాన్యేవం. సంభవంతి తిధిక్రమాత్॥
తా॥ కృష్ణపక్షపుచతుర్దశీ ఉత్తరార్ధమందు, శకునియు, అమావాస్య పూర్వార్ధమందు,చతుష్పాత్తును, అమావాస్య ఉత్తరార్ధమందు నాగవంబును, శుక్లపాడ్యమీ పూర్వార్ధమందు, కింతుఘ్నంబును. ఇట్లుతిధిక్రమమున వచ్చును గనుక, ఇవి నాలుగు, (స్థిరంబు) లనబడు ననుట॥

శ్లో॥ శుక్లాష్టమ్యాం పూర్ణిమాయాం, విష్టిఃపూర్వదళేభవేత్।
దినైస్యైకస్య కరణ, ద్వయమేవేతి చింతయేత్॥
తా॥ శుక్లపక్షపు అష్టమి యందును, పూర్ణిమ యందును, పూర్వార్ధమున, భద్రవాకరణము వచ్చును, ఒకదినముకు రెండుకరణములని తెలియవలెను (విష్టిః) అనగా భద్ర॥ పంచాగ సరళియందు॥

శ్లో॥ బవశ్చబాల వశ్చైవకౌవల వోతైతులస్తతః।
గరజశ్చ వణిక్చైవ, భద్రాశకునిమేవచ।
చతుష్పాన్నాగ వశ్చైవ, కింతుఘ్నంతు యధాక్రమం॥



తా॥ బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వనజి, భద్ర, శకుని, చతుష్పాత్, నాగవం, కింతుఘ్నం, ఈ ౧౧ కరణములు. తిధి క్రమంబున వచ్చును,

లఘూపాయముగా తెలియుటకై తిధి కరణచక్రం॥

| శుక్లపక్షపు తిధుల యందు పూర్వార్ధ, ఉత్తరార్ధ ములలో వచ్చెడి కరణములు॥ | | | కృష్ణపక్షపు తిధుల యందు పూర్వార్ధ, ఉత్తరార్ధ ములలో వచ్చెడి కరణములు॥ | | |
|---|---|---|---|---|---|
| తిథులు | పూర్వార్ధము | ఉత్తరార్ధము | తిథులు | పూర్వార్ధము | ఉత్తరార్ధము |
| 1 | కింతుఘ్నం | బవ | 1 | బాలవ | కౌలవ |
| 2 | బాలవ | కౌలవ | 2 | తైతుల | గరజి |
| 3 | తైతుల | గరజి | 3 | వనజి | భద్ర (విష్టిః) |
| 4 | వనజి | భద్ర (విష్టిః) | 4 | బవ | బాలవ |
| 5 | బవ | బాలవ | 5 | కౌలవ | తైతుల |
| 6 | కౌలవ | తైతుల | 6 | గరజి | వనజి |
| 7 | గరజి | వనజి | 7 | భద్ర (విష్టిః) | బవ |
| 8 | భద్ర (విష్టిః) | బవ | 8 | బాలవ | కౌలవ |
| 9 | బాలవ | కౌలవ | 9 | తైతుల | గరజి |
| 10 | తైతుల | గరజి | 10 | వనజి | భద్ర (విష్టిః) |
| 11 | వనజి | భద్ర (విష్టిః) | 11 | బవ | బాలవ |
| 12 | బవ | బాలవ | 12 | కౌలవ | తైతుల |
| 13 | కౌలవ | తైతుల | 13 | గరజి | వనజి |
| 14 | గరజి | వనజి | 14 | భద్ర (విష్టిః) | శకుని |
| 15 | భద్ర (విష్టిః) | బవ | 15 | చతుష్పాత్ | నాగవం |

53॥ అధహూణ మాసనిర్ణయః॥

శ్లో॥ జూౝనవంబరు యేప్రిలు సెప్టంబర్నామసంజ్ఞికాః॥
మాసఃప్రత్యేక తత్త్రింశ ద్దినైరేవ వినిర్ణితాః।
ఫిబ్రవర్నా మమాసస్తు ద్వ్యూనత్రింశ ద్దినైర్భవేత్।
సైకత్రింశ ర్ద్దినైరన్యే మాసాస్సర్వే వినిశ్చితాః॥

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | జనవరి | 31 | 5 | మే | 31 | 9 | శెప్టంబరు | 30 |
| 2 | ఫిబ్రవరు | 28 | 6 | జూన్ | 30 | 10 | అక్టోబరు | 31 |
| 3 | మార్చి | 31 | 7 | జూలై | 31 | 11 | నవంబరు | 30 |
| 4 | ఏప్రల్ | 30 | 8 | ఆగష్టు | 31 | 12 | డిసంబరు | 31 |

హూణశక సంవత్సరములను, నాలుగుచే భాగించగా, శేషము శూన్యమైనయడల, ఆ సంవత్సరమున ఫిబ్రవరినెల 29 దినములు వచ్చును. ఇయ్యది దశమస్థానములో రానేరదు॥ దీనికే లిపు సంవత్సరమని పేరు ॥

54॥ ద్రావిడమాసాః ॥

శ్లో॥ చిత్రి వైయ్యాశి ఆనిశ్చ, ఆడి ఆవణికే తతః ।
పెరటాశీ అల్పిశిశ్చ కార్తికే మార్గళీతథా ।
తైమాసి పంగుణీచైవ ఏతే ద్వాదశమాసకాః ॥

తా॥ చిత్రి, వైయ్యాశి, ఆని, ఆడి, ఆవణి, పెరటాశి, అల్పిసి, కార్తికి, మార్గళి, తై, మాసి, పంగుని, ఇవి ద్రావిడ మాసములు.

56 తురుష్కమాసాః॥

మోహరం, సఫర్, రబ్యులవల్, రబ్యుసాని, జమాదినవల్, జమాధియుస్సాని, రజప్, షాబాన్, రంజాన్, షవ్వాల్, జిలకాత్, జిలహేజ్, ఇవి 12 చంద్రోదయము మొదలు మాసారంభము ॥

55॥ పంచాంగ నిర్ణయం ॥

శ్లో॥ తిథివారంచ నక్షత్రం యోగం తిథ్యర్ధ సంజ్ఞికం ।
ఏతే పంచాంగనామాని కథ్యతే మునిపుంగవైః ॥

తా॥ తిథి, వార, నక్షత్ర, యోగ, కరణము మొదలగు సంజ్ఞలచే, పంచాంగమ్, అను నామాంతరము మునిపుంగవులచే నిర్ణయింప బడినది ॥

56॥ పక్షచ్ఛిద్రములు ॥

శ్లో॥ అష్టమీ ద్వాదశీ షష్ఠి చతుర్థీచ చతుర్థశీ ।
పక్షచ్ఛిద్రాశ్చ తిథయః శుభకార్యేషు నిందితాః ॥



తా॥ అష్టమి, ద్వాదశి, షష్ఠి, చతుర్థి, చతుర్థశి, ఈ తిథులు శుభకార్యములయందు నిందితములు, అనగా సీతిథులు పక్షచ్ఛిద్రములని పేర్లుగలవి ॥

57॥ పంచపర్వములు ॥

శ్లో॥ కృష్ణాష్టమీ చతుర్థశ్య ప్యమావాస్యాచ పూర్ణిమా ।
సంక్రాంతిః పర్వతిథయో మునిభిః పరికీర్తితాః ॥

తా॥ కృష్ణాష్టమియు, కృష్ణపక్ష చతుర్థశియు, అమావాస్యయు, పూర్ణిమయు, సంక్రమణ ప్రవేశతిథియు, ఇవి పంచపర్వ తిథులని ఋషులచే చెప్పబడినవని తాత్పర్యము ॥

గద్య.— స్వస్తి. శ్రీమత్సకల జగత్కారణ శ్రీసదాశివ, కూర్చనయనా, విఖ్యాత చౌడాంబానుగ్రహ సమాసాదిత, పంచవర్ణతంతు బ్రహ్మావిష్ణుమహేశ్వరాది, దేవాసుర, వసనోపవీత దాన సంలబ్ధ, నందిధ్వజాది ద్వాత్రింశ ద్బిరుదాంకిత మహాయశ స్సప్తావతార విరాజిత, శ్రీదేవలవంశ సంజాత. శ్రీమత్పుత్సల - వంశపయః పారావార రాకా సుధాకర, కశ్యపాన్వయపవిత్ర గంగయాఖ్యస్య జ్యేష్ఠపుత్రేణ వీరభద్రసిద్ధాంతినా విరచితమిదం ఆంధ్రతాత్పర్యోదహారణ సహితం దైవజ్ఞశిఖామణిర్నామకోయం గ్రంథరత్నే ప్రథమకాండ

స్సమాప్తః.





శ్రీరస్తు.

# దైవజ్ఞశిఖామణి.

## ద్వితీయకాండః.

మూ॥ ప్రణమ్య జగదుత్పత్తి స్థితిస్సంహార కారణమ్ ।
స్వర్గాపవర్గ యోర్ద్వారం త్రైలోక్యస్య శరణం శివమ్॥

తా. జగంబులకు సృష్టిస్థితి సంహారకుడును, ఐహికాముష్మిక మోక్ష రూపంబులైన పురుషార్థములకు ధాతయు, సర్వలోక రక్షకుండునగు, పరమేశ్వరునకు నమస్కారములు.

### 58.—ఆద్యా నామనక్షత్ర వివేక॥.

సర్వజననామంబుల ననుసరించిన నక్షత్రములను దెలుసుకునే వివర మెటువలెనంటే.

నామధేయాక్షరము.—చూ, చే, చో, లా, అశ్వినిఅనే అశ్విన్యాది యిరువదియేడు నక్షత్రముల అక్షరములలోనే యక్షరమాచున్నదో, ఆయక్షరముయొక్క నక్షత్రములను దెలుసుకొనునది.

వాక్యములయొక్క మొదటి అక్షరము మొదటిపాదము, రెండవయక్షరము రెండవపాదము, మూడవయక్షరము మూడవపాదము, నాలవయక్షరము నాలవపాదము. ఈ క్రమముగా యిరువదియేడు నక్షత్రములకు ఈదిగువ కనుపరచిన చక్రమునందు చూచుకో



ఇందుకు॥ ఉదాహరణము॥

| సంఖ్య | అక్షరసంజ్ఞ | నక్షత్రములు | సంఖ్య | అక్షరసంజ్ఞ | నక్షత్రములు |
|---|---|---|---|---|---|
| 1 | చూ,చే,చో,లా | అశ్విని | 15 | రూ, రే,రో,తా | స్వాతి |
| 2 | లీ,లూ,లే,లో | భరణి | 16 | తీ,తూ,తే,తో | విశాఖ |
| 3 | అ,ఈ,ఊ,ఏ | కృత్తిక | 17 | నా,నీ,నూ,నే | అనోరాధ |
| 4 | ఓ,వా,వీ,వో | రోహిణి | 18 | నో,యా,యీ,యూ | జ్యేష్ఠ |
| 5 | వే,వో,కా,కీ | మృగశిర్ష | 19 | యే,యో,బా,బీ | మూల |
| 6 | కూ,ఖం,జ్ఞ,ఛా | ఆర్ద్రి | 20 | బూ,ధా,భా,ఢా | పూర్వాషా |
| 7 | కే,కో,హా,హీ | పునర్వసు | 21 | బే,బో,జా,జీ | ఉత్తరాషా |
| 8 | హూ,హే,హో,డా | పుష్యమి | 22 | జూ,జే,జో,ఖా | శ్రవణం |
| 9 | డీ,డూ,డే,డో, | ఆశ్రేష | 23 | గా,గీ,గూ,గే | ధనిష్ఠ |
| 10 | మా,మీ,మూ,మే | మఖ | 24 | గో,సా,సీ,సూ | శతభిషం |
| 11 | మో,టా,టీ,టూ | పుబ్బ | 25 | సే,సో,దా,దీ | పూర్వాభా |
| 12 | టే,టో,పా,పీ | ఉత్తర | 26 | దు,శ్యం,చా,థా | ఉత్తరాభా |
| 13 | పూ,షం,ణా,ఢా | హస్త | 27 | దే,దో,చా,చి | రేవతి |
| 14 | పే,పో,రా,రీ | చిత్ర | | | |

శ్లో॥ కంగచ్ఛా రార్ద్రభేచైవ షణఢా హస్తతారకే ।
ఢభధా పూర్వాషాఢాయాం శంచథా భాద్రఉత్తరే॥

తా॥ కం, గ, ఛ, యీ మూడు వర్ణములు ఆర్ద్రానక్షత్ర మందలి. 2-3-4-పాదములు॥

ఈ మూడువర్ణములలో నేదైన నొక యక్షరము నామాద్యక్షర మయ్యెనేని యపుడా నక్షత్రమందా పాదముగా జూచుకొనేది. ఈ క్రమమున నే.

ష. ణ, ఢా, యీ మూడు వర్ణములు హస్తా నక్షత్రమందలి, 2-3-4.-పాదములు.

ఢ, భ, ధా, యీ మూడువర్ణములు, పూర్వాషాఢా నక్షత్ర మందలి 2-3-4-పాదములు.

శం, చ, ఝా, యీ మూడువర్ణములు, ఉత్తరాభాద్రా నక్షత్రమందలి, 1-2-3-పాదములుగానున్న చూచుకొనేది॥ మరియు॥ బ్రహ్మాయామిళమందు జెప్పబడిన ప్రకారము॥

శ్లో॥ ష్ణైశ్వరం చైత్వమాత్వం యత్రాదావర్తతే సదా।
తత్ర పూర్వాక్షరం గ్రాహ్య మిత్యుక్తం బ్రహ్మయామిళే॥

తా॥ నామాద్యక్షరములకు, ఐత్వముగాని, ఔత్వముగాని యున్నయడల, ఆ, ఐత్వము, ఔత్వమును విడిచి మొదటి యక్షరమునే గ్రహించతగ్గది,
అక్షరసంధిగల నామంబులకు గ్రంథాంతరమునందు॥ ఉదాహరణము॥

కాలవిధానే॥

మూ॥ కృష్ణోహ్యష్ణ శ్రీధరక్షేత్ర పాలోజ్ఞానో
భీమో భైరవ శ్చేతినామ్నాం॥
సౌమ్యస్వాతీ త్వష్టృహస్తార్ద్రిమూలాః
పూర్వాషాఢా చేతి ఋక్షాణిసప్త॥
మారుతస్య తృతీయేచ ద్రోణద్రౌపది శబ్దయోః
క్షేమోది తేః పూర్వషాదే ఫణినామ్నో త్తరస్థధా।
యల్లనా యాచనామాగ్ని యజ్ఞోనామచ శక్రభే
యర్రనా మూలనక్షత్ర మితినక్షత్ర సంజ్ఞకః॥

తా॥ కృష్ణుడనేపేరునకు, మగశీర్షా నక్షత్రమందు, తృతీయపాదము॥
హ్యష్ణుడనేపేరుకు, స్వాతీనక్షత్రమందు, ప్రథమపాదము॥
శ్రీధరుడనేపేరుకు, చిత్తానక్షత్రమందు, చతుర్థపాదము॥
క్షేత్రపాలుడనేపేరుకు, హస్తానక్షత్రమందు, ద్వితీయపాదము॥
జ్ఞానుడనేపేరుకు; ఆర్ద్రానక్షత్రమందు, తృతీయపాదము॥
భైరవుడనేపేరుకు, పూర్వాషాఢానక్షత్రమందు, తృతీయపాదము
క్షేమనేపేరుకు, పునర్వసు నక్షత్రమందు, ప్రథమపాదము॥
ఫణిఅనేపేరుకు, ఉత్తరానక్షత్రమందు, తృతీయపాదము॥
ద్రోణమనేపేరుకున్ను, ద్రౌపదియనే పేరుకున్ను, స్వాతీనక్షత్రమందు, తృతీయపాదము॥



యల్లన, యాచన, యగ్ని, యజ్ఞన, అనే యీ నాలుగుపేర్లకు జ్యేష్ఠానక్షత్రమందు, ద్వితీయపాదము॥
యెర్రనఅనేపేరుకు, మూలానక్షత్రమందలి ప్రథమపాదము॥
ఈ క్రమము, అవకహడాది చక్రమునందు జెప్పబడియున్నది॥

59॥ నక్షత్రపాదములుచే రాసులు తెలుసుకొనే క్రమము॥

గోళాంధకారమందు వాయువువలన పుట్టి, ఇరువదియేడు నక్షత్రములు గలిగిన శింశుమారచక్రము తొమ్మిదైన నక్షత్రపాదములు గురుతుగలిగి, సూర్యాదిగ్రహములకు మేషాదిరాసులు అగుచున్నవి॥ ఎట్లనిన, ఒక్కొక్క నక్షత్రమునకు 4 పాదములుచొప్పున అశ్విన్యాది 27 నక్షత్రములకు 108 పాదము లగుచున్నవి॥ ఈ 108 పాదములును, రాశి 1-కి 9 పాదములుచొప్పున, మేషాది మీనాంతము క్రమముగా చూచుకొనవలయును॥ ఈ విషయము శింశుమార చక్రములో విమర్శించిననూ, ఇచ్చట ప్రసంగవశముచేత నక్షత్రరాశి స్వరూపము దెలుపు చున్నాడు॥ ఇందుకు॥

ఉదాహరణము॥

| | | |
|---|---|---|
| 1 | అశ్విని, 4 పా, భరణి, 4 పా, కృత్తికలో 1 పాదముచేరి | మేషము |
| 2 | కృత్తిక-శేషం, 3 పా, రోహిణి, 4 పా, మృగశిరలో 2 పాదములుచేరి | వృషభము |
| 3 | మృగశీర్షా-శేషం, 2 పా, ఆర్ద్ర, 4 పా, పునర్వసులో 3 పాదములు చేరి | మిథునము |
| 4 | పునర్వసూ-శేషం, 1 పా, పుష్యమి, 4 పా, ఆశ్లేషా 4 పాదములుచేరి | కర్కాటకము |
| 5 | మఖ 4 పా, పుబ్బ 4 పా, ఉత్తరలో 1 పాదముచేరి | సింహము |
| 6 | ఉత్తరా-శేషం, 3 పా, హస్త, 4 పా, చిత్త, 2 పాదములుచేరి | కన్య |

| | | |
|---|---|---|
| 7 | చిత్రా-శేషం, 2 పా, స్వాతి, 4 పా, విశాఖా, 3 పాదములుచేరి | తుల |
| 8 | విశాఖా-శేషం, 1 పా, అనోరాధ, 4 పా, ఉత్త రాషాఢలో, 1 పాదముచేరి | వృశ్చికము |
| 9 | మూల 4 పా, పూర్వాషాఢ, 4 పా, ఉత్తరా షాఢలో 1 పాదముచేరి | ధనస్సు |
| 10 | ఉత్తరాషాఢా-శేషం, 3 పా, శ్రవణము, 4 పా, ధనిష్ఠ, 2 పాదములుచేరి | మకరము |
| 11 | ధనిష్ఠా-శేషం, 2 పా, శతభిషం, 4 పా, పూ ర్వాభాద్ర, 3 పాదములుచేరి | కుంభము |
| 12 | పూర్వాభాద్రా-శేషం, 1 పా, ఉత్తరాభాద్ర, 4 పా, రేవతి, 4 పాదములుచేరి | మీనము |

ఈ క్రమమున నామనక్షత్ర జన్మ నక్షత్రములచే రాసులను తెలుసుకో వలయును॥

60॥ నక్షత్రాంశ క్రమము॥

27 నక్షత్రములకు, 108 పాదములు గనుక, తొమ్మిదావర్తులు మేషాది రాసులగుచున్నవి.

ఉదాహరణము॥

అశ్విని ప్రథమపాదమునకు, మేషాంశము॥ ద్వితీయ పాదమునకు, వృషభాంశము॥ తృతీయపాదమునకు, మిథునాంశము॥ చతుర్థ పాదమునకు, కటకాంశము॥

భరణి ప్రథమపాదమునకు, సింహాంశము॥ ద్వితీయ పాదమునకు, కన్యాంశము॥ తృతీయపాదమునకు, తులాంశము॥ చతుర్థ పాదమునకు, వృశ్చికాంశము॥

కృత్తిక ప్రథమపాదమునకు, ధనురంశము॥ ద్వితీయ పాదమునకు, మకరాంశము॥ తృతీయపాదమునకు, కుంభాంశము॥ చతుర్థపాదమునకు, మీనాంశము॥ ఈప్రకారము గణనచేయవలెను॥ యింకనూ దీని విమర్శ జాతకభావమునందు విశదముగా వ్రాయుచున్నాను॥



ఈ శాస్త్రాంతర్గతమైన ముఖ్యవిషయము యెట్టిదనిన॥

61॥ (కాల నిరూపణము॥)

సూర్యసిద్ధాంతే॥

శ్లో॥ తీక్ష్ణసూచ్యాబ్జ పుష్పైశ్చ దళవేధ స్త్రుటిర్భవేత్।
తత్ఫలం లవఇత్యుక్తం తత్త్రింశస్తు నిమేషకః।
నిమేషా స్సప్తవింశశ్చ, కాలోగుర్వ క్షరస్మృతః।
దశగుర్వక్ష రోకాలో ప్రాణఃకాలో విధియ్యతే।
షడ్భిః ప్రాణై ర్వినాడిస్యా త్తత్షష్ట్యా నాడికాస్మృతాః॥

తా. కేవల మృదువగు కమలదళమునందు, తీక్ష్ణమైన సూది మొనతోగృచ్చగా, యంత సూక్ష్మకాలములో అట్టి దళమునందు, ఆ సూదిమొన దిగబడుచున్నదో, ఆకాలమునకు తృటికాలమనిపేరు. అట్టి తృటికాలములు 100 అయితె, ఒక లవకాలమగును, యీలవకాలములు 30 అయితే, ఒక నిమిషకాలమవుచున్నది. యీ నిమిష కాలములు $2^7$ అయితే, ఒకగుర్వక్షరకాలము. ఇట్టి గుర్వక్షర కాలములు 10 అయితే, ఒక ప్రాణకాలము. యీప్రాణకాలములు 6 అయితే, ఒక విఘడియఅవును. ఇట్టి విఘడియలు 60 అయినప్పుడు ఒకఘడియ అవుచున్నది. ఇటువంటిఘడియలు రెండుఅయితే, (ముహూర్తం, ఘటికాద్వయం.) అను న్యాయమున, వకముహూర్తమౌచున్నది. యీలాగే యామాదిప్రమాణములు సహా అవుచున్నవి.

ఇట్టి సూక్ష్మాది కాలనిర్ణయము.

కాలామృతే.

మూ॥ యావత్స్పంద తిలోచనం సుఖకరం తత్కోటి భాగోభవే।
త్తల్లగ్నే శుభకాలయేవ సతతం బ్రహ్మోన జానాతితం।
అన్యేకింపునరేవ కర్తురథ తత్కాల శ్శుభోవాశుభః।
పూర్వాదృష్ట వశాద్భవే త్సమయ విత్తత్సాక్షి మాత్రంసదా॥

తా. సుఖకరమగునట్లు జెలింపబడే కనురెప్పపాటులో కోటి

యంశ పరిమాణకాలము, లగ్నమందు శుభకాలముగా నుండును. చిత్రవిచిత్ర నిర్మాణచతురుండగు విధాతకూడా యీకాలమును తెలుసుకొనుటకు సాధ్యంబుగాని, యీసూక్ష్మము నితరులెరుగజాలరు, గనుక సర్వజనులకు జన్మాంతరకృత పుణ్య పాపకర్మాను సరణముగ లగ్నము సంప్రాప్తమగును.

ఈ విధముగా పరబ్రహ్మస్వరూపమైన యీకాలము మానవుల కభేద్యమైనదని శాస్త్రప్రమాణములు పలుకుచున్ననూ, యిటువంటి కాల సాధనకొరకు.

62.—పాదచ్ఛాయాగత ఘటికా ప్రమాణజ్ఞానము.

మూ॥ యావంత్య శ్చరణప్రభాః ప్రతిదినం మేషాది షట్సుక్రమా।
దోర్జ్యాశ్చైవ తులాదిషట్సుజలధి త్రిద్వ్యక్షిరామాబ్ధయః।
అర్ధీకృత్య దినప్రమాణ ఘటికాస్సప్తాహతా నాడికాః।
స్తావంత్యో ఉపరపూర్వయోః
స్థితగతా యత్పూర్వ సంఖ్యాభిధాః॥

తా. సూర్యుని వెనకనుంచుకొని తననీడ తనయడుగులచే గొలిచి, ఆయడుగుల సంఖ్యలలో,

మేష, కన్యా, తులా, మీన, మాసములయందు, ౪ ను,
వృషభ, సింహ, వృశ్చిక, కుంభ, మాసములయందు, 3 న్ను,
మిథున, కర్కటక, ధను, మ్మకరమాసములయందు, ౨ ను,
జేర్చవలెను. అదియట్లుంచి.

అహః ప్రమాణ ఘటికలను ౨ భాగములుజేసి, యందొక భాగము ౭ చే, గుణించి, పూర్వోక్తంబగు ధృవక సంఖ్యలతో జేరిన పాదచ్ఛాయా సంఖ్యచే భాగించగా నేర్పడిన లబ్ధము ఘడియ లగును. అవి సూర్యోదయము లగాయుతు ఇన్ని ఘడియల ప్రొద్దెక్కిన దనియును, మధ్యాన్నమునుంచి గతించిన ఘడియలనియు నెరుంగ వలయును.



వృషభమాసమునకు

| | |
|---|---|
| దిన ప్రమాణము | 32—0 |
| యిందులో రెండో భాగము అనగా | |
| దినార్ధ | 16—0 |
| దీనిని హారకముచే | 7 |
| మొత్తము | 112 |
| పాదచ్ఛాయలు | 10 |
| వృషభధృవకము | 3 |
| మొత్తము | 13 |
| పూర్వ మొత్తం | 13)112(8 |
| | 104 |
| శేషము | 8 |
| | 60 |
| | 13)480(36 |
| | 39 |
| | 90 |
| | 78 |
| శేషము | 12 |

యీ శేషమును అర్ధోత్తరముగా చేస్కుకోగా ౮-37 ఘడియా విఘడియలు వచ్చినవి॥

యీ ఘడియా విఘడియలు సూర్యోదయము మొదలు ఇన్ని ఘడియలప్రొద్దు యెక్కినదని తెలిసితిమి॥ దీనినే మధ్యాహ్నము క్రింద మార్చుకోగా దినార్ధ 16 రులో యీ ఘడియావిఘడియలు తీసి వేయగా, ౭-౨౪ ఘడియా విఘడియలు ప్రొద్దువున్నదని యెరిగితిమి॥

మరియొక విధము ఎట్లనిన॥

శ్లో॥ అహస్స ర్ధాంగ నేత్రోనం పాదచ్ఛాయా సమన్వితం॥
అహస్త్రి గుణితం కృత్వా తల్లబ్ధం ఘటికాద్భవేత్॥

తా॥ దినప్రమాణములో, ౨౬-౪ తీసివేశి, శేషము, పాదచ్ఛాయలులో చేర్చి, యొకచోటనుంచి దినప్రమాణమును 3 చే గుణించి, పాదచ్ఛాయాప్రమాణముచే భాగించగా వచ్చినలబ్ధము ఘడియా విఘడియ లగును॥

ఈ పద్ధతి ఉదయము మొదలు, మధ్యాన్నమువరకైనచో నిన్ని ఘడియల ప్రొద్దైనదనియు, మధ్యాన్నము మొదలు అస్తమయమునకు ఇన్నిఘడియల ప్రొద్దున్నదనియు నెరుగవలెను.

ఉదాహరణము॥

పాదచ్ఛాయలు ౧౦ దినం 3౨-౦ టిలో ౩౬-౪ తీసివేశిన శేషము ౫-3౦ యింములో పాదచ్ఛాయలు చేర్చినది. ౧౫-3౦ దిన ప్రమాణమును 3 చే గుణించినది, ౪౬ దీనిని పాదచ్ఛాయా మొత్తముతో భాగించగా వచ్చిన ఘడియా విఘడియలు ౬-౧౨ గనుక పూర్వోక్త ప్రకారము నెరుంగవలెను॥

మరియొకవిధము॥

మూ॥ పృష్ఠస్తేర్కే సమంభూమి స్వచ్ఛాయాగ్రం నిరీక్ష్యచ।
దక్షిణం పాదముద్ధృత్య వామపాదర్ధతః పునః॥

తా॥ సూర్యుడు పృష్ఠభాగమునం దుంకునటుల నిలువబడి సమభూమియందు తనయొక్క ఛాయాగ్రమునకు గురుతుజేశి, దక్షిణ పాదము నెత్తి, వామపాదముయొక్క అర్థభాగము మొదలుకొని, ఛాయాగ్రపర్యంతము కొలిచిన పాదచ్ఛాయలగును, అనగా, పూర్వాహ్ణమందు పశ్చిమాభిముఖముగను, అపరాహ్ణమందు పూర్వాభిముఖముగను, నిలువబడి ఛాయలు సాధింపదగినదని వరరుచియను వారు చెప్పిరి. వీరు, కాలపరిమాణమునుగురించి యింకను కొన్ని వాక్యములను చెప్పియున్నారు॥ ఎట్లన్ననూ॥ మేషే, గిరిపు, వృషభే, టసట, మిథునే, కరిలి, కటకే, కరుబ, తులా, లవశ, వృశ్చికే, మాతాశ, ధనుషి, సిజల, మకరే, దదాసి, కుంభే, సితశ, మీనే, శుభగ, ఈ 12 వాక్యములకు, ఘటికా ప్రమాణమునకు, గణితములేక నత్యంత సులభముగ తెలుసుటకు॥ మేషమాసమందు మొదట ౧౦ తేదులవరకు తానుంచిన, పాదచ్ఛాయ అడుగులలో, అర అడుగు తీసి వేసి మిగిలిన, అడుగులలో, మేషమాసము వాక్యమందున్న, మొదటి అక్షరమునకు గల ప్రమాణము తీసివేసి మిగిలిన ప్రమాణము నుంచుకొనేది, మేషమాసమునందు, రెండవ ౧౦ తేదులవరకు, రెండవయక్షర ప్రమాణమును తీసివేసేది, మిగతా ౧౦ తేదులలోను, మూడవ యక్షరప్రమాణమును, తీసివేయవలయును. వృషభ మాసమునందు మూడక్షరములును, ౧౦ తేదుల కొక యక్షరముచొప్పున,



నక్షరమునకు గల ప్రమాణము తీసివేసి, తక్కిన యడుగులను గల, ఘటికాప్రమాణములు, ముందర చెప్పబోయెడి ప్రకారము, నిశ్చయము చేసుకొనవలయు. ఈక్రమముగా, ౧౨, మాసములకును చూచుకొనే యక్షర ప్రమాణమనగా, సాంకేత నిఘంటువునందు, చెప్పిన ప్రకారము, ఆ యక్షరమునకు, యేసంఖ్యవచ్చునో ఆసంఖ్య పంకలను తీసివేసేది. ఎట్లన్ననూ॥ గి యనే అక్షరమునకు, మూడుసంఖ్య, అందు మూడుపరకలు, పాతికాపరక, ఈ క్రమముగా తెలియునది. ఈ విషయమునే కొందరు నవీనులు, స్వకల్పితముగా రచించితిమని కొన్ని గ్రంథములయందు వ్రాయబడినవి॥ ఇది వరరుచి నిర్మితము॥

63॥ పాదచ్ఛాయలకు గడియలుచూచే క్రమము॥

శ్లో॥ నవత్యష్ట పదాదేకా నాడికా తత్రచోచ్యతే।
పంచార్థ చత్వారింశద్వే అష్టావింశత్త్రియస్తథా।
ఏకోనవింశ చ్చత్వారి చతుర్థశ్యాంతుపంచకం।
దశార్థే నాడికాష్షట్చ అష్టకే సప్తనాడికాః।
షట్పదే చాష్టకంవిద్యా చ్చతుర్థే నవమస్మృతం।
త్రికార్థే దశకంవింద్యా ద్వ్యర్థ ఏకాదశస్తథా।
ఏకత్రిపాదో ద్వాదశ్యాం పాదమేకం త్రయోదశ।
చతుర్థ సార్థపాదేవ శూన్యేపంచ దశస్మృతాః॥

తా॥ 96 అడుగులకు, నొకఘడియ. $45\frac{1}{2}$ అడుగులకు, 2 ఘడియలు. 28 అడుగులకు, 3 ఘడియలు. 19 అడుగులకు, 4 ఘడియలు. 14 అడుగులకు, 5 ఘడియలు. $10\frac{1}{2}$ అడుగులకు, 6 ఘడియలు. 8 అడుగులకు, 7 ఘడియలు. 6 అడుగులకు, 8 ఘడియలు. $4\frac{1}{2}$ అడుగులకు, 9 ఘడియలు. $3\frac{1}{2}$ అడుగులకు, 10 ఘడియలు. $2\frac{1}{2}$ అడుగులకు, 11 ఘడియలు. $1\frac{1}{2}$ అడుగుకు, 12 ఘడియలు. 1 అడుగుకు, 13 ఘడియలు, $0\frac{1}{2}$ అడుగుకు, 14 ఘడియలు. శూన్యచ్ఛాయ అయితే 15 ఘడియలు అని. తెలుసుకొనునది॥ ఇయ్యది వరరుచిమతము॥ ఈ గ్రంథకర్తమతము కొంచ మెచ్చుతక్కువగా నున్నందునను, గణిత బాహుళ్యము లేకబోవుటవలనను ఇక్కడ నుదహరించుట మయినది॥

రాత్రియందు ఘటికాప్రమాణ కాలములను, దెలుసుకొనుట కై నక్షత్రస్వరూపములను జెప్పుచున్నాము ॥

64॥ వరరుచి వాక్యములు ॥

ముహూర్తదర్పణే॥

శ్లో॥ తురగ ముఖాస్వస్త్రీణి భరణీ యోనిత్రిణి ।
కృత్తికా క్షురావట్కం శకటం పంచరోహిణి ।
మృగశిరా శీర్షత్రయం ఆర్ద్రా ప్రవాళమేకం ।
పునర్వసూ షటుధనురాకారం సరటా పుష్యమిత్రీణి ।
ఆశ్రేషా సర్పాబుతు మఖాందోళికా పంచ ।
పుబ్బ ఉత్తర నేత్రద్వయోః హస్తా పాణినాంపంచ ।
చిత్రా మౌక్తికమేకం స్వాతీ మాణిక్యమేకం ।
విశాఖా కులాలచక్రపంచ అనోరాధా జ్యేష్ఠాంగుళ ఛత్రాకారత్రయం ।
మూలా కుప్యత్కేసరీ పంచ పూర్వాషాఢా ఉత్తరాషాఢా ద్వేద్వేచౌకం ।
శ్రవణే మత్స్యాకారత్రయం ధనిష్టా శీర్షత్రయం ।
శతభిష క్ళుతతారయోః పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర ।
ద్వేద్వేఖట్వాం రేవతీ మత్స్యాకారత్రయ ॥

| | |
|---|---|
| అశ్విని | అశ్వముఖమువలె 3 పొట్టునక్షత్రములుగలది |
| భరణి | యోనివలె 3 నక్షత్రములు గలిగియుండును |
| కృత్తిక | మంగలకత్తివలె 6 నక్షత్రములు గలిగియుండును |
| రోహిణి | బండివలె 3 నక్షత్రములు గలిగియుండును |
| మృగశిర్ష | శిరస్సువలె, 3, నక్షత్రములుగలదై యుండును |
| ఆర్ద్రి | పగడపువర్ణముగలిగి ఒక గొప్ప నక్షత్రముగలది |
| పునర్వసు | కుమ్మరసానవలె, 5, నక్షత్రములు గలిగియుండును |
| పుష్యమి | తొండవలె, 3, నక్షత్రములు గలదైయుండును |
| ఆశ్రేష | సర్పమువలె, 6 నక్షత్రములు గలిగియుండును |
| మఖ | పాలకివలె, 5, నక్షత్రములు గలది |
| పుబ్బ | నేత్రములవలె, 2, నక్షత్రములు గలది |
| ఉత్తర | నేత్రములవలె, 2, నక్షత్రములు గలది |



| | |
|---|---|
| హస్త | చేతివ్రేళ్లవలె, 5, నక్షత్రములు గలది |
| చిత్ర | ముత్స్యమువలె, 1, నక్షత్రము గలది |
| స్వాతి | మాణిక్యమువవె, 1, నక్షత్రము గలది |
| విశాఖ | కుమ్మరసానవలె, 5, నక్షత్రములు గలది |
| అనోరాధ జ్యేష్ఠలు | అంగుళమువలె, ఛత్రాకారమై మూడు నక్షత్రములు గలదై యుండును |
| మూల | గొంతిసింహమువలె, 5, నక్షత్రములు గలది |
| పూర్వాషాఢ | చౌకమువలె, 2, నక్షత్రములు గలది |
| ఉత్తరాషాఢ | చౌకమువలె, 2, నక్షత్రములు గలది |
| శ్రవణం | మత్స్యాకారముగలిగి, 3, నక్షత్రములు గలది |
| ధనిష్ఠ | శిరస్సువలె, 3, నక్షత్రములు గలది |
| శతతార | నూరునక్షత్రములలో నొకపుష్పమువలె నుండును |
| పూర్వాభాద్ర | రెండునక్షత్రములుగలిగి మంచముకోళ్లువలె నుండును |
| ఉత్తరాభాద్ర | రెండునక్షత్రములుగలిగి మంచముకోళ్లువలె నుండును |
| రేవతి | మత్స్యాకారమువలె, 3, నక్షత్రములు గలది |

65॥ ఈప్రకారము నక్షత్రస్వరూపములను కనిపెట్టి ఉచ్చ నక్షత్రములను దెలుసుకొను క్రమము.

శ్లో॥ జ్యేష్ఠాదీనా మతిక్రమ్య పౌష్టాదీనా మనాగమే।
ఆర్ద్రాదీనాం సమంకుర్యా న్నవమ ద్వాదశక్రమాత్ ॥

తా॥ జ్యేష్ఠమొదలు 9 నక్షత్రములు, ఉచ్చమును దాటిన పిమ్మట ఉచ్చము, రేవతి నక్షత్రముమొదలు 6 నక్షత్రములు ఉచ్చ సామీప్యమునుగూర్చి వచ్చుచుండగా నుచ్చము ఆర్ద్రిమొదలు 12 నక్షత్రము లుచ్చమందు ఉండేటప్పుడు ఉచ్చము, ఉచ్చమనగా తాను ఆకాశమును జూచేటప్పుడు తన ముక్కుకు సూటిగల ప్రదేశము ఉచ్చమని క్రమముగా తెలుసుకోవలెనని తాత్పర్యము॥

మరియొకవిధము ॥

ప్రతిదినమందు సూర్యుడున్న నక్షత్రముమొద లుచ్చగత నక్షత్రమువరకు గణనచేసి అందు 7 నక్షత్రములు విడచి, తక్కిన నక్షత్ర

ములకు నొక్కొక్క నక్షత్రమునకు, 2 ఘడియలచొప్పున నున్ను సూర్యుడు తానున్న నక్షత్రము యెన్నవపాదమం దుండునో, ఆ పాదము మొదలు తక్కిన పాదములలో నొక్కొక పాదమునకు అరఘడియ చొప్పుననున్ను గణనచేయగా నేర్పడిన మొత్తము. అప్పటికి గతించిన ఘడియలనియు, సూర్యుడున్న రాశి మొదలు సూర్యాస్తమయము వరకు 6 రాసులనియు, అస్తమయము మొదలు సూర్యోదయమువరకు 6 రాసులనియు భావము॥ ఉదాహరణము॥

సూర్యుడు మఖానక్షత్ర ద్వితీయపాదమునం దున్నప్పుడు, ఈ రాత్రి, శ్రవణనక్షత్ర ముచ్చము గతించుచుండగా సూర్యస్థిత నక్షత్రము మొదలు శ్రవణ నక్షత్రమువరకు లెక్కించినది 13 పైన చెప్పిన ప్రకారము 7 నక్షత్రములు తీసివేయగా శేషము 6 వీటికి 12 ఘడియలు అయినవి. 2-3-4 పాదములకు 3 అరఘడియలు చేర్చగా నైన ఘడియా విఘడియలు 13-30 గతించినవి, అప్పటికి మేషలగ్నము గతించినది. సూర్యోదయకాలమం దున్న సింహరాశి మొదలు మేషము వరకు 9 రాసులు. అస్తమయమునకు 6 రాసులు తివచగా శేషము 3 రాసులు గతించి నాలవరాశి ప్రవేశము, వృషభమని తెలిసినది, అప్పుడు జననమైన శిశువు యీరాత్రి 13-30 ఘడియలకు వృషభ లగ్నమందు జననమని తెలియవలెను॥ ఇంకనూ॥

66॥ ఉచ్చనక్షత్రములను కనిపెట్టి మేషాదిరాసుల ప్రమాణములలో చెల్లినఘడియలను దెలుసుకొను వివరము॥

నరరుచి వాక్యములు ॥

| | | |
|---|---|---|
| శ్రవణౌ, మేష, గతా | రోహిణి, సింహే, గురుః | హస్తా, ధనుర్ బలా |
| శ్రవిష్ఠా, వృషభే, నభ | మృగశిరాః, కన్యా, నేయ | చిత్రా, ధనుర్, శరైః |
| శతభిష, గ్వృషభే, రామః | ఆర్ద్రా, కన్యా, యుత | స్వాతీ, మకరే, కామ |
| ప్రోష్ఠప, న్మిధునె, పరః | పునర్వసు, తుల,నీల | విశాఖా, మకరే, వనం. |
| అహిర్బుధ్ని,మిధునే,భానుః | పుష్య, స్తులా, రామః | అనూరాధా, కుంభే, నాభీ |
| రేవతీ, కర్కి, యజ్ఞః | ఆశ్రేషా, తులా, భోగి | జ్యేష్ఠా, కుంభే, కథా |
| అశ్వినీ, కర్కి, రూపః | మఖా, వృశ్చిక, కల | మూల, కుంభే, గచ్ఛ |
| భరణీ, కర్కి, శాబః | ఫల్గునీ, వృశ్చిక, లత | పూర్వాషాఢా, మీనే, కవిః |
| కృత్తికా, సింహే, కామ | ఉత్తరా, ధనుర్, నామ | ఉత్తరాషాఢా, మీనే, గాధ |



తాత్పర్యము॥

| | | | | |
|---|---|---|---|---|
| శ్రవణము | ఉచ్చయందుంటే | మేషలగ్నమందు | 2—45 | ఘడియలౌను |
| ధనిష్ఠా | ఉచ్చయందుంటే | వృషభలగ్నమందు | 0—22 | విఘడియలౌను |
| శతభిషము | ఉచ్చయందుంటే | వృషభలగ్నమందు | 2—37 | ఘడియలౌను |
| పూర్వాభా | ఉచ్చయందుంటే | మిథునలగ్నమందు | 1—15 | ఘడియలౌను |
| ఉత్తరాభా | ఉచ్చయందుంటే | మిథునలగ్నమందు | 4— 0 | ఘడియలౌను |
| రేవతి | ఉచ్చయందుంటే | కటకలగ్నమందు | 1—37 | ఘడియలౌను |
| అశ్విని | ఉచ్చయందుంటే | కర్కాటకమందు | 2— 7 | ఘడియలౌను |
| భరణి | ఉచ్చయందుంటే | కర్కాటకమందు | 5—22 | ఘడియలౌను |
| కృత్తిక | ఉచ్చయందుంటే | సింహాలగ్నమందు | 1— 7 | ఘడియలౌను |
| రోహిణి | ఉచ్చయందుంటే | సింహాలగ్నమందు | 3—15 | ఘడియలౌను |
| మృగశిర | ఉచ్చయందుంటే | కన్యాలగ్నమందు | 0— 7 | విఘడియలౌను |
| ఆర్ద్రా | ఉచ్చయందుంటే | కన్యాలగ్నమందు | 1—45 | ఘడియలౌను |
| పునర్వసు | ఉచ్చయందుంటే | తులాలగ్నమందు | 0—22 | విఘడియలౌను |
| పుష్యమి | ఉచ్చయందుంటే | తులాలగ్నమందు | 2—37 | ఘడియలౌను |
| ఆశ్రేష | ఉచ్చయందుంటే | తులాలగ్నమందు | 4—22 | ఘడియలౌను |
| మఖ | ఉచ్చయందుంటే | వృశ్చికలగ్నమందు | 1—22 | ఘడియలౌను |
| పూర్వఫల్గు | ఉచ్చయందుంటే | వృశ్చికలగ్నమందు | 3—45 | ఘడియలౌను |
| ఉత్తరఫల్గు | ఉచ్చయంగుంటే | ధనుర్లగ్నమందు | 0—37 | విఘడియలౌను |
| హస్త | ఉచ్చయందుంటే | ధనుర్లగ్నమందు | 3—22 | ఘడియలౌను |
| చిత్ర | ఉచ్చయందుంటే | ధనుర్లగ్నమందు | 5—15 | ఘడియలౌను |
| స్వాతి | ఉచ్చయందుంటే | మకరలగ్నమందు | 1—37 | ఘడియలౌను |
| విశాఖ | ఉచ్చయందుంటే | మకరలగ్నమందు | 4— 0 | ఘడియలౌను |
| అనోరాధ | ఉచ్చయందుంటే | కుంభలగ్నమందు | 0—37 | విఘడియలౌను |
| జ్యేష్ఠ | ఉచ్చయందుంటే | కుంభలగ్నమందు | 1—52 | విఘడియలౌను |
| మూల | ఉచ్చయందుంటే | కుంభలగ్నమందు | 3—52 | ఘడియలౌను |
| పూర్వాషా | ఉచ్చయందుంటే | మీనలగ్నమందు | 1—30 | ఘడియలౌను |
| ఉత్తరాషా | ఉచ్చయందుంటే | మీనలగ్నమందు | 3—52 | ఘడియలౌను |

ఈ క్రమముగా తెలుసుకొనునది. ఈ వాక్యములయందు, అంత్యాక్షరములైన రెంటిలోను, మొదటియక్షరమునకు ఘడియలును, రెండవయక్షరమునకు పరకులునని తెలుసుకొనేది. ఈ ప్రమాణమునకు అస్తమయకాలముకు భుక్తిపోగా శేషించిన లగ్నము మొదలుగా గ్రహించవలెను॥

ఇత్యాది, అనేక గ్రంథప్రమాణములచేత, పగటి భాగమందు పాదచ్ఛాయాది సాధనమువల్లనున్ను, రాత్రికాలమున నక్షత్ర సంచారములనుబట్టిన్ని కాలసాధన లగ్నసాధనలు చేసుకొనుటకు ఆధారములుగా యేర్పడుటచేత దైవజ్ఞులకు కాలసాధన సాధారణముగా వశమై యుంటున్నదని యేర్పడెను॥

ఘనమైన మేఘడాంబరములతో చేరియుండునపుడు, ఛాయా సాధన, నక్షత్రసాధన, యేలాగు, జ్యోతిష్కుల సంఘటన అవునేది, ఇందుకు ముఖ్యమైనది వాదాంశముగా నున్ననూ యిందుకున్ను॥

శ్లో॥ అంగుళీ మేరుమాదాయ సప్తాంగుళి ధరాయచ ॥

అను ప్రమాణముచేత దీప ప్రకాశముతో సాధన కాగలదని పలుకుచున్నది॥

యింతకంటే సూక్ష్మమైనదిన్ని, దృఢమును గలుగజేయ దగ్గదిన్ని, సరియైన కాలమును, తెలియజేశే మార్గమెట్లన్ననూ॥

ముగ్గురు దైవజ్ఞులు చేరి యేదో వకకాలమునుబట్టి యిన్ని ఘటికాదులు అయివున్నట్లు, వారి, వారికి దృఢముగా తోచే ఘటికాదులను, పరస్పరముగా వక, వక, చీటియందు వ్రాశియుంచి, అనంతరం, ఆముగ్గురు వ్రాయబడిన, మూడు చీట్లల్లోని, ఘటికాదులను, వకమొత్తముజేసి, ఆ రాశియందు మూడింట ఒక భాగమును, తీసుకున్నంతట, తద్వారా యేర్పడేకాలము, చాయానక్షత్ర ఘటికా యంత్రాదులవల్ల యేర్పడే నిర్ణయకాలమునకు సరిగా వక నిమిషమైనను న్యూనాతిరిక్తములు లేకుండా, దివా రాత్రి భాగములయందు, సరిపోవుచున్నట్లు కొన్ని గ్రంథములయందు స్పష్టమగుచున్నది॥

శిరోమణీ గ్రంథములయందుకూడా అనేక విషయములు జెప్పియున్నవిగాని, సిద్ధాంతాదులవలన కొన్ని సాధనలు ఏర్పడినవి, అవి యన్నియు తెలిపుటకు గ్రంథవిస్తర భయంబుచే దెలుపలేదు॥



67॥ ఘటికా యంత్రము॥

మహాభారతే॥

శ్లో॥ కర్షేణా భ్యదికైష్షడ్భిః ఫలైస్తామ్రస్య భాజనం ।
త్రింశమంగుళ విస్తార ముచ్ఛ్రితం చతురంగుళం ।
స్వర్ణమాషేణ కృత్వావై చతురంగుళ కాష్టికాం ।
మధ్యభాగే తయావిద్ధా నాడికా ఘటికాస్మృతాః ।
తద్రంధ్రేణాం భసాపాత్రం యావత్కాలేన పూరితం ।
సకాలో నాడికాతస్యా షష్ఠిభాగో వినాడికాః ॥

తా॥ ఆరుంబాతిక ఫల మెత్తుగల రాగిచే, ముప్పది యంగుళముల విస్తారమును, నాలుగంగుళములు పొడవుగల యొకగిన్నె జేయించి, యా గిన్నె మధ్యను మాష మెత్తున 4 అంగుళములు పొడవుగల శలాకచే రంధ్రము చేయించి, నీళ్లతొట్టిలో నుంచగా, యంతతడవుకు రంధ్రముగుండా నీరెక్కి యాగిన్నె నీటిలో మునుగుచున్నదో యంత మట్టుకు నొక ఘడియకాలమైనదని తెలియవలయును॥ ఇటుల మహాభారతమునందు ఋష్యాదులు, భీష్మాదులకు జెప్పిరని బృహత్పారాశరమందు వ్రాశియున్నది॥

అక్షర సంజ్ఞః॥

శ్లో॥ కాదిర్నవోటా దినవః పాదిపంచ చయాష్టకః॥

తా॥ కకారము మొదలు తొమ్మిది యక్షరములు పర్యంతమున్ను,
టకారము మొదలు తొమ్మిది యక్షరములు పర్యంతమున్ను,
పకారము మొదలు అయిదు అక్షరములు పర్యంతమున్ను,
యకారము మొదలు యెనిమిది యక్షరములు పర్యంతమున్ను,
అక్షరసంజ్ఞ వర్గులని తెలుసుకొనునది॥ యెట్లన్నను॥

క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఇవి 9 అక్షరములు.

ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, ఇవి 9 అక్షరములు.

ప, ఫ, బ, భ, మ, ఇవి 5 అక్షరములు.

య, ర, ల, వ, శ, ష, స, హ, ఇవి 8 అక్షరములు.

గద్య.— స్వస్తి. శ్రీమత్సకల జగత్కారణ శ్రీసదాశివ, కూర్చ
నైనా విఖ్యాత చాడాంబానుగ్రహ సమాసాదిత, పంచవర్ణతం
తు బ్రహ్మావిష్ణుమహేశ్వరాది, దేవాసుర, వసనోపవీత దాన
సంలబ్ధ, నందిధ్వజాది ద్వాత్రింశ ద్బిరుదాంకిత మహా
యశ స్సప్తావతార విరాజిత, శ్రీదేవలవంశ సంజాత.
శ్రీమత్పుత్సల - వంశ పయః పారావార రాకా
సుధాకర, కశ్యపాన్వయపవిత్ర గంగయాఖ్యస్య
జ్యేష్ఠపుత్రేణ వీరభద్రసిద్ధాంతినా విరచిత
మిదం ఆంధ్రతాత్పర్యోదహరణ సహితం
శ్రీదైవజ్ఞశిఖామణిర్నామకోయం
గ్రంథరత్నె ద్వితీయకాండ
సమాప్తః.





శ్రీరస్తు.

# దైవజ్ఞశిఖామణి.

## తృతీయకాండః.

### 68॥ తారాబల నిర్ణయమ్॥

శ్లో॥ జన్మనక్షత్ర మారభ్య నిత్యభాంతంచ గణ్యతే।
నవసంఖ్యా హరద్భాగం నవతారాః ప్రకీర్తితాః।
జన్మసంప ద్విపత్క్షేమ ప్రత్యక్సాధన నైధనం।
మిత్రం పరమమైత్రంచ నవతారాః ప్రకీర్తితాః॥

తా॥ జన్మనక్షత్రము మొదలుకొని, నిత్యనక్షత్రము వరకు లెక్కించినసంఖ్యను, తొమ్మిదింట భాగించగా మిగిలిన సంఖ్యలు ముఖ్యముగా 1 జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6 సాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార, 9 పరమమైత్రతార. ఈక్రమముగా జన్మతార మొదలు తొమ్మిది తారలగును.

### తారలయొక్క ఫలాఫల నిర్ణయమ్॥

మూ॥ జన్మబంధేహ నాశాయ సంపత్సంపద ఏవచ।
విపచ్చ కార్యనాశాయ క్షేమా క్షేమ కృతేభవేత్।
ప్రత్యక్చ కార్యనాశాయ సాధనం కార్యసాధనే।
నైధనం నిధనేపిస్యా న్మిత్రంచ సుఖసంపది।
పరమమైత్రం సుఖేవింద్యా త్తారాబల మితిక్రమాత్॥

| 1 | జన్మతార, దేహనాశనము | 6 | సాధనతార, ప్రయోజనసాధనము |
|---|---|---|---|
| 2 | సంపత్తార, సంపదయు | 7 | నైధనతార, మరణము. |
| 3 | విపత్తార, కార్యనాశనము | 8 | మిత్రతార, సుఖసంపద |
| 4 | క్షేమతార, కుశలము | 9 | పరమమైత్రతార, సుఖమును కలుగజేయును. |
| 5 | ప్రత్యక్తార, ప్రయోజనహాని | | |

తారాధిపతయః ॥

శ్లో॥ జన్మన్యర్కో౽హి మకరసుత స్సింహికేయ స్సురేజ్యః ।
కేతుశ్చంద్రో దినకరసుతో భార్గవో భూమిపుత్రః ।
తాపంలాభం క్షితిధృతిలయా న్కీర్తిహాని ప్రమోదా ।
న్మృత్యుం తారాబల మనుదినంతే దిశంతి క్రమేణ ॥

తా॥ జన్మతార కధిపతి సూర్యుడై తాపమున్ను, సంపత్తార కధిపతి బుధుడై ద్రవ్యలాభమును, విపత్తార కధిపతి రాహువై నాశనమును, క్షేమతార కధిపతి బృహస్పతియై ధైర్యమును, ప్రత్యక్తార కధిపతి కేతువై మరణమును, సాధనతార కధిపతి చంద్రుడై యశస్సును, నైధనతార కధిపతి శనియై, ప్రయోజన నిష్ఫలత్వమును, మిత్రతార కధిపతి శుక్రుడై సంతోషమును, పరమ మైత్రతార కధిపతి కుజుడై మరణమును, యిచ్చుచున్నారు॥

తారావాహనం తత్ఫలమ్ ॥

జన్మతారయందు నెమలివాహనమై మనస్సంతాపమును,
సంపత్తారయందు గుఱ్ఱము వాహనమై లాభ ధన సంపదలును,
విపత్తారయందు మేకవాహనమై కలహమును.
క్షేమతారయందు గజవాహనమై రాజ్యలాభమును.
ప్రత్యక్తారయందు వాయసము వాహనమై కార్యహానియు.
సాధనతారయందు నక్కవాహనమై సౌఖ్యమును.
నైధనతారయందు సింహవాహనమై యుద్ధభయమును,
మిత్రతారయందు గరుడువాహనమై విశేష సౌఖ్యమును,
పరమమైత్ర తారయందు హంసవాహనమైకార్యవిభవంబును.

గలుగజేయుచున్నారు॥ ఈ పరమమైత్ర తారకు అధిపతి వాహనమునుగురించి కొన్ని గ్రంథములయందు ప్రయోజన భంగమనియు, కొన్ని గ్రంథములయందు కార్యవిభవంబును అని చెప్పుచున్నందునను, బృహత్పారాశర గ్రంథమునందు కార్యవిభవంబనే జెప్పియున్నది॥ ఇచ్చట గ్రంథకర్త అభిప్రాయము. మధ్యఫలదాయకము॥ అని అభిప్రాయము॥



దోషతారల వివరము దానములు॥

శ్లో॥ జన్మత్రిపంచ సప్తాఖ్యా స్తారానేష్ట ఫలప్రదాః ।
తద్దోష పరిహారాయ దద్యాదే తద్ద్విజాతయే ।
శాకం గుండూచ లవణం సతిలం కాంచనం క్రమాత్ ॥

తా॥ పైని జెప్పబడిన తొమ్మిది తారలలో, జన్మతారయును, మూడవదియగు విపత్తారయు, అయిదవదియగు ప్రత్యక్తారయు, నేడవదియగు నైధనతారయు, నీ నాలుగుతారలు, దోషతారలనియు నీ తారా దోష పరిహారార్థము॥

జన్మతారకు, శాకము॥ విపత్తారకు, గుడము॥ ప్రత్యక్తారకు, ఉప్పు॥ నైధనతారకు, తిలసహితంబగు సువర్ణమున్ను॥ బ్రాహ్మణునికి దాన మివ్వవలయును॥

మరియు॥ జన్మతారయందు 7 ఘడియలును, విపత్తారయందు 3 ఘడియలును, ప్రత్యక్తార నైధనతారలయందు 8 ఘడియలును, ఈ క్రమమున నాయా తారలయందు దోషఘడియలను విడిచి, తక్కిన ఘడియలయందు పైని చెప్పినక్రమమున దానముల నిచ్చిన నాయా తారల దోష ఘటికానంతర ఘటికలయందు శుభకర్మలుజేయ శుభ పరమని గ్రంథాంతరమునందు జెప్పబడెననుట॥ ఇందుకు ॥

జన్మతారయందు తృతీయపాదము, విపత్తారయందు మొదటి పాదము, ప్రత్యక్తారయందు చతుర్థపాదము, నైధనతారయందు ద్వితీయపాదము, శుభకరములుగాన, నీపాదములు నిషేధింపగా శేషించిన నాయా తారల పాదములయందు పై క్రమమున దానములనిచ్చిన, శుభకర్మలుజేయ నర్హములని జెప్పబడియున్నది ॥ మరియు ॥

గ్రంథాంతరే॥

మూ॥ ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేచ తృతీయకం ।
తృతీయే పంచమం త్యాజ్యం నైధనం త్రిషువర్జయేత్ ॥

తా॥ జన్మనక్షత్రము మొదలుగా 9 నక్షత్రములవరకు, లెక్కించినది ప్రథమ నవకమనియు, 10 నక్షత్రము మొదలు 18 నక్షత్రమువరకు, లెక్కించినది రెండవ నవక మనియు, 19 నక్షత్రము మొదలు 27 రేవతినక్షత్రమువరకు మూడవ నవకమనియును, ఈ క్రమమున జన్మన

క్షత్రముమొదలుగా, 27 నక్షత్రములు మూడు నవకములగుచున్నవి. అందు మొదటినవకమందలి, జన్మతారయు, ద్వితీయనవకమందలి, తృతీయయగు విపత్తారయు, తృతీయనవకమందలి, అయిదవదియగు, ప్రత్యక్తారయు, సకల శుభకర్మలయందును, వర్జింపవలెను, ఋతరనవకములయందు దోషము లేదు, ఈ మూడునవకములలో 7 తారయగు, నైధనతారయందును, శుభకర్మలు జేయ నశుభకరమనుట॥

మరియు॥ చంద్రుడు స్వోచ్ఛ స్వక్షేత్రములయం దుండినపుడు విపత్తార ప్రత్యక్తారలయందు సకలశుభకర్మలు జేయుటకు, శుభకరములగుననుట॥

ఉదాహరణము॥

హిరాణయ్యకు, శ్రవణనక్షత్రమునకు, తారాబలము చూడవలయును, వీనికి జన్మనక్షత్రము లేనందున, నామాక్షరము, హి, హే, హొ, డా, అను నామాక్షరములలో, ప్రథమాక్షరమైనందున, పుష్యమీనక్షత్రములో ప్రథమ చరణము, గనుక, ఈపుష్యమిలగాయుతు, శ్రవణనక్షత్రమువరకు లెక్కించిన, సంఖ్య 15, దీనిని పూర్వ ప్రకారము 9 చే భాగించగా 6 మిగలినది, 68 విషయప్రకారము, సాధనతారగనుక, కార్యసాధనగలుగునని చెప్పవచ్చును, ఈ ప్రకారము, సర్వనామములకు తారాబల నిర్ణయము చేయవలెను॥

69॥ చంద్ర బలమ్॥

మూ॥ జన్మరాశి సమారభ్య చంద్రాంతం పరిగణ్యతే।
ద్వాదశస్థాన సంఖ్యేన శుభాశుభ వినిర్ణయః ॥

తా॥ జన్మరాశి మొదలుకొని, చంద్రుడున్న రాశి వరకు, లెక్కించిన సంఖ్యచే, ద్వాదశరాసులయందు సంచరించు చంద్రుడిచ్చే శుభాశుభములు, తెలియబడుననుట॥

మూ॥ జన్మానల ఋతౌ సప్త దశమైకాదశే శుభః।
చతుష్టద్వాదశే కృష్ణే శుక్లేద్వి నవపంచమే।
యథామాతా సుతాన్ రక్షే తథారక్షతు చంద్రమాః ॥

తా॥ పైనిజెప్పిన క్రమమున, జన్మరాశి మొదలుకొని, చంద్రుడున్న రాశివరకు, లెక్కించిన సంఖ్యలో, జన్మరాశికి, 2-9-5 ఈసంఖ్యలుగల, స్థానములయందున్న చంద్రుడు, శుక్లపక్షము నందును।

4-8-12 ఈస్థానముల యందున్న చంద్రుడు, కృష్ణపక్షము నందును.

1-3-6-7-10-11 ఈస్థానముల యందున్న చంద్రుడు, రెండు పక్షముల యందును, శుభకరుడనియు, ఇందుకు వ్యత్యయముగా నున్న చంద్రు డశుభకరుడనియు, జెప్పబడెననుట॥

ఉదాహరణమ్॥

పూర్వ ప్రకారము పుష్యమీనక్షత్రముకు, కర్కాటకరాశి అయినది॥ శ్రావణశుక్ల 15 యుక్త, శ్రవణనక్షత్రముకు, మకరరాశి గనుక॥ కటకరాశి మొదలు, మకరమువరకు లెక్కించిన సంఖ్య 7 ఈసప్తమరాశియగు మకరమునందు, చంద్రుడున్నందున, పైశ్లోకప్రకారము చంద్రుడు శుభకరుడౌ ననుట॥

స్త్రీకిభర్తయుండగా స్వతంత్ర వెటులుండదో యటువలెనే, శుక్లపక్షమునందు, వృద్ధిచంద్రుడౌటవలన తారకు బలము లేనందున, శుక్లపక్షమునందు చంద్రబలము, కృష్ణపక్షమునందు తారాబలము, ముఖ్యములని చెప్పబడెను॥

మరియు॥ పురుషులకు, సూర్యబలము, స్త్రీలకు గురుబలము, స్త్రీపురుషులకు, తారాబల, చంద్ర బలములున్ను, ముఖ్యమైనవని చెప్పబడెను॥

70॥ జలభూస్థల ఆకాశచంద్ర ఫలము॥

శుద్ధపాడ్యమి మొదలు తత్కాలతిథివరకు లెక్కించగా వచ్చిన తిథి సంఖ్యను 7 చే గుణించి, యాసంఖ్యలో కృత్తికా నక్షత్రము మొదలు, తత్కాల నక్షత్రమువరకు లెక్కించిన నక్షత్ర సంఖ్యను, కలియగూడి, అందులో 12 చేర్చి యామొత్తమును 9 చే భాగించగా॥

1-4-7 మిగిలెనేని జలచంద్రుడనియు,
2-5-8 మిగిలెనేని భూస్థల చంద్రుడనియు,
3-6-9 మిగిలెనేని ఆకాశ చంద్రుడనియు,
చెప్పబడినది, ఇందుకు ఫలము॥

జలచంద్రుడైన కార్యసిద్ధి॥ భూస్థలచంద్రుడు కార్యనాశనమును, ఆకాశచంద్రుడు కార్యసిద్ధినిన్ని, ఇచ్చుచున్నాడు, ఈ ఫలము యాత్రాదులకు, కృషివాణిజ్యాది, వ్యవహారముల కవశ్యకమయినదని తెలియదగినది॥

71॥ సన్ముఖ చంద్రఫలం ॥

మేష, సింహ, ధనస్సులకు, తూర్పుదిక్కున్ను॥ వృష, కన్యా, మకరములకు, దక్షిణదిక్కున్ను॥ తులా, మిథున కుంభములకు, పశ్చిమదిక్కున్ను॥ కర్కాటక, వృశ్చిక, మీనరాసులకు, ఉత్తరదిక్కున్ను॥ స్థానములు గాన, జన్మరాశికి స్థానమైనదిక్కుకు, యెదట దిక్కుయందు స్థానమైనరాసులయందు, చంద్రుడుండగా శుభకార్యములు జేసెనేని ధనలాభమున్ను కుడిపార్శ్వదిక్కుయందు స్థానమైన రాసులయందు, చంద్రుడుండగా, శుభకార్యాదులు చేయబడెనేని బలమున్ను, ఎడమభాగ దిక్కులయందున్న రాసులయందు చంద్రుడుండగా కలహమున్ను, పృష్ఠభాగ దిక్కుయందున్న రాసులయందనగా, జన్మరాశి దిక్కుయందున్న రాసులయందు చంద్రుడుండగా మరణమున్ను గలుగును॥

ఈ ప్రకారమే యాత్రాదులకు జన్మరాశిదిక్కుకు, యెదుట దిక్కుకు స్థానమైన రాసులయందు చంద్రుడుండునపుడు యాదిక్కుకు ప్రయాణమైనయడల ధనలాభమున్ను, కుడిభాగ దిగ్రాసులయందుండునపుడు, ఆ దిక్కుకు ప్రయాణమైనయడల బలమున్ను కలుగును, తక్కిన రాసులకు నీ ప్రకారమే ఫలములు జూడదగినది, ప్రశ్న విషయమైన్ని యీప్రకారమే సన్ముఖచంద్రుడున్ను, కుడిపార్శ్వ చంద్రుడున్ను, కార్యసిద్ధిన్ని, ఎడమపార్శ్వ పృష్టభాగముల యందున్న, చంద్రుడు కార్యహానిన్ని, గలుగజేయునని తాత్పర్యము॥

72॥ మాసఫలమ్ ॥

మూ॥ శుక్లాది తార మారభ్య జన్మభాంతంచ గణ్యతే।
నవసంఖ్యా హారచ్ఛేషం, మాసిమాస ఫలంస్మృతం ।

మూ॥ పంథాసుభోజ్యం తనుతాపశౌర్యే విద్యాచ వస్త్రం విపులంచశోకం ।
అనంతపుణ్యంచ మహాఫలంచ నవేతిమాసస్య ఫలానిచాహుః ॥



తా॥ శుద్ధపాడ్యమియొక్క ప్రవేశమునం దేనక్షత్రమగునో, యా నక్షత్రము మొదలుకొని జన్మనక్షత్రమువరకు లెక్కించిన సంఖ్యను, 9 చే భాగించగా మిగిలిన, సంఖ్యకు॥

| | | | |
|---|---|---|---|
| 1 | పంథయనియు | 6 | వస్త్రమనియు |
| 2 | సుభోజ్యమనియు | 7 | విపులశోకమనియు |
| 3 | తనుతాపమనియు | 8 | అనంతపుణ్యమనియు |
| 4 | శౌర్యమనియు | 9 | మహాఫలమనియు |
| 5 | విద్యయనియు | | |

ఈక్రమమున మాసఫలము చెప్పబడెను॥

ఉదాహరణమ్ ॥

దుర్మతిసం॥ వైశాఖశుక్ల పాడ్యమీ ప్రవేశకాలములో భరణీనక్షత్రమున్నందున. కృష్ణుడనేవానికి మాసఫలము చూడవలయును॥ వీనికి నామనక్షత్రము మృగశిర్ష గాన॥ భరణీనక్షత్రము మొదలు మృగశిర్షా నక్షత్రమువరకు లెక్కించినసంఖ్య 4 దీనిని 9 చే భాగించుటకు హారకముపోనందున, ఈ నాలుగు శేషముగాన యీ మాసమందు పైన చెప్పినప్రకారము, యీ జాతకుడు, శౌర్య రస ప్రభావముతో గూడియుండునని చెప్పవలయును॥

73॥ సంక్రాంతిఫలమ్ ॥

మూ॥ జన్మతారాది సంక్రాంతి కాలభాంతం ప్రగణ్యతే।
సప్తభి ర్గుణితం కృత్వా భాజితం వసుసంఖ్యయా।
తచ్ఛేషేణ ఫలాన్యాహు స్సంక్రాంతేశ్చ మనీషిణః।
రోగలాభం తథాధ్వానం బంధనం ధనమేవచ।
ఐశ్వర్య మర్థలాభంచ నృపీడా యథాక్రమం॥

తా॥ జన్మనక్షత్రము మొదలుకొని సంక్రమణ ప్రవేశకాల నక్షత్రమువరకు, లెక్కించినసంఖ్యను, 7 చే గుణించి, 8 చే భాగించగా మిగిలినసంఖ్య॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | రోగము | 4 | బంధనము | 7 | ధనలాభము |
| 2 | లాభము | 5 | ధనము | 8 | రాజపీడ |
| 3 | ప్రయాణము | 6 | ఐశ్వర్యము | | |

ఈ విధమున విద్వాంసులు సంక్రాంతిఫలమును జెప్పిరనుట॥

మరియొకవిధము ॥

సంక్రమణ ప్రవేశకాలమందున్న తిథి, వార, నక్షత్రముల యొక్కయు, జన్మనక్షత్రముయొక్కయు, సంఖ్యలనేకము జేసి, అనగా॥ నక్షత్రగణనకు అశ్విన్యాదిగాను, తిథిగణనకు శుక్ల ప్రతిపదాదిగాను, వారగణనకు, ఆదివారాదిగానున్ను, గణనచే నేర్పరచి, యేకముచేసి న సంఖ్యల నేడుచే భాగించగా మిగిలిన శేషము ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | రోగము | 4 | హాని | 7 | ధనక్షయము |
| 2 | లాభము | 5 | సంపద | | |
| 3 | మృత్యువు | 6 | భోగము | | |

ఈప్రకారము ఫలముల నూహించ తగ్గదని గ్రంథాంతరమందు జెప్పబడె ననుట॥

మరియు గ్రంథాంతరమందు ॥

సూర్య సంచార నక్షత్రము మొదలు జన్మనక్షత్రమువరకు,

నరాకారచక్రము॥

| | | |
|---|---|---|
| 1 సుభోజ్యం | 4 శుభాధికము | 3 విజయము |
| 4 ధనలాభం | 5 బంధనము | 1 నధికభయము |
| 4 ప్రయాణము | 4 సంతోషము | |

ఈ ప్రకారము సూర్య సంచార నక్షత్రము మొదలు, జన్మ నక్షత్రము నే యవయవమునం దుంటున్నదో ఆ యవయవమునకు చెప్పినఫలము నా సంక్రమణము నెలరోజులకు ఫలమని ప్రకారాంత ము జెప్పబడెననుట ॥



74॥ సూర్యాది గ్రహాణాం దశావర్ష నిర్ణయః॥

శ్లో॥ ఇనశశి కుజరాహు ర్జీవ మందజ్ఞకేతు।
ర్భృగుజ ఇతి నవానాం కృత్తికాది క్రమేణ॥
తను ౬ నయ ౧౦ సిను ౭ జాయా ౧౮ త్రోయా ౧౬ దాయాంగ
సటా ౧౭ సా ౭ నర ౨౦ ఇతి విదురబ్దాః భాస్కరాది క్రమేణ॥

తా॥ కృత్తికా నక్షత్రము మొదలుకొని, జన్మనక్షత్రమువరకు లెక్కించగా వచ్చిన మొత్తమును 9 చే భాగించగా ౧ రవి, ౨ చంద్రుడు, 3 కుజుడు, ౪ రాహు, ౫ గురుడు, ౬ శని, ౭ బుధుడు, ౮ కేతు, ౯ శుక్రుడు, నీక్రమముగా దశాధిపతు లగుచున్నా రనుట ॥

గ్రంథాంతరే॥

శ్లో॥ షట్సూర్యో దశమశ్చంద్ర స్సప్తసంఖ్యా ధరాసుతః।
రాహురష్టా దశశ్చైవ గురుష్షోడశవత్సరః॥
ఏకోన వింశతి స్సౌరి ర్బుధస్సప్త దశ స్తథా।
కేతోశ్చ సప్తవర్షాణి భృగుర్వింశతి చక్రమాత్ ॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | సూర్యదశాసంవత్సరములు | 6 | 6 | శనిదశాసంవత్సరములు | 19 |
| 2 | చంద్రదశాసంవత్సరములు | 10 | 7 | బుధదశాసంవత్సరములు | 17 |
| 3 | కుజదశాసంవత్సరములు | 7 | 8 | కేతుదశాసంవత్సరములు | 7 |
| 4 | రాహుదశాసంవత్సరములు | 18 | 9 | శుక్రదశాసంవత్సరములు | 20 |
| 5 | గురుదశాసంవత్సరములు | 16 | | | |

ఈప్రకారము గ్రహములకు దశావర్షము లేర్పడినవనుట॥

ఉదాహరణమ్॥

ఆశ్వయుజ శుక్ల ౪ శుక్రవారము, విశాఖా నక్షత్రమునం దుదయించినవానికి॥ కృత్తికా నక్షత్రము మొదలుకొని, విశాఖా నక్షత్రమువరకు లెక్కించిన మొత్తము 14 దీనిని 9 చే హరించగా మిగిలిన శేషము 5 పూర్వోక్త ప్రకారము, రవిమొదలు, అయిదవ దశ గురుమహాదశ, ఈజాతకునకు, జనన కాలమందు గురుమహాదశయని చెప్పవలయును॥

### 75॥ నక్షత్ర దశానిర్ణయః॥

| | | |
|---|---|---|
| 1 | కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ॥ నక్షత్రములకు, | సూర్యమహాదశ |
| 2 | రోహిణి, హస్త, శ్రవణ॥ నక్షత్రములకు, | చంద్రమహాదశ, |
| 3 | మృగశీర్ష, చిత్ర, ధనిష్ఠ॥ నక్షత్రములకు, | కుజ మహాదశ, |
| 4 | ఆర్ద్ర, స్వాతి, శతతార॥ నక్షత్రములకు, | రాహుమహాదశ |
| 5 | పునర్వసువిశాఖపూర్వాభాద్ర॥నక్షత్రములకు | గురు మహాదశ, |
| 6 | పుష్యమిఅనోరాధఉత్తరాభాద్ర॥ నక్షత్రముల [కు | శని మహాదశ, |
| 7 | ఆశ్లేష, జ్యేష్ఠ రేవతి॥ నక్షత్రములకు, | బుధ మహాదశ, |
| 8 | మఖ, మూల, అశ్విని॥ నక్షత్రములకు, | కేతు మహాదశ, |
| 9 | పుబ్బ, పూర్వాషాఢ, భరణి॥ నక్షత్రములకు, | శుక్ర మహాదశ, |

ఆయా నక్షత్రములయందు, జననమైనవారికి, ఆయామహాదశలు, జననకాల గ్రహదశలుగా నెరుగవలయును॥ ఇట్లుయేర్పడిన నవగ్రహదశలకు మహాదశా ఫలంబులున్ను అంతరములున్ను. విదేశ సూక్ష్మదశ ప్రాణదశలు దెలుపబడును॥

### 76॥ సర్వగ్రహాణాం మహాదశాఫల నిర్ణయః॥

#### 1॥ సూర్య మహాదశా సం॥ 6-కి ఫలమ్॥

శ్లో॥ శిరోరోగం మనస్తాపం సంచారంచారి మండలే।
రాజవర్గేతు కలహ మకాలే భోజనం తథా।
శౌర్యం కోపం మనశ్చింతా మృత్యువార్తాది సంభవం।
ప్రవాసో జలదోషశ్చ ముఖరోగ విరోధకృత్॥
యుద్ధయాత్రానలప్రాప్తి రుదయే పంగుదర్శనం।
ఆయాసం కార్యవికలం రవౌమహ దశాధిపే॥

తా॥ ఈసూర్య మహాదశయందు॥ శిరోవ్యాధియు, మనస్తాపమును; సంచారము, రాజకలహము, అకాల భోజనము, శౌర్యము, కోపము, మనోవిచారము, మృతవార్తలు వినుట, శరీరాయాసము, జలభయము. ముఖరోగము, నేత్రవైకల్యము,ప్రయాణమునం దగ్నిభయము, కాళ్లులేనివాని దర్శనము, కార్యభంగంబును జేయుచున్నాడని తాత్పర్యము॥



#### 2॥ చంద్ర మహాదశా సం॥ 10-కి ఫలమ్॥

శ్లో॥ రాజ్ఞోదర్శన సంప్రాప్తం దర్శనం పుష్పవస్త్రయోః।
దేవబ్రాహ్మణ భక్తించ నారీవసన సంభవం।
శ్రవణం దూరవార్తాయా శ్శీతవస్తు సమాగమః।
హృదయే విష్ణుభక్తించ మిత్రదర్శన సంభవం।
దధ్యన్న సుఖభోజ్యాని చంద్రో మహాదశాధిపే॥

తా॥ ఈచంద్ర మహాదశయాందు॥ రాజదర్శనమును, మనోహరములగు పుష్పవస్త్రములను జూచుటయు, దేవబ్రాహ్మణుల యందు భక్తిగలుగుటయు, స్త్రీలును, వస్త్రములును సంప్రాప్తమౌటయు, దూరదేశములయొక్క వార్తలు వినుటయు, సీతల పదార్థములు లభించుటయు, విష్ణుభక్తియు, మిత్రదర్శన లాభమును, దధ్యన్నభోజనము, సుఖమును జేయుచున్నాడని తాత్పర్యము॥

#### 3॥ కుజ మహాదశా సం॥ 7-కి ఫలమ్॥

శ్లో॥ ధనేకాఠిన్య చింతాచ పాషాణ హృదయో భవేత్।
మనశ్చింతా మహాకోపో దూరవార్తాది సంభవః।
రాజభీతి శ్శత్రుభీతి ర్గమనో కలహాదికః।
రక్తస్య దర్శనంపాతా త్కలహో ధన నాశనః।
బ్రహ్మద్వేషం కార్యవిఘ్నం కుజౌమహాదశాధిపే॥

తా॥ ఈకుజ మహాదశ యందు॥ ధనమునందు కఠినత్వమును, కఠినమైన ఆలోచనయు, మనోవిచారము, అధికకోపము, దూరదేశపువార్తలు వినుటయు, రాజభయము, శత్రుభయము, ప్రయాణమున కలహము, రక్తదర్శనము, ధననష్టము, బ్రాహ్మణ విరోధము, కార్యవిఘ్నమును జేయుచున్నాడనుట॥

#### 4॥ రాహు మహాదశా సం॥ 18-కి ఫలమ్॥

శ్లో॥ రాహకా మహాదశాప్రాప్తే మ్లేచ్ఛమూల భయంభవేత్।
రుణబాధా శత్రుబాధా భోజనా రుచిసంభవః।
దుష్టబుద్ధి ర్దురాచారో సర్ప దర్శన సంభవః।
ఉదరె వాయుపీడాచ ఆగ్రహో జ్వరపీడనం॥

తా॥ యీ రాహు మహాదశయందు తురకలవలన భయము
ను, ఋణబాధయు, శత్రుబాధయు, భోజనము అరుచిగలుగుటయు,
దుష్టబుద్ధియు, సర్పభయమును, ఉదరమందు వాతబాధయు, ఆగ్ర
హంబును, గలుగుననుట॥

5॥ గురు మహాదశా సం॥ 16-కి ఫలమ్ ॥

శ్లో॥ వేదవిద్యా ప్రసంగస్స్యా ద్దేవ బ్రాహ్మణ భక్తితా।
మనసోత్సాహ కార్యశ్చ స్నాన వస్త్రాది భూషతా।
ధనశయ్యాది సంప్రాప్తి ర్గాళీపతన మేవచ।
గోశ్వ గజ సంప్రాప్తి స్సతతం ఋణ విమోచనం।
సుఖభోజన భూమ్యాది ర్గురౌ మహ దశాధిపే॥

తా॥ ఈ మహాదశయందు వేదవిద్యా సంభాషణయు, దేవ
బ్రాహ్మణులయందు భక్తియు, సువర్ణ వస్త్రభూషణములు ధరించు
టయు, సంతోషము, సుఖభోజనము, భూలాభము, అశ్వవాహనము
గోపశు ధనలాభంబులు గలుగుననుట॥

6॥ శని మహాదశా సం॥ 19-కి ఫలమ్॥

శ్లో॥ మృతవార్తా ప్రసంగంచ దేహజాడ్య మనోవ్యథా।
స్వజాతి కలహంచైవ హీనస్త్రీ సంగమం తథా।
ప్రాప్తకార్య వినాశశ్చ మనఃపీడాతి నిద్రతా।
మందబుద్ధిః కార్యహాని శ్శూద్రేణ కలహో భవేత్ ॥
మనశ్చింతా మహాత్కష్టం మానహాని ర్తథైవచ।
పశుపీడా భవేన్నిత్యం వాతరోగ మహద్భయం।
చోపవాసో రాజభీతి శ్శనైశ్చర దశాఫలం॥

తా॥ ఈ శనిమహాదశయందు మృతవార్తలు వినుటయు, దే
హజాడ్యంబును, మనోవ్యథయు, స్వజాతి కలహంబును, నీచస్త్రీతో
రమించుటయు, కార్యవిఘ్నము, అతినిద్రయు, మందబుద్ధి, శూద్రు
లతో కలహము, మానహాని, వాతరోగము, పశుపీడా, రాజభీతి,
ఉపవాసంబును గలుగునని తాత్పర్యము॥

7॥ బుధ మహాదశా సం॥ 17-కి ఫలమ్॥

శ్లో॥ బంధుదర్శన సంప్రాప్తి ర్విద్యాలాభో ధనాగమః।



సంభవేద్రాజ వార్తాచ శుభవార్తా ప్రవాసకః।
జ్ఞానసిద్ధి సూక్ష్మబుద్ధి ర్మంత్రసిద్ధి ర్మితాశనః।
గోష్ఠీజ్యోతిష విద్యాయాం బుధే మహ దశాధిపే॥

తా॥ ఈ బుధమహాదశయందు బంధుదర్శనము, విద్యాప్రా
ప్తియు, ధనలాభము, రాజవృత్తాంతములు వినుటయు, శుభవార్తా
శ్రవణమును, పరగృహవాసమును, బ్రహ్మజ్ఞానము, సూక్ష్మబుద్ధియు,
మంత్రోపదేశ ప్రాప్తియు, సమమగు భోజనముచేయుటయు; జ్యోతి
శ్శాస్త్రమునందు ప్రసంగమును గలుగజేయు చున్నాడనుట॥

8॥ కేతు మహాదశా సం॥ 7-కి ఫలమ్॥

శ్లో॥ భృత్యేషు కోపసంప్రాప్తి ర్విగ్రహశ్చ జనైస్సహ।
మనసోభీతి తాపాచ భాషణే దుష్టవాక్యతా।
పంగోధికారో భవతి విషభీతి స్తథైవచ।
స్వబంధు కలహోవైరం దుష్టస్త్రీ కలహాంతథా।
జాడ్యంచ ప్రభుసేవాచ శూద్రీసంయోగ దోషకృత్ ।
గమనం రాజభీతిశ్చ కేతౌ మహ దశాధిపే॥

తా॥ ఈ కేతుమహాదశయందు భృత్యులయందు కోపము
ను, ప్రతి మనుజునితో కలహమును, భయంబును, కవిత్వమును,
మనస్సునందు విచారమును, దుష్టవాక్యములు సంభాషించుటయు,
దేహజాడ్యంబును, ప్రభుసేవయు, రాజకలహమును, దుష్టస్త్రీలతో
విరోధము, సర్వభీతి, శూద్ర స్త్రీసంగమంబును గలుగుచున్నదనుట॥

9॥ శుక్ర మహాదశా సం॥ 20-కి ఫలమ్॥

శ్లో॥ తాంబూలం స్వర్ణలాభంచ వస్త్రలాభం కరోతిచ।
సుగంధ కుసుమంప్రాప్తిం రాజద్వారే స్వతంత్రకం।
సౌఖ్యాం స్త్రీసంగమంప్రీతిం సుఖభోజన సంభవం।
ఇక్షుక్షీర ఫలప్రాప్తి ర్ధనగో లాభమేవచ।
మణిమౌక్తిక లాభంచ హీరస్త్రీ సంగమంతథా।
లక్ష్మీవాసం మహాభోగం శుక్రే మహ దశాధిపే॥

తా॥ ఈ శుక్రమహాదశయందు తాంబూలసుఖ శయ్యాది సౌ
ఖ్యమును, సువర్ణలాభము, వస్త్రలాభము, సుగంధ పుష్పాద్యలంకా

రమును, రాజసన్నిధియందు స్వతంత్రమును, స్త్రీసంగమునందు ప్రీతియు, సుఖభోజనము, చెరకుపానకము, పాలు, గోవులు, మణులు, ముత్యములు, లభించుటయు, సువర్ణకాంతిగల సుందరీమణులతో క్రీడించుటయు, లక్ష్మీపూజయు, విశేషభోగమును, ఇచ్చుచున్నాడనుట॥

నవగ్రహములకు అంతరంబులు చేయు క్రమము యీ దిగువను వ్రాయుచున్నాడు॥

## 77॥ అంతర్దశా నిర్ణయః॥

శ్లో॥ స్వదశా త్రిగుణీకృత్య తద్దశా సుహతంపునః ।
భాగ్నినా విభజేన్మాసం శేషస్తు దివసాదయః॥

తా॥ దశను దశచే గుణించి 10 చే భాగించగా లబ్ధము మాసములగును, శేషమును 3 చే గుణించిన దినములగును॥

ఉదాహరణము॥

గురుమహాదశా సం॥ 16
16
96
16
10)256(25
20
56
50
6
త్రిగుణితం 3
దినములు 18

గురు మహాదశలో గుర్వంతర్దశామా 25 ది 18॥

ఈ ప్రకారము అన్ని గ్రహములకును వారివారి దశాసంవత్సరములచే, పూర్వోక్త ప్రకారము అంతరంబులు సాధించవలెను॥

గురుదశలో గుర్వంతరమా 25 18 దినములు॥

ఈ అంతర్దశలకు విదశా, సూక్ష్మదశలను కనుగొను విధము॥ అంతర్దశామాసములను 30 చే గుణించి పై దినములు చేర్చగా అన్నియు దినములగును, యీ దినములను; ఆ యంతర్దశా నాథుని మహాదశా సంవత్సరములచే గుణించి 120 దింట పాలుగొనగా లబ్ధము రోజులగును, శేషమును 60 చే గుణించి, మరల భాగించగా ఘడియలగును, దీనినే విదశ యందురు. సూక్ష్మదశా ప్రాణదశలు యీప్రకారమే సాధించవలయును॥



విదశ కుదాహరణము.

గురుదశలో గుర్వంతరం॥ మా॥ ది॥
25—18
గుణకారము 30
750
దినములుచేర్చగా 18
దినములు 768
గురుదశా సం॥ 16
4608
768
120)12288(102
120
288
240
48
60
120)2880(24
240
480
480

గుర్వంతరములో గురు విదశా దినములు 102 ఘడియలు 24 సర్వగ్రహంబులకు యీ విధముగానే సాధించవలెను. సూక్ష్మదశను కూడా చూపుచున్నాడు. పై దినములను 30 చే భాగించగా నెలలు 3, ది 12, ఘ 24.

సూక్ష్మదశ కుదాహరణము॥

గుర్వంతరములో ది॥ ఘ॥
గురువిదశా 102—24
గుణకారము 60
6120
చేర్చినఘడియలు 24
ఘడియలు 6144
గురుదశా సం॥ 16
36864
6144
120)98304( 819
960 | 60)780(13
230 | 39 ఘ
120
1104
1080
24
60
1440(12
120
240
240

గురు విదశలో గురుసూక్ష్మదశ ఘడియలను 60 చే భాగించగా ది 13, ఘ 39, వి 12 లు యీ ప్రకారము సాధించగా ప్రాణదశ ది 1, ఘ 49, వి 12 ఘటికలు వచ్చినది॥

## 78॥ మనుష్యగజాదుల ఆయుఃప్రమాణము॥

| | |
|---|---|
| మనుష్యులకు, ఆయుఃప్రమాణసంవత్సరములు. | ౧౨౦ |
| ఏనుగులకు మనుష్యులకెట్లో అట్లే సంవత్సరములు. | ౧౨౦ |

గుఱ్ఱములకు, పరమాయుః సంవత్సరములు. ౩౨
గాడిదెలకు, ఒంటెలకు, పరమాయుః సంవత్సరములు. ౨౫
గోవులకు, ఎనుబోతులకు, ఆయుః సంవత్సరములు. ౨౪
కుక్కలకు, పులులకు, పిల్లులకు, ఆయుః సంవత్సరములు. ౧౨
మేక, కురుబోతు మొదలగువానికి ఆయుఃసంవత్సరములు. ౧౬
యీప్రకారము, పరమాయువు లగు ననుట.

ఇక్కడ అశ్వాదుల పరమాయువును, జెప్పునపుడు అశ్వాదుల జన్మకాలమును బట్టి, ఆయుఃప్రమాణము నిర్ణయము చేయవలయును, అదెట్లనిన ॥

గ్రహ పరమాయువును, అశ్వాదుల పరమాయువుచే గుణించి, మనుష్యపరమాయువుచే పాలుగొనిన, అశ్వాదులవిషయమై, ఆయా గ్రహంబు లిచ్చెడు, పరమాయువు తెలియును ॥

ఉదాహరణము॥

రవి పరమాయుర్వర్షంబులగు 19 చేత, అశ్వపరమాయు సంఖ్యయైన, 32 చే గుణించగా, 608 వచ్చును, దీనిని మనుష్యపరమాయువగు 120 చే పాలుగొనగా లబ్ధము, సం॥ 5, మా॥ 0, ది॥ 24, వచ్చును. ఈ ప్రకారమే, తక్కిన గ్రహములకుగూడ చూడవలయును, ఇది అశ్వవిషయమై, పరమోచ్చగతులగు, రవ్యాదులిచ్చెడు, నాయుర్దాయము, ఈ ప్రకారముగానే, గాడిదులకును, ఒంటెలకును, శునక మార్జాల, వ్యాఘ్ర, గోమహిషాదులకును, తెలుసుకొనవలయును, పూర్వోక్తప్రకారము, హరణశోధనముగూడ, చేసి శుద్ధాయుర్దాయమును కనిపెట్టవలయును, యీ విషయమై యింకను, జాతకప్రకరణములో విమర్శగా చెప్పబడును॥

79॥ కేంద్రాది సంజ్ఞలు॥

౧-౪-౭-౧౦ స్థానములు, కేంద్రములనియు, కంటకములనియు, చతుష్టయమనియు, మూడుసంజ్ఞలు గలవు.



౫-౯-కోణ స్థానములు, కేంద్రమునకంటె, పరంబుననున్నరాశి, పణఫరమనంబడును, ఆ పణఫరంబునకు మీదట రాశి, ఆపోక్లీమమనంబడును, సమస్తమైన కేంద్రములకు ఈప్రకారంబుననే నెరుంగవలయును, అనగా, ౨-౫-౮-౧౧- ఈస్థానములకు పణఫరములనియు, ౩-౬-౯-౧౨ వీటికి ఆపోక్లీమములనియు చెప్పబడియున్నది, విషయము జాతకభావయందు స్పష్టము కాగలదు॥

౮౦॥ మాసదశా ప్రకరణము॥

జన్మనక్షత్రము మొదలుకొని, సూర్యుడు సంచరించేనక్షత్రము వరకు లెక్కించి యాసంఖ్యను 7 చే గుణించి 9 చే భాగింపగా మిగిలిన సంఖ్యవలన॥

సూర్య, బుధ, రాహు, గురు, కేతు, చంద్ర, శని, శుక్ర, కుజులును క్రమమున నీగ్రహములలో, నేగ్రహము ముందుగావచ్చుచున్నదో యాగ్రహము, ప్రథమదశాధిపతిగా నొకరితరువాత నొకరు, పైనిచెప్పిన గ్రహక్రమమున, నన్నిగ్రహములు, నామాసమందు, మాసదశాధిపతు లగుచున్నారు, అనగా, సౌరమాసాధిపతులనుట॥

సంక్రమణపు దినములగాయుతు, తిరిగి సంక్రమణమయ్యే దినమువరకు, లెక్కించగా నైనదినములను, పూర్వము చెప్పబడిన, ఆ యాగ్రహములయొక్క మహాదశాసంవత్సరములచే, గుణించి, 120 చే భాగించగా దినములగును, శేష మరఘుడియలగును, ఈప్రకారము, అన్నిగ్రహములకు మాసదశ లేర్పడుననుట॥

ఉదాహరణము॥

దుర్మతిసంవత్సరాషాఢ శ్రావణ మాసములలో కర్కాటకమాసము ౩౦ దినములౌటవలన, ఈ ౩౦ దినములను, సూర్యునియొక్క మహాదశాసంవత్సరములు, 6 చే గుణించినది 180 దీనిని నవగ్రహదశా ప్రమాణములగు 120 చే భాగించగా లబ్ధము 1 టి, శేషము 60 ఈ శేషమును 60చే గుణించినది, 3600 వందలు దీనిని మరల 120 చే భాగించగా లబ్ధము 30 యి విఘడియలు, యీప్రకారము అన్ని గ్రహములకు చేయగా॥

| | |
|---|---|
| రవికి ది 1 30 ఘడియలు | చంద్రునికి ది 2 30 ఘడియలు |
| బుధునికి ది 4 15 ఘడియలు | శనికి ది 4 45 ఘడియలు |
| రాహువుకు ది 4 30 ఘడియలు | శుక్రునికి ది 5 0 ము |
| గురునికి ది 4 0 లు | కుజునకు ది 1 45 ఘడియలు |
| కేతువకు ది 1 45 ఘడియలు | |

ఈప్రకారము వచ్చినందున, యీదిగువను ఫలములు దెలుపబడును.

| | |
|---|---|
| 1 | సూర్యుడు, మాసాధిపతి యగుచుండగా, ప్రవాస, జలదోష, శ్రృంగారంబులు గల్గును. |
| 2 | బుధుడు॥ బంధులాభ, భోజనప్రయ, రాజపూజ్య, వస్త్రలాభంబులు గలుగును. |
| 3 | రాహువు॥ ఉదరపీడ, వాయుపీడ, ఆగ్రహం, జ్వరపీడ, క్రోదర్ధప్రాప్తి. |
| 4 | గురుడు॥ గురుభక్తి, ధనశయ్యాదిప్రాప్తి, విద్యాగోష్టి ఋణవిమోచనం. |
| 5 | కేతు॥ పాషండహృదయం, కవిత్వ, బుద్ధి, బంధుకోపము, శూద్ర స్త్రీ సంగమం. |
| 6 | చంద్రుడు॥ ధధ్యన్నభోజనము, ధనలాభము, దృష్టిదోష ప్రవర్తనం. |
| 7 | శని॥ వాయుపీడా, చోరభీతి, రాజభీతి, పశుభీతి, మృగభయం. |
| 8 | శుక్రుడు॥ స్త్రీసౌఖ్యం, వస్త్రలాభం, సుగంధ కుసుమాగమం, లక్ష్మీవిభవం. |
| 9 | కుజుడు॥ రక్తదర్శనం, కార్యవిఘ్నం, మనస్థాపం, ధననష్టంబులు గల్గును. |

## 81॥ నిత్యగ్రహఫలమ్॥

ఏరోజున నిత్యగ్రహములను జూడ దలంచుచున్నారో యారోజు తిథివారసంఖ్యలనగా, శుక్లప్రతిపదాదిగా నారోజు తిథివరకు



నాదివారాదిగ నారోజు వారమునకు, లెక్కించిన తిథివార సంఖ్యలను, జన్మనక్షత్రముమొదలు నారోజు నక్షత్రమువరకు లెక్కించిన సంఖ్యను, నాలుగుచే గుణించిన సంఖ్యలో, పై తిథివారసంఖ్యలను కలియగూడి 9 చే భాగించగా మిగిలినసంఖ్యలు, సూర్యుడు మొదలుగా నిత్యగ్రహము లగుచున్నారు. అనగా రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహు, కేతు ఈ క్రమముగా వచ్చుచున్నారు.

| | | | |
|---|---|---|---|
| 1 | సూర్యుడు, దుఃఖము | 6 | శుక్రుడు, స్త్రీలాభము |
| 2 | చంద్రుడు, క్షేమము | 7 | శని, కార్యనాశనము |
| 3 | కుజుడు, మృతప్రాయము | 8 | రాహు, శతృభయము |
| 4 | బుధుడు, శుభము | 9 | కేతువు, మరణప్రాయము |
| 5 | గురుడు, ధనము | | |

ఈ ప్రకారము లాయాఫలముల నిచ్చుచున్నారు॥

## 82॥ నిత్య దశలు॥

శ్లో॥ జన్మనక్షత్ర మారభ్య నిత్యభాతం ప్రగణ్యతే ।
మునిసంఖ్యై ర్గుణిత్వాథ నవసంఖ్యే నభాజితం ।
శేషైర్నిత్య దశాప్రోక్తా రవ్యాదీనాం యథాక్రమం ॥

తా॥ జన్మనక్షత్రము మొదలుకొని నిత్యనక్షత్రమువరకు లెక్కించిన సంఖ్యను, 7 చే గుణించి 9 జే భాగించగా మిగిలిన సంఖ్యలచే, రవ్యాదిగ్రహ క్రమమున నిత్య దశాధిపతు లగుచున్నారు॥

ఉదాహరణమ్॥

జన్మనక్షత్రము మృగశిర్ష, నిత్యనక్షత్రము మఖ, మృగశిర్షమొదలు మఖవరకు, లెక్కించినది. 6 దీనిని పైప్రకారము భాగించుటకు హారకము పోనందున, దీనినే శేషముగా నుంచుకొని సూర్యుని మొదలు లెక్కించగా ఆరవదశ శుక్రుడౌటవలన, శుక్రుని మొదలు నిత్య దశాధిపతు లగుచున్నారు గాన పూర్వప్రకారము, శుభ పాపగ్రహముల ఫలములు నిర్దేశింపవలయును.

| | | | |
|---|---|---|---|
| 1 | రవి శిరోభారము త్రిప్పుట | 6 | శుక్రుడు స్వతంత్రస్త్రీలాభశుభం |
| 2 | చంద్రుడు రాజదర్శనం భూషణం | 7 | శని కార్యహాని శరీరపీడ ధనహాని |
| 3 | కుజుడు మనశ్చింతా కోపము | 8 | రాహు సర్వభీతి శత్రుభయం |
| 4 | బుధుడుబంధుదర్శన ద్రవ్యలాభం | 9 | కేతు మహోభీతి రాజభీతిగమనం |
| 5 | గురుడువిద్యాప్రసంగంధనలాభం | | |

యీ ప్రకారము ఫలములనిచ్చుచున్నారు॥

83॥ మాసాధిపతి నిర్ణయః॥

శ్లో॥ జన్మనక్షత్ర మారభ్య మాసభాంతం ప్రగణ్యతే।
గుణిత్వా సప్తభిశ్శేషం విధిసంఖ్యా హారేణచ।
రవిస్సౌమ్యో ఫణిర్జీవః కేతుశ్చంద్రో శనిర్భృగుః।
భూమిపుత్రేతి నవచ మాసాధి పతయఃక్రమాత్॥

తా॥ జన్మనక్షత్రము మొదలుకొని, శుక్ల ప్రతిపదాది నక్షత్రమువరకు, లెక్కించిన సంఖ్య 7 చే గుణించి 9 చే హరించగా॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | రవియు | 4 | బృహస్పతి | 7 | శనియు |
| 2 | బుధుడు | 5 | కేతువు | 8 | శుక్రుడు |
| 3 | రాహు | 6 | చంద్రుడు | 9 | కుజుడు |

ఈక్రమంబున తొమ్మండ్రుడు మాసాదిపతు లగుచున్నారనుట.

మాసాధిపతే స్సూర్యస్యఫలమ్॥

1 శ్లో॥ తాపంచ గమనంశోకం శిరోరోగం భయంతథా।
నృపభీతించ కురుతే రవిర్మాసాధిప స్తథా॥

తా॥ సూర్యుడు మాసాధిపతి యగునేని, శరీరతాపము, ప్రయాణము, దుఃఖము, శిరోవ్యాధి, రాజభయమున్ను, గలుగుచున్నవనుట॥

మాసాధిపతే ర్బుధస్యఫలమ్॥

2 శ్లో॥ భవంతి బంధుసంగశ్చ విష్ణుభక్తిశ్చ చింతనం।
విద్వత్సం గార్థలాభౌచ సౌమ్యే మాసాధిపేసతి॥



తా॥ బుధుడు మాసాధిపతి యగునపుడు బంధు సమాగమము, విష్ణుభక్తి, విష్ణుచింతనము, విద్వాంసులతో సహవాసము, ధనలాభమున్ను యిచ్చుచున్నాడు॥

మాసాధిపతే, రాహుఃఫలం॥

3 శ్లో॥ వేదనా చోదరేనాభ్యాం క్రోధశ్చ ధననాశనః।
ఉపవాసశ్చ గమనం మాసే భవతి నిశ్చయం।
చోరభీతి మహాధ్వానే రాహౌ మాసాధిపేసతి॥

తా॥ రాహు మాసాధిపతియగునేని గర్భమందు, నాభియందు, శూలయు, క్రోధము, ధననష్టము, ఉపవాసము, గమనము, మార్గమందు, చోరభీతియు గలుగజేయును॥

మాసాధిపతేః గ్గురోఃఫలం॥

4 శ్లో॥ ధనలాభం గురాభక్తిం స్వస్త్రీభూషణలాభతాం।
జ్ఞానంసౌఖ్య మవాప్నోతి గురౌమాసాధిపే సతి॥

తా॥ గురుడు మాసాధిపతి యగునేని, ధనలాభము, గురుభక్తి, తమభార్యా కలంకారప్రాప్తి, జ్ఞానము, సౌఖ్యమును, పొందుచున్నారనుట॥

మాసాధిపతేః కేతోఃఫలమ్॥

5 శ్లో॥ పంగోధి కారోభవతి విషభీతి స్తథైవచ।
స్వబంధు కలహావైరం యుద్ధభీతి స్తథైవచ।
దుష్టస్త్రీ కలహంచైవ కేతౌ మాసాధిపేసతి॥

తా॥ మాసాధిపతియగు కేతువు స్వల్పాధికారము, సర్వభయము, బంధు కలహము, విరోధము, కలహభయము, దుష్టస్త్రీకలహమున్ను, గలుగ జేయుననుట॥

మాసాధిపతేః చంద్రస్యఫలమ్॥

6 శ్లో॥ దధ్యన్న భోజనంసౌఖ్యం సంభోగంప్రీతిసౌఖ్యదం।
ధనలాభం మనోల్లాసం చంద్రోమాసాధిప స్తథా॥

తా॥ చంద్రుడు మాసాధిపతియగు నపుడు, దధియుక్తభోజన సౌఖ్యమును, స్త్రీసంభోగము, సంతోషము, సౌఖ్యము, ధనలాభము, నిర్మల మనస్సును, ఇచ్చుననుట॥

మాసాధిపతేః శనేఃఫలమ్॥

7 శ్లో॥ వేదనా జఠరేనాభ్యాం మాగ్రహాం పరపీడనం।
నీలవస్త్రేభభీతిశ్చ శనిర్మాసాధిపేస్తథా॥

తా॥ శని మాసాధిపతి యగునేని, నాభియందు, జఠరమందు, శూలయు, కోపము, పరజనులను బాధించుటయు, నలుపువస్త్రము, ఏనుగువల్ల భయమును జేయుచున్నాడు॥

మాసాధిపతేః శుక్రస్య ఫలం॥

8 శ్లో॥ స్త్రీసౌఖ్యం ధనలాభంచ శయ్యాసౌఖ్యేనసంయుతం।
లేపనం గంధపుష్పాద్యైర్ధనగోలాభమేవచ।
ఇక్షుక్షీర ఫలప్రాప్తి శుక్రో మాసాధిపస్తథా॥

తా॥ శుక్రుడు మాసాధిపతి యగునేని, స్త్రీసౌఖ్యము, ధన లాభము, శయ్యా సుఖము, గంధాది లేపనము, పుష్పాలంకరణము, ధనపశులాభము చెరుకుపానకము, మొదలగుఫలములు నిచ్చుననుట॥

9 శ్లో॥ రక్తస్య దర్శనంచైవ నృపశస్త్ర భయావహం।
కార్యవిఘ్నం మనస్తాపం కుజో మాసాధిప స్తథా॥

తా॥ కుజుడు మాసాధిపతి యగునేని, రక్తముజూచుట, రాజభయము, శస్త్రభయము, కార్యవిఘ్నము, విచారమును, జేయుచున్నాడనుట॥

ఉదాహరణము॥

దుర్మతి సంవత్సరాషాఢ శుక్ల ౧ బుధవారము, పునర్వసు నక్షత్రము, గనుక, రోహిణీ నక్షత్రజాతకునకు, మాసఫలము చూడవలయునుగాన, రోహిణి నక్షత్రము మొదలు, పునర్వసూ నక్షత్రము వరకు లెక్కించిన సంఖ్య 4 ఈసంఖ్యను 7 చే గుణించగా వచ్చిన మొత్తము 28 దీనిని, 9 చే భాగించగా మిగిలిన శేషము 1 గాన, ఈనెలయందు యీజాతకునకు, సూర్యుడు మాసాధిపతియైనందున పూర్వోక్తప్రకారము ఫలమును జెప్పవలయును॥



గద్య.— స్వస్తి. శ్రీమత్సకల జగత్కారణ శ్రీసదాశివ, కూర్చ
నయనా విఖ్యాత చౌడాంబానుగ్రహ సమాసాదిత, పంచవర్ణతం
తు బ్రహ్మవిష్ణు మహేశ్వరాది, దేవాసుర, వసనోపవీత దాన
సంలబ్ధ, నందిధ్వజాది ద్వాత్రింశ ద్బిరుదాంకిత మహా
యశ స్సప్తావతార విరాజిత, శ్రీదేవలవంశ సంజాత.
శ్రీమత్పుత్సల - వంశ పయః పారావార రాకా
సుధాకర, కశ్యపాన్వయపవిత్ర గంగయాఖ్యస్య.
జ్యేష్ఠపుత్రేణ వీరభద్రసిద్ధాంతినా విరచిత
మిదం ఆంధ్రతాత్పర్యోదహరణ సహిత
శ్రీదైవజ్ఞశిఖామణిర్నామకోయం
గ్రంథరత్నే తృతీయకాండ
స్సమాప్తః.





శ్రీ రస్తు.

శ్రీ బాలాపరమేశ్వరీ దేవ్యైనమః.

# దైవజ్ఞశిఖామణి.

## చతుర్థకాండః.

### 84॥ గోచారభావము ॥

శ్లో॥ లక్ష్మీవాస గృహస్యయః ప్రతిదినం పద్మస్య సౌభాగ్యదః।
యచ్చారేణ కలాదిభోగ కలనః కాలస్తు సంజాయతే।
యచ్చతుర్థగతాను మంద ఫలదం సాక్షీచయః కర్మణాం।
తంవందే శ్రుతిసుందరం ప్రణమతామోజస్కరం భాస్కరం॥

ఒక్కొకరాశియందు నవగ్రహములుండెడి కాలప్రమాణము॥

శ్లో॥ బుధశుక్ర రవిర్మాసం మాసం మాసార్ధతఃకుజః।
గురుర్ద్వాదశ మాసస్తు త్రింశర్మాసః శనైశ్వరః।
రాహూరష్ట దశంచైవ కేతోరష్ట దశాంస్మృతః॥

తా॥ చంద్రుడు, రెండుదినములు పదియేను ఘడియలును॥ రవి, బుధ, శుక్రులు ముప్పది దినములును ॥

అంగారకుడు, ఒకనెల పదియేను దినములును॥ బృహస్పతి, పదిరెండు మాసములును॥ శని, ముప్పది మాసములును॥

రాహు కేతువులు, పదునెనిమిది మాసములును॥ ఒక్కొక రాశియందు గ్రహములు సంచారము చేయుచుందురనుట॥

ఈ నవగ్రహములలో రాహుకేతువులు ఛాయాగ్రహములగుటచే॥

శ్లో॥ యద్యద్భావ గతావాపి, యద్యద్భావేశ సంయుతౌ।
తత్తత్ఫలాని ప్రబలౌ ప్రతిశేతాం తమోగ్రహా

తా॥ రాహు కేతువులు తాము ప్రవేశించిన రాసులయొక్క అధిపతులు ఇచ్చునట్టి ఫలము ఇత్తురు, తక్కిన సూర్యాది సప్తగ్రహ



ములు,ఆయారాసులయందు, ప్రవేశించిరేని నరునికి వారివలనగలిగెడు ఫలములు ఈక్రింద దెల్పఁబడుచున్నవి, దీనికే గోచారఫలమని పేరు॥

ఇది వారివారి జన్మనక్షత్రము మొదలుకొని సిద్ధించిన రాసుల ప్రకారముగా చూచుకొనవలయును, లేక నామనక్షత్రము మొదలుకొని సిద్ధించిన రాసులప్రకారముగాను చూచుకొననగును॥

### 85॥ జన్మనక్షత్రముతో కూడిన వారములు 7-కి ఫలమ్॥

శ్లో॥ జన్మర్క్షం రవి వాసరాదిసహితే నోక్తంచ యద్యత్ఫలం।
తన్మాసే భవతీతి యోజ్య మితి విద్వద్భిస్సదా జల్పితం।
పంథానం రవివాసరే విధుదినే సంభోగ వేణీ దృశాం।
మృత్యుంభూమి సుతేధనం శశిసుతే జీవే సదర్ధాగమం।
ఇష్టాన్నం భృగువాసరేణ సహితం మందే మహారోగతాం॥

తా॥ జన్మనక్షత్రము ఆదివారముతో గూడెనేని ప్రయాణమనియు, సోమవారముతో గూడెనేని స్త్రీసంభోగమనియు, మంగళవారముతో గూడెనేని మరణమనియు, బుధవారముతో గూడెనేని ధనలాభమనియు, గురువారముతో గూడెనేసి సద్ధనలాభమనియు, శుక్రవారముతో గూడెనేని, స్వేచ్ఛా భోజనమనియు, శనివారముతో గూడెనేని విశేష రోగమనియు, నీప్రకారము జన్మనక్షత్ర మేవారముతో గూడియుండిన నేమిఫలము జెప్పబడియున్నదో నాఫలమా మాసమం దగునని విద్వాంసులచే జెప్పఁబడెననుట॥

### 86॥ సర్వగ్రహాణాం చారరీత్యా శుభస్థానాని॥

1. సూర్యుడు॥ జన్మరాశిమొదలుకొని. ౩-౬,౧౦-౧౧, ఈ స్థానములయందును,
2. చంద్రుడు॥ ౧-౩-౬-౭-౧౦-౧౧, ఈ స్థానములయందును,
3. బుధుడు॥ ౨-౪-౬-౧౧, ఈ స్థానములయందును,
4. బృహస్పతి॥ ౨-౫-౭-౯-౧౧, ఈ స్థానములయందును,
5. శుక్రుడు॥ ౧-౨-౪-౫-౮-౯-౧౧, ఈ స్థానములయందును,

6. కుజ, శని, రాహు, కేతువులు॥౩-౬-౧౧, ఈ స్థానముల యందును, శుభులు, ఈప్రకారము శుభస్థానముల యందుండిన అన్ని గ్రహములు పార్శ్వగ్రహ వేధారహితులును, సువర్ణ రజత మూర్తులు నగుచుండి రేని పైని జెప్పబడిన స్థానములయందు శుభు లగుదురు. పై స్థానములయం దున్నవారై నప్పటికి పార్శ్వగ్రహ వేధలతో గూడి, తామ్ర లోహమూర్తులుగా నుండి రేని యశుభకరు లగుదురనుట॥

ప్రత్యేక గోచారఫలంబులు, మూర్తినిర్ణయ, గ్రహ వేధానంతము వ్రాయుచున్నాము॥

పైని జెప్పబడిన స్థానములుగాక, తదితర స్థానములయం దుండునపుడును, పార్శ్వగ్రహ వేధ, తామ్రలోహమూర్తులుగా నుండునపుడును, గలిగెడు యశుభఫలములకు, గ్రహములకు జప సంఖ్యయు, స్తోత్ర శ్లోకములును, యీ దిగువను వ్రాయుచున్నాము॥

87॥ నవగ్రహ జప సంఖ్యాది విషయః॥

శ్లో॥ అయుతంచ సహస్రంచ మష్టశతం ద్విసహస్రకం।
చతుఃపంచ సహస్రేణ త్రిశతం దినసిర్ణయః॥

| | | |
|---|---|---|
| 1 | సూర్యునకు | ౧౦,౦౦౦ వేలు, |
| 2 | చంద్రునకు | ౧౦౦౦ యి, |
| 3 | కుజునకు | ౮౦౦ వందలు, |
| 4 | బుధునకు | ౨, ౦౦౦ వేలు, |
| 5 | గురునకు | ౪, ౦౦౦ వేలు, |
| 6 | శుక్రునకు | ౫, ౦౦౦ వేలు. |
| 7 | శనికి | 3౦౦ వందలు, |

ఈ ప్రకారము దినము ౧-కి, జపసంఖ్య. ౪౧ దినములు గాని, ౨౦ దినములుగాని, యథాశక్తి గ్రహ జపము చేయించవలెను, పిమ్మట ఆ జపసంఖ్యలో ౧౦ దవ యంశము తర్పణము, ఆ సంఖ్యలో దశాంశము హోమము, ఆ సంఖ్యలో, దశాంశము మహేశ్వరారాధనయు చేయవలయును॥

శ్లో॥ గ్రహాణాం నవధాన్యాని సద్బ్రాహ్మణాయ నివేదనం।
గ్రహదోషం నివార్త్యాసు గార్గేయ వచనంతథా॥



తా॥ గార్గ్యాదుల వచనప్రకారము, గ్రహదోష నివర్తికొఱకు ఆయా గ్రహములకు యీ దిగువ చక్రమునందు నిర్ణయింప బడిన ప్రకారము నవధాన్యములు దానము లివ్వవలయు ననుట॥

శ్లో॥ అరిష్టకాలే చారిష్టగ్రహమంత్రం జపేత్సుధీః।
మహాసార విధానేన మండలం బ్రాహ్మణేనచ।
అరుణోక్త ప్రకారేణ చార్కమారాధయేత్సుధీః।
పూర్వజన్మ కృతంపాపం వ్యాధిరూపేణ బాధతే।
తచ్ఛాంతి రౌషధైర్దానై ర్జప హోమార్చనాదిభిః॥

కొన్నిగ్రంథములయందు గ్రహములకు జపసంఖ్యాది విషయమై ఆయాగ్రహములకు నిర్ణయింపఁబడిన మహాదశా సంవత్సరముల సంఖ్యకు సమానముగా జపము జేయవలయుననిరి. అదియెట్లన్నను,

| సంఖ్య | గ్రహములు | జపసంఖ్య | వారములు | దానములు |
|---|---|---|---|---|
| 1 | సూర్యునికి | ౬,౦౦౦ వేలు, | ఆదివారము | గోధుమలు |
| 2 | చంద్రునకు | ౧౦,౦౦౦ వేలు, | సోమవారము | బియ్యము |
| 3 | అంగారకునకు | ౭,౦౦౦ వేలు, | మంగళవారము | కందులు |
| 4 | బుధునికి | ౧౭,౦౦౦ వేలు, | బుధవారము | పెసలు |
| 5 | బృహస్పతికి | ౧౬,౦౦౦ వేలు, | గురువారము | శెనగలు |
| 6 | శుక్రునకు | ౨౦,౦౦౦ వేలు, | శుక్రవారము | బొబ్బరలు |
| 7 | శనైశ్చరునకు | ౧౯,౦౦౦ వేలు, | శనివారము | నువ్వులు |
| 8 | రాహువునకు | ౧౮,౦౦౦ వేలు, | మంగళవారము | మినుములు |
| 9 | కేతువునకు | ౭,౦౦౦ వేలు, | మంగళవారము | ఉలవలు |

88॥ మూర్తి నిర్ణయః॥

మూ॥ జన్మర్క్ష రాశేశ్చ గ్రహప్రవేశ కాలోడురాశో యదిచారజంచ।
రుద్రేరసే జన్మని హేమమూర్తి శ్శుభంకరాజేషు సురాజితశ్చ।
సచ్చాది దిగ్వహ్ని షుతామ్ర మూర్తిః కష్టం గజార్కాబ్ధిషు లోహికశ్చ॥

తా॥ గ్రహము ప్రవేశించే కాలము నందుండు, నక్షత్రరాశి, జన్మ నక్షత్రరాశికి॥

౧-౬-౧౧ ఈరాసులలో నొకరాశియైనయడల, సువర్ణ మూర్తిన్ని॥

౨-౫-౯ ఈరాసులలో నొకరాశియైనయడల, రజతమూర్తిన్నియై చారరీత్యాదుస్థానములయం దున్నవాడైననూ, శుభఫలములనే నిచ్చును॥

౩-౭-౧౦ ఈరాసులలో నొకరాశియైన యడల, తామ్రమూర్తిన్ని॥

౪-౮-౧౨ ఈరాసులలో నొకరాశియైనయడల, లోహమూర్తిన్నియై చారరీత్యా శుభస్థానములయం దుండిననూ కష్టములనే నిచ్చుననుట॥

శ్లో॥ జన్మే-౧-రసే-౬-రుద్ర-౧౧-సువర్ణమూర్తిః।
ద్వి-౨-పంచ-౫-నంద-౯-రజతాఖ్యమూర్తిః॥
త్రి-౩-సప్త-౭-రాజ్యం-౧౦-ఇతితామ్రమూర్తిః।
గజా-౮-బ్ధి-౪-౧౨-వేదా-ఇతిలోహపాత్రః॥

ఇతి పూర్వశ్లోకార్థమే గనుక వ్రాయలేదు.

ఉదాహరణము॥

దుర్మతిసంవత్సరాషాఢ బ ౧౦ శనివారము, సూర్యోదయాది ౩౨, ౩౫, ఘడియలకు, శని, సింహరాశినుండి, కన్యారాశిలో, ప్రవేశించేకాలమునకు, రోహిణీ నక్షత్ర వృషభరాశి అయినది, పూర్వము కనుపరచిన, పుష్యమీనక్షత్ర జాతకునికి, కర్కాటకరాశి, ఈరాశి మొదలు, ప్రవేశకాల వృషభరాశివరకు లెక్కించినది. ౧౧ గాన సువర్ణ మూర్తియైనందున, శుభఫలము నిచ్చునని చెప్పవలయును॥



పైనిచెప్పినప్రకారము, ద్వాదశరాసులకు, మూర్తులు, సులభముగా తెలియుటకై గణనచే నేర్పరచిన చక్రము.

| జన్మ రాసులు | మే | వృష | మి | కర్కి | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మే | సువ | రజి | తా | లో | రజి | సువ | తా | లో | రజి | తా | సువ | లో |
| వృష | లో | సువ | రజి | తా | లో | రజి | సువ | తా | లో | రజి | తా | సువ |
| మిథు | సువ | లో | సువ | రజి | తా | లో | రజి | సువ | తా | లో | రజి | తా |
| కర్కి | తా | సువ | లో | సువ | రజి | తా | లో | రజి | సువ | తా | లో | రజి |
| సింహ | రజి | తా | సువ | లో | సువ | రజి | తా | లో | రజి | సువ | తా | లో |
| కన్య | లో | రజి | తా | సువ | లో | సువ | రజి | తా | లో | రజి | సువ | తా |
| తుల | తా | లో | రజి | తా | సువ | లో | సువ | రజి | తా | లో | రజి | సువ |
| వృశ్చి | సువ | తా | లో | రజి | తా | సువ | లో | సువ | రజి | తా | లో | రజి |
| ధ | రజి | సువ | తా | లో | రజి | తా | సువ | లో | సువ | రజి | తా | లో |
| మ | లో | రజి | సువ | తా | లో | రజి | తా | సువ | లో | సువ | రజి | తా |
| కుం | తా | లో | రజి | సువ | తా | లో | రజి | తా | సువ | లో | సువ | రజి |
| మీ | రజి | తా | లో | రజి | సువ | తా | లో | రజి | తా | సువ | లో | సువ |

89॥ చారగ్రహాణాంగ్రహవేధానిర్ణయః॥

చారవశంబున జన్మాది ద్వాదశస్థానములయం దుండునపుడు గ్రహములకు కలిగియుండెడి గ్రహవేధలను చెప్పుచున్నాడు॥

చారవశంబున నే గ్రహ మేరాశియందుండునో ఆగ్రహము కారాశిస్వస్థానమనంబడును యెట్లనగా॥

(1) సూర్యుడు॥ తానున్నరాశికి-౪-౫-౯-౧౨ ఈస్థానముల యందు శనియుక్తగ్రహములు, వేధాగ్రహములగుటవలన-శని యుక్తములుగాని గ్రహములుండినను కేవల శనియుండినను యేగ్రహములేకుండినను శుభుడగుననుట॥

(2) చంద్రుడు॥ తానున్నరాశికి, ౨-౫-౯-౪-౮-౧౨ ఈస్థానములయందున్న పాపగ్రహములు, వేధాగ్రహములగుటవలన శుభగ్రహము లుండినను శుభుడగుననుట॥

(3) అంగారకుడు॥ తానున్నరాశి మొదలుకొని-౫-౯-౧౨ ఈ స్థానములయందున్న శుభగ్రహములు, వేధాగ్రహములగుటవలన-పాప గ్రహములుండినను యేగ్రహములు లేకుండినను శుభుడగును॥

(4) బుధుడు॥ తానున్నరాశి మొదలుకొని,౧-3-౫-౮-౯-౧౨ ఈస్థానములయందున్న గ్రహములన్నియు వేధాగ్రహము లైనందున అందు నొకగ్రహమైననూ లేకుండెనేని శుభుడగును॥

(5) బృహస్పతి॥ తానున్నరాశి మొదలుకొని, 3-౬-౪-౮-౧౦ ఈరాసులయం దన్నిగ్రహములు, వేధాగ్రహములైనందున, నందు నొకగ్రహముమైననూ లేకుండెనేని, శుభుడగుననుట॥

(6) శుక్రుడు॥ తానున్నరాశి మొదలుకొని-౧-౯-౭-౮-౬-౫ ౧౦-౧౧-ఈస్థానములయందున్న గ్రహములు వేధాగ్రహములైనందున నందునొకగ్రహమైననూ లేకుండెనేని శుభ ఫలములొసంగుననుట॥

(7) శని॥ తానున్నరాశి మొదలుకొని-౫-౯-౧౨ ఈస్థానముల యందు, ఒకగురుడు వేధాగ్రహమైనందున అందు, గురుడు లేక తక్కిన గ్రహములుండినను, ఏగ్రహములు లేకుండినను శుభుడగును॥



(8) రాహు॥ కేతువులు॥ తామున్నరాశి మొదలుకొని ౧-౫-౯-౧౨ ఈస్థానములయందు శనికుజులతోగూడియున్న అన్నిగ్రహములు, వేధాగ్రహములైనందున॥ నందుశనికుజులు లేకతక్కిన గ్రహములుండినను కేవలము శనికుజులుండినను, ఏగ్రహములు లేకుండినను, శుభులగుదురు॥

ఈప్రకారము, ఎవరు వేధావిధినిచూడక గోచారఫలమును చెప్పుచున్నారో ఆమనుజుని మూఢునిగా పెద్దలు చెప్పుచున్నారనుట॥

90॥ నవగ్రహములకు అంగ గ్రహసంచార ఫలములు॥

అంగగ్రహసంచారులగు సూర్యాదిగ్రహములు నరాకారచక్రమందు జన్మనక్షత్రము మొదలుగా లిఖింపబడిన, నిరువదియేడు నక్షత్రములయందు, సంచారక్రమంబున, ఏనక్షత్రమునందు సంచరించుచుందురో, ఆనక్షత్రము యే యవయవమునందుండునో ఆ యవయవ ఫలమును, యీాదిగువ ప్రకారము నిచ్చుచున్నారనుట॥

జన్మనక్షత్రము మొదలు గ్రహసంచారనక్షత్రమువరకు లఘూపాయముగా గణనచే నేర్పరచిన నరాకారచక్రములు సర్వగ్రహములకు ఉదాహరణముగా వ్రాయుచున్నాడనుట॥

| ౧॥ సూర్యునకు. | ౨॥ చంద్రునకు. |
| --- | --- |
| ౧॥ ముఖమునందు, నాశనమును | ౨॥ ముఖమునందు, భయమును |
| ౪॥ శిరస్సునందు, ఐశ్వర్యమును | ౪॥ శిరస్సునందు, క్షేమమును |
| ౪॥ వక్షస్థలమందు, విజయమును | ౨॥ పృష్టమందు, శత్రుభయమును |
| ౪॥ దక్షిణహస్తమందు, ధనమును | ౨॥ నేత్రములయందు, విచారమును |
| ౬॥ పాదములయందు, ధనహీనము | ౫॥ హృదయమందు, శరీరసౌఖ్యమును, |
| ౪॥ వామహస్తమందు, దేహపీడయు | 3॥ వామహస్తమందు, శత్రుత్వము |
| ౨॥ నేత్రములయందు, ధనలాభము | 3॥ సవ్యహస్తమందు, ధనలాభము |
| ౨॥ గుహ్యమందు, మరణము | ౬॥ పాదములందు, విదేశగమనము |
| ఈప్రకారము ఫలములునిచ్చుచున్నాడు॥ | ఈ ప్రకారము ఫలము నిచ్చుచున్నాడు॥ |

౩॥ అంగారకునకు,

౨॥ ముఖమునందు, మరణమును,
౬॥ పాదములందు, కలహమును,
౩॥ వక్షస్థలమందు, జయమును,
౪॥ సవ్యహస్తమందు, క్షేమమును,
౪॥వామహస్తమందు,ధనహీనమును
౨॥ శిరస్సునందు, ధనలాభము,
౪॥ ఆసనమందు, అతిభయము,
౨॥ నేత్రములందు, విదేశగమనము
ఈ ప్రకారము ఫలము నిచ్చుచున్నాడు.

౪॥ బుధునకు

౨॥ ముఖమునందు, సంపదయు,
౩॥ శిరస్సునందు, ధనలాభము,
౨॥ నేత్రములందు, బంధనము,
౪॥ గుదస్థానమందు, బంధనము,
౧॥ వామహస్తమందు, బంధనము,
౫॥హృదయమందు,రాజ్యలాభము
౬॥ పాదములయందు, పరవాసము
౪॥ సవ్యహస్తమందు, సౌఖ్యము,
ఈ ప్రకారము ఫలము నిచ్చుచున్నాడు.

౫॥ బృహస్పతికి,

౪॥ శిరస్సునందు, రాజ్యమును,
౨॥ సవ్యహస్తమందుసంపదయును,
౧॥ కంఠమందు, ఐశ్వర్యమును,
౫॥ వక్షస్థలమందు,సంతోషమును
౬॥ పాలములందు, దేహపీడయు,
౪॥వామహస్తమందు,మరణమును,
౫॥నేత్రములయందురాజసౌఖ్యము
ఈప్రకారము యీగురుడు ఫలములనొసంగుచున్నాడనుట.

౬॥ శుక్రునకు,

౩॥ ముఖమునందు,మృష్టాన్నమును
౩॥ శిరస్సునందు, ధనలాభము,
౧॥ గుదస్థానమందు, హానియు,
౪॥ వామహస్తమందు,భయమును,
౬॥ హృదయమందు, రోగము,
౫॥ కడుపునందు, వస్త్రలాభము,
౨॥ నేత్రములందు, క్షేమము,
౩॥ సవ్యహస్తమందు,నాశనమును
ఈ ప్రకారము ఫలము నిచ్చుచున్నాడు.

౭॥ శనైశ్చరునకు,

౧॥ ముఖమునందు, మరణము,
౩॥ లలాటమందు, రాజ్యమును,
౨॥ గుహ్యమందు, మరణము,
౨॥ నేత్రములందు సంతోషము,
౫॥ హృదయమందు, సంపదయు,
౪॥ వామహస్తమందు,భయమును,
౬॥ పాదములందు, పరవాసము,
౪॥సవ్యహస్తమందు,ధనప్రాప్తియు
ఈ ప్రకారము ఫలము నిచ్చుచున్నాడు.

౮॥ రాహు, కేతువులకు,

౩॥ శిరస్సునందు, పట్టాభిషేకము



౧॥ ముఖమునందు, మరణమును,
౧॥ వక్షస్థలమందు, భయమును,
౪॥ ఫాలమందు,సర్వజనపూజ్యము
౪॥ ఉదరమందు, ధనలాభము,
౨॥ నాభియందు, ధనవృద్ధియు,
౨॥ గుహ్యమందు, ధననష్టము,
౪॥ పృష్టమందు, రోగాధికము,
౬॥పాదములందు,రోగరహితమును,

ఇత్యాది, అనేకఫలములు, జ్యోతిర్నిబంధన, లఘుతాచకము, రత్నమాలా, బృహత్పారాశరము, మొదలగు ననేకగ్రంథములయందు సత్యాచార్య, నారద,గార్గ్య, యవన, దేవల, వరరుచి, కశ్యప, పరాశర, వ్యాస, వశిష్టాత్రి, మొదలగు మునిసత్తము లమోఘముగా జెప్పియుండిరి॥

నవగ్రహములకును జపశ్లోకములు యీదిగువను వ్రాయుచున్నాడు, జపపరిమితి 85 విషయమునందు జెప్పబడి యున్నందున యిచ్చట వ్రాయలేదు॥

91॥ సూర్యాది గ్రహాణాం జపశ్లోక నిర్ణయః॥

1 సూర్యుడు॥ శ్లో॥ జపాకుసుమసంకాశం కాశ్యపేయం మహాద్యుతిం।
తమోారిం సర్వపాపఘ్నం ప్రణతోస్మిం దివాకరః॥

2 చంద్రుడు॥ శ్లో॥ దధీశంఖ తుషారాభం క్షీరార్ణవ సముద్భవం।
నమామి శశినంసోమం శంభో ర్మకుటభూషణః॥

3 కుజుడు॥ శ్లో॥ దరణీ గర్భసంభూతం విద్యుత్కాంతి సమప్రభం।
కుమారం శక్తిహస్తంతం మంగళం ప్రణమామ్యహం॥

4 బుధుడు॥ శ్లో॥ ప్రియంగు కలికాస్యామం రూపేణ ప్రతిమంబుధం।
సౌమ్యంసత్వగుణోపేతం తంబుధంప్రణమామ్యహం

5 గురుడు॥ శ్లో॥ దేవానాంచ ఋషీణాంచ గురుకాంచన సన్నిభం।
బుద్ధిమంతం త్రిలోకేశం తన్నమామి బృహస్పతిం॥

6 శుక్రుడు॥ శ్లో॥హేమకుందమృణాలాభం దైత్యానాంపరమంగురుం।
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహం॥

7 శని॥ శ్లో॥ నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం।
ఛాయా మార్తాండ సంభూతం తన్నమామి శనేశ్వరః॥

8 రాహు॥ శ్లో॥ అర్ధకాయం మహావీర్యం చంద్రాదిత్య విమర్ధనం।
సింహికాగర్భసంభూతం తంరాహుంప్రణమామ్యహం॥

9 కేతు॥ శ్లో॥ పలాశ పుష్ప సంకాశం తారకా గ్రహమస్తకం।
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహం॥

పూర్వోక్తోత్తర ప్రకారము, చార రీత్యారవ్యాది గ్రహములు, పాపదృగ్యోగములను బొందినపుడు, తమతమస్వాభావిక పాపఫలంబులు నిచ్చుచుందురు, అట్టిదోషఫల నివర్తికొరకై పూర్వోక్త ప్రకారము, గ్రహజపమును, అర్ఘ్యమును, హోమమును, దానమును, యథావిధిగా జేసిరేని, ఆయాదోషములకు శాంతి గలుగును॥

ఈ దిగువ నవగ్రహములకు ప్రత్యేక గోచారఫలములు వ్రాయుచున్నాడు॥

## ౧౨ గోచారఫలము॥

### సూర్యుని ఫలము.

శ్లో॥ దేహార్తి స్వత్వ సంతాపః కాలాతిక్రమ భోజనం।
బంధు మిత్ర సుహృద్ద్వేషః చంద్రరాశి గతేరవౌ॥

తా॥ సూర్యుడు చంద్రరాశిని బొందిన వాడయ్యేనేని శరీరమునందు బాధయు, మనస్సున సంకటమును, వేళయతిక్రమించిభోజనము సేయుట, చుట్టములతోడ, స్నేహితులతోడ, సాధువులతోడ విరోధము, ఇవికలుగును.

శ్లో॥ హీనత్వం దుష్టసంసర్గో మనస్తాపశ్శిరోవ్యథా।
నిష్ఫలం కృషివాణిజ్యం విత్తరాశిగతే రవౌ॥

తా॥ సూర్యుడు ధనరాశిని (అనగా రెండవ యింటిని) బొందినవాడయ్యేనేని నీచత్వము, దుర్మార్గులతోఁగూడిక, మనస్సంకటము, తలనొప్పి, సేద్యము వర్తకవ్యాపారము ఈరెంటియందు లాభములేకపోవుట ఇవికలుగును.

శ్లో॥ ఆరోగ్యం నిత్యసంతోషః బంధుమిత్ర సమాగమః।
అర్థలాభః పుత్రసౌఖ్య మిష్టసిద్ధి స్తృతీయగే॥

తా॥ సూర్యుడు తృతీయరాశిని జెందినవాడయ్యేనేని శరీరమునందు రోగములు తొలఁగి సుఖముగనుండుటయు, మనస్సున ఉల్లాసము, చుట్టములతోడను స్నేహితులతోడను కలసియుండుట,ధనప్రాప్తి, కుమారులవలన సౌఖ్యము, ఇష్టములు సిద్ధించుట (ఇవికలుగును)



శ్లో॥ అంతఃక్లేశం గృహచ్ఛిద్రం సౌఖ్యహానిమ భోజనం।
ప్రయాణే విఘ్నమాప్నోతి చతుర్థే రవి సంయుతే॥

తా॥ సూర్యుడు చంద్రరాశికి నాల్గవరాశిని బొందినవాడయ్యేనేని హృదయమున సంకటము, ఇంటిలో ఛిద్రములు, సుఖము లేకుండుట, భోజనసౌఖ్యము లేకపోవుట, ప్రయాణము విఘ్నమగుట, ఇవి కలుగును॥

శ్లో॥ దేహాలస్యం మనస్తాపం సుహృత్క్లేశం ధనవ్యయం।
బుద్ధిచాంచల్య మాప్నోతి పంచమే రవిసంయుతే॥

తా॥ సూర్యుడు పంచమరాశి గతుడయ్యేనేని శరీరమునందు సోమరితనము, హృదయమునందు సంకటము, స్నేహితులవలన కష్టము, ద్రవ్యవ్యయము, బుద్ధిస్థైర్యము లేకుండుట, ఇవి కలుగును.

శ్లో॥ షష్ఠేరవౌ సుసౌఖ్యాదీన్ యత్న కార్యార్థసాధనం।
దేహారోగ్యాది సంతోషం వస్త్ర ధాన్యాది లాభకృత్॥

తా॥ సూర్యుడు ఆరవరాశిని పొందినవాడయ్యేనేని మంచి సుఖము. ప్రయత్నించిన కార్యములు సాధించుట, శరీరము సుఖముగనుండుట మొదలగువానివలన సంతోషము, వస్త్రలాభము, ధాన్యాదిలాభము, కలుగును॥

శ్లో॥ సామంత జనవిద్వేషః దారపీడా సుతామయం।
ఉత్సాహ భంగ కార్యాణి గోచారే సప్తమేరవౌ॥

తా॥ గోచారరీతిగ సూర్యుడు ఏడవరాశిని బొందెనేని తన యింటికిగాని క్షేత్రమునకుఁగాని గలిగిన యెల్లతో జేరియున్నవారితో మిక్కిలి ద్వేషమును, భార్యకు పీడయు, బిడ్డలకు వ్యాధియు ఉత్సాహమునకు భంగము గలుగజేయు కార్యములును ఇవి సంభవించును.

శ్లో॥ దుర్దోషః శత్రుసంవాదో గమనాగమనవ్యథా।
దుఃఖవార్తా శ్రుతంచైవ అష్టమస్థో యదారవిః॥

తా॥ సూర్యుడు ఎనిమిదవ యింటనుండఁగా చెడుగు పనుల వలనఁ గలిగిన దోషము శత్రువులతో వాదము, విశేషముగ పోకరాకలు సేసి యందువలన కష్టము, వ్యసనకరమైన మాటలు వినుటయు, ఇవి సంభవించును॥

శ్లో॥ నిందాపరాధ కలహం స్సద్దోషశ్చ ధనక్షయః।
పుణ్యలాభార్థ నాశశ్చ విచారో నవమేరవౌ॥

తా॥ సూర్యుఁడు తొమ్మిదవయింట నుండఁగా తనయం దప రాధములేక కలహము సంభవించును, తనయందు దోషములేక ద్రవ్యము నశించును, (అనఁగా వ్రయమగుననుట,) పుణ్యము నశించును, లాభముచెడును, ద్రవ్యము తఱిగిపోవును, మనస్సున విచారము కలిగి యుండును॥

శ్లో॥ అర్థసిద్ధి స్సదారోగ్యం బంధుమిత్ర సమాగమః।
రాజదర్శన సల్లాపౌ సుసౌఖ్యం దశమేరవౌ॥

తా॥ సూర్యుఁడు పదవరాశిని బొందెనేని ద్రవ్యముదొరకుట, ఎల్లప్పుడు ఆరోగ్యము, చుట్టములు మిత్రులు మొదలగువారితో కలిసి యుండుట, రాజదర్శనము రాజసంభాషణము మంచి సౌఖ్యము ఇవి కలుగును॥

శ్లో॥ అర్థంచ స్వకులాచారః గృహే నిత్యోత్సవః శుభం।
నిత్యమాధుర్య భుక్తిశ్చ లాభే చైకాదశే రవౌ॥

తా॥ సూర్యుఁడు లాభస్థానమగు ఏకాదశ రాశిని బొంది యుండెనేని, ద్రవ్యలాభము, తన కులాచారప్రకారము జరుగుట, ఇంటి యందు ఎల్లప్పుడు నుత్సవము, పెండ్లి మొదలగు శుభములు చేయుట, ప్రతిదినము తియ్యనివస్తువులు భుజించుటయు ఇవి కలుగును.

శ్లో॥ స్వస్థాన నాశనంచైవ బంధురోగో ధనవ్యయః।
ప్రాణపర్యంత మాపత్తి రవమానం వ్యయేరవౌ॥

తా॥ సూర్యుఁడు వ్యయస్థానమగు పండ్రెండవరాశిని బొందెనేని స్థానభ్రష్టత్వము బంధువులకు రోగము సంభవించుట, ద్రవ్యము వ్రయమగుట, ప్రాణములు పోవునంత విపత్తు కలుగుట ఇవి సంభవించును.

చంద్రునియొక్క గోచారమునకు ఫలము॥

శ్లో॥ శరీర సౌఖ్యమారోగ్యం సంతోషో ధనమున్నతిః।
మృష్టాన్న భోజనం సంగం సన్మానం జన్మగేవిధౌ॥



తా॥ చంద్రుడు జన్మనక్షత్ర రాశికి వచ్చెనేని శరీరమందు సుఖము, ఆరోగ్యము, సంతోషము, ద్రవ్యము, గౌరవము, మంచి యన్నము భుజించుట, రతి బహుమానము ఇవి సంభవించును॥

శ్లో॥ అంతఃక్లేశ ధనచ్ఛేద వ్యయద స్సర్వదోషదః।
కుభోజనం దేహజాడ్యం ద్వితీయ స్థానగోవిధుః॥

తా॥ చంద్రుఁడు రెండవరాశియం దుండెనేని మనస్సున క్లేశము, ధనవ్రయము, ఇతరవస్తువులు వ్రయమగుట, సర్వదోషములు గల్గుట, వరియన్నముగాక యితరాన్నము భుజియించుట, దేహమునందు రోగము ఇవి సంభవించును॥

శ్లో॥ అర్థలాభో వస్త్రలాభ శ్చిత్తసౌఖ్యం మనోధృతిః।
కాంతాభి రిష్టసల్లాపః తృతీయ స్థానగేవిధౌ॥

తా॥ చంద్రుఁడు మూఁడవలగ్నమును బొందినవాఁ డయ్యెనేని ద్రవ్యము లభించుట, వస్త్రములు దొరకుట, మనస్సున సౌఖ్యము, ధైర్యము, తన కిష్టులగు స్త్రీలతో నిష్టప్రకారము మాట్లాడుట ఇవి సంభవించును॥

శ్లో॥ చిత్తభ్రంశం బంధువైరం బుద్ధి చాంచల్య మేవచ।
కర్మవై కల్ప్యకార్యంచ చతుర్థ స్థానగోవిధుః॥

తా॥ నాల్గవరాశిని బొందిన చంద్రుఁడు బుద్ధిభ్రంశమును, బంధుగులతోడి వైరమును, మనస్సునందు చాంచల్యమును, పనులు చెడిపోవు కృత్యము నొనరించుటను కలుగఁజేయును॥

శ్లో॥ వాతాధిక్యం సదాలస్యం మనఃపీడాం భయాంతథా।
ఇష్టార్థ నాశం కురుతే పంచమస్థే యదావిధుః॥

తా॥ చంద్రుఁడు అయిదవరాశిని బొందినవాఁ డయ్యెనేని వాతరోగము ప్రబలియుండును, ఎల్లప్పుడు శరీరమునందు సోమరితన ముండును, మనోవ్యథయు భీతియు కలిగియుండును, ఇష్టములయిన పనులుగాని నశించును॥

శ్లో॥ స్వస్థాన ప్రాప్తిమారోగ్య మర్థలాభం యశోముదం।
స్త్రీసల్లాపం ధర్మసిద్ధిం షష్ఠగో మృగలాంఛనః॥

తా॥ ఆరవరాశిని బొందిన చంద్రుఁడు స్వస్థానప్రాప్తిని, ఆరోగ్యమును, ద్రవ్యలాభమును, కీర్తిని, సంతోషమును, స్త్రీల సంభాషణమును, పుణ్యప్రాప్తిని (కీర్తిని) కలుగఁజేయును॥

శ్లో॥ మనస్సౌఖ్యం యశోవృద్ధిం సౌభాగ్యంచ ధనాగమం।
స్త్రీసౌఖ్యం దేహసౌఖ్యంచ సప్తమస్థో యదావిధుః॥

తా॥ ఏడవరాశిని బొందినచంద్రుఁడు, మనస్సున నెమ్మదియును కీర్తియొక్క పెంపును, సౌభాగ్యమును, ద్రవ్యాదాయమును, స్త్రీలవలని సౌఖ్యమును, శరీరసౌఖ్యమును గలుగఁజేయును॥

శ్లో॥ అజీర్ణామయ సంతాపం జానుబాధాం తథైవచ।
కుభోజనం దేహజాడ్యం పీడాంచాష్టమగశ్శశీ॥

తా॥ అష్టమరాశికి చంద్రుఁడు వచ్చెనేని అజీర్ణవ్యాధి సంభవించి యందువలన సంతాపమును, పిక్కలునొప్పులు, దోషయుక్తమయిన యన్నము భుజియించుటను, శరీరమునందు రోగమును వేదనయును కలుగఁజేయును॥

శ్లో॥ వస్త్రనాశం పుత్రవైరం ప్రవాసం వ్యాధిపీడనం।
ఉద్యోగ భంగం కలహం నవమస్థో యదావిధుః॥

తా॥ చంద్రుఁడు తొమ్మిదవరాశిని బొందినవాఁడయ్యెనేని బట్టలకుచెడుగును, పుత్రులతోవైరమును, విదేశవాసమును, రోగములవలన బాధయు, ఉద్యోగమున కొఱంతయు జగడమును, కలుగును॥

శ్లో॥ ఇష్టసిద్ధి స్సదారోగ్యం బంధు సంతోష భోజనం।
దశమస్థో యదాచంద్రః యత్న కార్యార్థ సాధనం॥

తా॥ చంద్రుఁడు పదవ రాశికి వచ్చెనేని తాగోరినవి లభించును; ఎల్లప్పుడు దేహమునం దారోగ్యమును, బంధువులతో గూడ సంతోషపడుచు భుజించుటయు యత్నించిన పనులను సాధించుటయు ఇవి సంభవించును॥

శ్లో॥ మనస్సౌఖ్యం సదానందః ఇష్టగృహ సుభోజనం।
ధనధాన్యాది లాభస్స్యాత్ చంద్రే చైకాదశంగతే॥



తా॥ చంద్రుఁడు పదునొకరాశిని బొందియుండఁగా మనస్సున సుఖమును, ఎల్లప్పుడు ఆనందమును, ఇష్టులతో తనయింట్లో భోజనమైనను లేక యిష్టులయింట్లో భోజనమైనను, లేకయిష్టమగు భోజనమైనను, ధనలాభము, ధాన్యాదుల లాభము, కలుగును॥

శ్లో॥ చిత్తభ్రంశో మానహానిః బంధువైరం ధనక్షయః।
ద్వాదశస్థో యదాచంద్రో దేహాలస్యం మహద్విపత్॥

తా॥ చంద్రుఁడు పండ్రెండవ రాశియందుండెనేని మనస్సున కలకబారుట, అవమానము, చుట్టములతో ద్వేషము, ధనము క్షీణించుట, శరీరమున సోమరితనము, గొప్పవిపత్తు ఇవి సంభవించును॥

కుజునియొక్క గోచారమునకు ఫలము॥

శ్లో॥ జ్వరఖడ్గ వ్రణంచైవ భార్యాబంధు విరోధకృత్।
చంద్రరాశి గతేభౌమే యక్షరాక్షస పీడితం॥

తా॥ అంగారకుఁడు చంద్రరాశిని అనఁగా నక్షత్ర లగ్నమునందుండెనేని జ్వరము, కత్తిచేత గాయము భార్యతోడను బంధువులతోడను విరోధము చేశికొనుటయు, యక్షులచేతనైన రాక్షసులచేతనైన పీడగలుగుట మొదలగునవి సంభవించును॥

శ్లో॥ అసత్వం సతతం క్లేశః సర్వకార్య వినాశనం।
సదాదుర్జన సంపర్కః భీతిస్స్యా ద్ధనగే కుజే॥

తా॥ అంగారకుడు రెండవరాశిని బొందినవాఁడయ్యెనేని దేహములో బలహానియు, ఎల్లప్పుడు మనఃక్లేశము, ఎల్లకార్యములు చెడిపోవుటయు, ఎల్లప్పుడు దుర్మార్గులతో సహవాసము, భయము ఇవి కలుగును॥

శ్లో॥ విత్తలాభ స్సదారోగ్య మిష్టసిద్ధి స్సుఖావహః॥
వస్త్రలాభో ధనప్రాప్తి స్తృతీయ స్థానగే కుజే॥

తా॥ కుజుడు మూడవరాశిని బొందెనేని ధనలాభము, ఎల్లప్పుడారోగ్యము ఇష్టప్రాప్తి ధనము అయత్నముగ సిద్ధించుట వస్త్రలాభము ఇవి కలుగును॥

శ్లో॥ భాగ్యహానిః భయంక్రూరం బంధువైరం ధనక్షయః।
రోగపీడాది సంతాపః చతుర్థ స్థానగేకుజే॥

తా॥ అంగారకుడు నాల్గవరాశిని బొందెనేని భాగ్యముతగ్గును, క్రూరమగు భయము కలుగును, చుట్టములతో విరోధము సంభవించును. ద్రవ్యము నశించును, రోగమువలన వేదనను గలిగి అలసట సంభవించును॥

శ్లో॥ దేహ జాడ్యంచ సంతాపం కాలాతిక్రమ భోజనం।
దురితం కర్మలాభశ్చ భౌమే పంచమ సంస్థితే॥

తా॥ కుజుడు ఐదవరాశియందుండునేని, శరీరమునందు రోగము, తాపము, వేళ యతిక్రమించి భుజించుట, పాపకర్మములు చేయుటయు ఇవి సంభవించును॥

శ్లో॥ వస్త్రలాభః ధాన్యలాభః ధనలాభః యశస్తథా।
మనోల్లాసః ధర్మసిద్ధి షష్ఠమస్థే కుజేభవేత్॥

తా॥ అంగారకుఁడారవరాశిని ప్రవేశించెనేని వస్త్రలాభము, ధాన్యలాభము, ధనలాభము, కీర్తి, మనస్సున ఉల్లాసము, పుణ్యము సంప్రాప్తమగుట ఇవి కలుగును॥

శ్లో॥ అన్నవస్త్రాది రహితం సదాక్లేశ స్వబంధుభిః।
కువార్తా పుత్రభ్రాతౄణాం క్రోధస్సప్త మగేకుజే॥

తా॥ కుజుడు ఏడవరాశికి వచ్చెనేని అన్నము వస్త్రము తరుగును, తన బంధువులచేత నెడతెగని క్లేశము, కుత్సితములగు మాటలు గలుగుట, కుమారులైనను భ్రాతృలైనను క్రోధముచేయుట ఇవి కలుగును॥

శ్లో॥ ప్రవాసః కార్యహానిస్స్యాత్ కాసరోగ ప్రపీడనం।
స్థాననాశో ఋణచ్ఛేద అష్టమస్థే ధరాసుతే॥

తా॥ కుజుఁడు ఎనిమిదవరాశి యుతుండయ్యెనేని దేశాంతర వాసము కార్యహాని, కాసరోగమువలని బాధ, స్థాననాశము, అప్పుచేత నవమానము బొందుట, ఇవి కలుగును॥

శ్లో॥ అశనాచ్ఛా దనన్యూనం శోషణం దేహపీడనం।
స్థాననాశం విరోధంచ నవమస్థే ధరాసుతః॥



తా॥ అంగారకుడు తొమ్మిదవరాశిని బొందెనేని అన్నవస్త్రాదులు అమరకుండుట శరీరము ఎండిపోవుట శరీరమునందు నొప్పి స్థాన భ్రష్టత్వము ద్వేషము ఇవి కలుగును॥

శ్లో॥ నిత్యంక్లేశః సదావ్యాధిః తథాభోజన దుర్బలం।
సదా సంచార ఉద్యోగం దశమస్థే ధరాసుతే॥

తా॥ కుజుడు పదవరాశికిఁ బ్రవేశించెనేని ఎల్లప్పుడు క్లేశము ఎల్లప్పుడు వ్యాధి సత్తువలేని యన్నమును భోజనముసేయుట ఎల్లప్పుడు కాళ్ల త్రిప్పటగల యుద్యోగము, ఇవి కలుగును॥

శ్లో॥ ఆరోగ్య మర్థలాభంచ సంతోషం వస్త్రలాభకృత్।
యత్నకార్యాను కూలత్వం ధైర్యమేకాదశే కుజః॥

తా॥ పదునొకండవ రాశియందు అంగారకుఁడుండెనేని ఆరోగ్యము ద్రవ్యలాభము, సంతోషము, వస్త్రలాభము, ప్రయత్నించిన కార్యము లనుకూలించుట ధైర్యము, ఇవి కలుగును॥

శ్లో॥ ప్రవాసం వ్యాధిపీడాంచ బంధువైరం ధనక్షయం।
దేహపీడాంచ సంచారం ద్వాదశ స్థానగోకుజః॥

తా॥ పండ్రెండవ రాశియందు కుజుడు ప్రవేశించెనేని దేశాంతరవాసమును, రోగమువలన వేదనయును, చుట్టములతో ద్వేషమును, ధననాశమును, శరీరమున పీడగలుగుట, త్రిప్పట ఇవి కలుగును॥

బుధునియొక్క గోచారమునకు ఫలము॥

శ్లో॥ చిత్తభ్రంశో బంధువైరం కాలాతిక్రమ భోజనం।
వివాదః దుష్టసంసర్గం చంద్రరాశి గతేబుధే॥

తా॥ బుధుడు చంద్రరాశిని బొందెనేని బుద్ధివైకల్యము, బంధువైరము, కాలముతప్పిభోజనము, జగడము, దుర్మార్గులతో సహవాసము ఇవి సంభవించును॥

శ్లో॥ మణిమూలార్థ లాభంచ సదాసౌఖ్యం నరస్యచ।
నిత్యారోగ్యంచ సద్గోష్ఠిః ద్వితీయ స్థానగేబుధే॥

తా॥ బుధుడు రెండవరాశిని బొందిన వాడయ్యెనేని మనుష్యునికి మణులమూలకముగ ద్రవ్యప్రాప్తి ఎల్లప్పుడుసుఖము, ఎడతెగని యారోగ్యము మంచివారలతో గోష్ఠిసల్పుట ఇవి సంభవించును॥

శ్లో॥ అర్థహాని రాజకోపః జ్ఞాతివైరం తథాస్మృతిః।
బుద్ధిజాడ్యం మనస్తాపః సహజస్థానగేబుధే॥

తా॥ బుధుడు తృతీయస్థానములో చేరినవాడయ్యెనేని ద్రవ్యనాశము, రాజకోపము, బంధువిరోధము, మరుపు, బుద్ధిజాఢ్యము, మనస్తాపము, ఇవి కలుగును॥

శ్లో॥ మాతృసౌఖ్యంచ సంతోషః ధనధాన్య వివర్ధనం।
బుద్ధిప్రారంభ కార్యస్య సిద్ధిర్బంధు గతేబుధే॥

తా॥ బుధుడు నాల్గవరాశిని బొందిన వాడయ్యెనేని తల్లికి సుఖము, సంతోషము, ధనము ధాన్యము వృద్ధియగుట, స్వబుద్ధిచే నుపక్రమింపఁబడిన కార్యములు సిద్ధించుట, ఇవి సంభవించును॥

శ్లో॥ సర్వాంగే షూష్మసంతాపః సర్వదోషాశ్చ మారణం।
అకస్మాత్కలహాశ్చైవ పంచమస్థే బుధేభవేత్॥

తా॥ బుధుడు అయిదవరాశియందు ప్రవేశించెనేని అవయవములందు ఉష్ణమువలన తాపము పిత్తవాతాది దోషములవలన మరణము, అకస్మాత్తుగా కలహము ఇవి కలుగును॥

శ్లో॥ వస్త్రలాభో ధాన్యలాభః ధనలాభో మనోధృతిః।
విద్యావినోద సౌఖ్యంచ రిపుస్థాన గతేబుధే॥

తా॥ బుధుడు ఆరవరాశిని బొందఁగా వస్త్రలాభము, ధనలాభము, ధాన్యలాభము, మనస్సుస్థైర్యము, విద్యలచే వినోదపడుచు, సుఖించుట, ఇవి కలుగును॥

శ్లో॥ దౌర్భాగ్య మర్థనాశశ్చ ప్రభుక్రోధః కురూపణం।
సర్వాంగ జాడ్యముష్ణంచ సప్తమ స్థాన గేబుధే॥

తా॥ బుధుడు సప్తమస్థానమును బొందినయెడల దౌర్భాగ్యము, ద్రవ్యనాశము, రాజకోపము, సౌందర్యహాని, సర్వాంగములు, జడీభూతములగుట ఉష్ణము ఇవి కలుగును॥

శ్లో॥ దేహజాడ్యం మనస్తాపః వ్యాకులంచాల్ప భోజనం।
అనృతం భయమిత్యాహు రష్టమస్థే భవేద్బుధే॥



తా॥ బుధుడు ఎనిమిదవరాశిని బొందెనేని శరీరమునందు రోగము, హృదయమునందు తాపము, వ్యాకులత్వము, భీతి, స్వల్పభోజనము, అసత్యము ఇవి కలుగును॥

శ్లో॥ దేహాలస్యం యశోహాని స్వకర్మ పర పీడనం।
అరోచ భోజనం పిత్తం నవమస్థే భవేద్బుధే॥

తా॥ బుధుఁడు తొమ్మిదవరాశిని బొందఁగా శరీరమునందు సోమరితనము, కీర్తిచెడుట, తాజేసిన కృత్యములచే పరులకు బాధ కలుగుట, ఇంపుకాని పదార్థములు భుజియించుట, పిత్తము ప్రబలియుండుట, యివి కలుగును॥

శ్లో॥ అపవాదః దూషణంచ అన్నసౌఖ్య నిరాకృతిః।
ఆలస్యం తాపనంచైవ దశమస్థే భవేద్బుధే॥

తా॥ బుధుఁడు పదవరాశిని బొందెనేని అపవాదము, తిట్లు, భోజనసౌఖ్యములేకుండుట, సోమరితనము, సంతాపము ఇవికలుగును॥

శ్లో॥ ఆరోగ్య మర్థలాభశ్చ మనఃప్రీతిః సుఖంభవేత్।
బంధుప్రీతి ర్యశోవృద్ధి ర్లాభేచైకాదశే బుధః॥

తా॥ బుధుడు పదునొకండవరాశిని బొందెనేని ఆరోగ్యము, ద్రవ్యలాభము, మనస్సున సంతోషము, సౌఖ్యము, బంధువులతో మైత్రిచేయుట, కీర్తివర్ధిల్లుట, ఇవి కలుగును॥

శ్లో॥ సౌఖ్యహాని ర్మనఃక్లేశః కృషిభోజన మల్పశః।
నిత్యసంవాద దారిద్ర్యం ద్వాదశ స్థానగేబుధే॥

తా॥ బుధుడు పండ్రెండవరాశిని బొందెనేని సౌఖ్యముచెడును, మనస్సున సంకటములు కలుగును, సేద్యముతరుగును, భోజనమునందు సుఖముకనబడదు. ఎల్లప్పుడు కలహము సంభవించును, దారిద్ర్యము కలుగును॥

## గురువుయొక్క గోచారమునకు ఫలము.

శ్లో॥ రాజకోపో యశోహాని రుద్యోగస్య విరోధకం।
బుద్ధిభ్రంశో భాగ్యహాని ర్భయంతను గతేగురౌ॥

తా॥ గురువు మొదటి రాశికివచ్చెనేని రాజకోపము, కీర్తి హాని, ఉద్యోగవిరోధము, బుద్ధిభ్రంశము, భాగ్యహాని, భయము ఇవి సంభవించును॥

శ్లో॥ మనస్సౌఖ్యం యశోవృద్ధి స్సౌభాగ్యంచ ధనాగమః ।
ధర్మవ్రయం మనస్సౌఖ్యం ద్వితీయ స్థానగేగురౌ॥

తా॥ బృహస్పతి రెండవరాశికి వచ్చెనేని హృదయసుఖము, యశోవృద్ధి, సౌభాగ్యము, ధనాదాయము, ధర్మకార్యమునకు ధనము వెచ్చపెట్టి యందువలన మనస్తుష్టి ఇవి కలుగును॥

శ్లో॥ అతిక్లేశం బంధువైరం దారిద్ర్యం దేహపీడనం ।
ఉద్యోగభంగం కలహం తృతీయ స్థానగోగురుః॥

తా॥ మూడవరాశిని బొందిన గురువు మిక్కిలి శ్రమమును, చుట్టములతో విరోధమును, దరిద్రత్వమును, శరీరనొప్పియును, ఉద్యోగము చెడిపోవుటను, జగడమును వీనిని కలుగజేయును॥

శ్లో॥ యాచనం బుద్ధి చాంచల్యం తేజోహానిం ధనవ్రయం ।
దేశత్యాగంచ కలహం చతుర్థ స్థానగోగురుః॥

తా॥ నాల్గవరాశికి గురువు వచ్చెనేని యాచనము, బుద్ధి చాంచల్యము, తేజస్సు నాశమగుట, ద్రవ్యనాశము, దేశత్యాగము ఇవి కలుగును॥

శ్లో॥ అర్థలాభం తథైశ్వర్యం స్వకర్మ రతిహర్షితం।
సదాస్వజన సౌఖ్యంచ పంచమస్థే భవేద్గురౌ ॥

తా॥ బృహస్పతి పంచమరాశికి వచ్చెనేని ద్రవ్యలాభము, ఐశ్వర్యము, తన పను లనుకూలించుటచే సంతోషము, తన బంధువుల వలన సౌఖ్యము ఇవి కలుగును॥

శ్లో॥ దారపుత్ర విరోధశ్చ స్వజనె కలహ స్తథా ।
చోరాగ్ని నృపభీతిశ్చ షష్ఠమస్థే భవేద్గురౌ ॥

తా॥ బృహస్పతి యారవరాశికి వచ్చెనేని పెండ్లాముతోను పుత్రులతోను కలహము బంధుకలహము, దొంగలవలనగాని, నిప్పువలనగాని, రాజువలనగాని భయము ఇవి కలుగును॥



శ్లో॥ రాజదర్శన మారోగ్యం గాంభీర్యం గాత్రపోషణం ।
అభీష్ట కార్యసిద్ధిశ్చ సప్తమస్థే భవేద్గురౌ ॥

తా॥ గురువు ఏడవరాశిని బొందెనేని ఆరోగ్యము, రాజదర్శనము, తన శరీరపోషణము తన కిష్టములగు కార్యములు సిద్ధించుట ఇవి కలుగును॥

శ్లో॥ చోరాగ్ని నృపభీతిశ్చ గాత్ర గాంభీర్యనాశనం ।
నిష్ఠూరం సాహసం క్రోధ మష్టమస్థే గురౌభవేత్ ॥

తా॥ గురువు ఎనిమిదవరాశిని బొందెనేని దొంగలభయము అగ్నిభయము రాజభయము దేహము సొంపుచెడుట, గాంభీర్యము మారిపోవుట, క్రూరోక్తులు పల్కుట తెగువ, కోపము, ఇవి కలిగి యుండును.

శ్లో॥ అర్థంచ స్వకులాచారః గృహలాభ స్సుభోజనం।
నిత్యస్త్రీ జనసంపర్కః నవమస్థే భవేత్ గురౌ ॥

తా॥ గురువు తొమ్మిదవరాశిని బొందెనేని ద్రవ్యము, తన కులాచార ప్రకారము నడత, గృహలాభము, మంచిభోజనము, ఎల్లప్పుడు స్త్రీలతో సమాగమము, ఇవి సంభవించును॥

శ్లో॥ ధాన్యనాశో ధనచ్ఛేదః వృథా సంచరణం భయం ।
స్వజనై ర్దూషణంచైవ దశమస్థో యదాగురుః ॥

తా॥ గురువు పదవరాశికి వచ్చెనేని ధాన్యనాశము, ద్రవ్యవ్రయము, వ్యర్థముగా సంచరించుట, భయము, తన మనుష్యులతో దూఱు ఇవి కలుగును॥

శ్లో॥ యశోవృద్ధి ర్బలం తేజ స్సర్వత్ర విజయస్సుఖం ।
శత్రునాశో మంత్రసిద్ధి రేకాదశ గతేగురౌ ॥

తా॥ గురువు పదునొకండవ రాశిని బొందెనేని కీర్తివృద్ధి, బలము, తేజస్సు, ఎల్లచోట్ల జయము, సుఖము, విరోధి నాశము, మంత్రసిద్ధి, ఇవి కలుగును.

శ్లో॥ శుభమార్గే వ్రయశ్చైవ ప్రాణివిక్రయ దూషణం ।
స్థానభ్రష్టంచ దారిద్ర్యం ద్వాదశ స్థానగేగురౌ ॥

తా॥ గురువు పంన్రెండవ రాశిని బొందెనేని శుభములు చేయుటచే వ్రయము ప్రాణముగలవస్తువుల నమ్మటచే దూఱు, స్థాననాశము, దారిద్ర్యము, ఇవికలుగును.

శుక్రునియొక్క గోచారమునకు ఫలము॥

శ్లో॥ అర్థలాభ శ్చిత్తసౌఖ్యం పరస్త్రీ సంగమ స్తథా।
యత్నకార్యార్థ లాభస్స్యాత్ జన్మగే భృగునందనే॥

తా॥ శుక్రుడు చంద్రరాశిగతుడు అయ్యేనేని ద్రవ్య లాభము మనస్సౌఖ్యము పరస్త్రీసంగమము యత్నించిన కార్యమువలన ధన ప్రాప్తి ఇవి కలుగును.

శ్లో॥ కుటుంబ సౌఖ్యమారోగ్యం స్త్రీసల్లాపం యశస్కరం।
దేహసౌఖ్యం వస్త్రలాభం ద్వితీయస్థో భృగుర్దిశేత్॥

తా॥ శుక్రుడు రెండవరాశియందుండెనేని పెండ్లామువలన సౌఖ్యము ఆరోగ్యము స్త్రీలతో సల్లాపము కీర్తి శరీరసౌఖ్యము వస్త్రలాభము ఇవి కలుగును॥

శ్లో॥ వాణిజ్య ధననాశంచ శత్రువృద్ధి ధనక్షయః।
గతంజీవన రాహిత్యం భార్గవేచ తృతీయగే॥

తా॥ శుక్రుడు మూడవరాశిని బొందినయెడల వర్తకమూలముగ ద్రవ్యనాశము శత్రువులకువృద్ధి అందువలన ద్రవ్యనాశము త్రిప్పట జీవనోపాయ వైకల్యము యివి కలుగును॥

శ్లో॥ స్వబుద్ధి ర్బంధుసన్మానం స్త్రీ సంభాషణ సంభ్రమః।
పుత్రమిత్ర కళత్రాది విద్యాగోష్ఠి సుఖేభృగుః॥

తా॥ శుక్రుడు సుఖస్థానమగు నాల్గవరాశిని బొందెనేని తన బుద్ధిప్రకారము ప్రవర్తించుట చుట్టముల బహుమానము స్త్రీలతో భాషించుట పుత్రులు మిత్రులు కళత్రములు తక్కిన బంధువులు వీరలతో విద్యాగోష్ఠి చేయుట ఇవి కలుగును॥

శ్లో॥ దాసీభృత్య జనాలాభః నిత్య మృష్టాన్న భోజనం।
ధనధాన్య మభీష్టార్థః పంచమస్థే భవేత్ భృగౌ॥



తా॥ శుక్రుడు ఐదవరాశికి రాగా దాసజనులు దాసీజనులు కలిగి యుండుట, ఆదాయము, ఎల్లప్పుడు మంచియన్నము భుజియంచుట, ధాన్యము ఇష్టార్థలాభము ఇవి కలుగును॥

శ్లో॥ విరోధ శ్శత్రుపీడాచ జ్ఞాతీనాంచ విరోధతః।
ఆయాసో దారపుత్రాద్యై ష్షష్ఠగే భృగునందనే॥

తా॥ శుక్రుడు ఆరవరాశిని బొందెనేని విరోధము, శత్రువుల చేత పీడ, జ్ఞాతి విరోధము, పెండ్లాము కుమారులు వీరలచే ఆయాసము ఇవి కలుగును॥

శ్లో॥ తాపఃకోప స్తథాభీతిః సర్వదా క్లేశజీవనం।
స్త్రీజాడ్యం మేహరోగాది భృగౌ సప్తమగేఫలం॥

తా॥ శుక్రుడు ఏడవరాశిని బొందగా తాపము, కోపము, గొప్పభయము, ఎల్లప్పుడు కష్టజీవనము, స్త్రీరోగము, మేహరోగము మొదలగునవి కలుగును॥

శ్లో॥ దుఃఖనాశో మహాసౌఖ్యం బంధుమిత్ర సమాగమః।
రాజదర్శన మర్థాప్తి దష్టమే భృగునందనే॥

తా॥ శుక్రుడు ఎనిమిదవరాశిని బొందగా దుఃఖనాశము గొప్ప సౌఖ్యము. బంధువులతోను సమాగమము, రాజ సందర్శనము, ద్రవ్యలాభము, ఇవి కలుగును॥

శ్లో॥ వస్త్రలాభో మహారోగ్యం గురుభక్తి స్స్వధర్మకృత్।
చిత్తశుద్ధి రభీష్టార్థః నవమస్థే భవేద్భృగౌ॥

తా॥ శుక్రుడు తొమ్మిదవ రాశిని బొందగా వస్త్రలాభము, గొప్ప ఆరోగ్యము, కులాచారము నడుపుట, గురుభక్తి, ఇష్టార్థములు లభించుట ఇవి కలుగును॥

శ్లో॥ వ్యాకులం చైవ నిస్సత్వ మర్థనాశం రిపోర్భయం।
స్త్రీసౌఖ్య హానిమాప్నోతి దశమస్థే భృగోస్సుతే॥

తా॥ శుక్రుడు పదవరాశియందుండెనేని వ్యాకులము బలహాం ద్రవ్యనాశము శత్రుభయము స్త్రీసౌఖ్యములేమి ఇవి కలుగును॥

శ్లో॥ పుష్టకాంతిం తథాకీర్తి మిష్టకార్యార్థ సాధకం।
క్షీరాన్న భోజనంకుర్యాత్ శుక్రస్స్వైకా దశేఫలం॥

తా॥ శుక్రుడు పదునొకరాశిం జెందెనేని పుష్కలమగు కాంతియు కీర్తియు, ఇష్టకార్యములు సిద్ధించుట, అర్థలాభము క్షీరములతోడ నన్నము భుజియించుట ఇవి సంభవించును॥

శ్లో॥ శస్త్రపీడా చోరబాధా చాతిక్లేశో మహద్భయం ।
కృష్యాది సర్వవిఘ్నంస్యా ద్ద్వాదశస్థానగే భృగా ॥

తా॥ శుక్రుడు పండ్రెండవ స్థానమునకు వచ్చెనేని ఆయుధములవలన బాధ, దొంగలవలనపీడ, మిక్కిలికష్టము, గొప్పభయము, కృషి మొదలగు సర్వకార్యములు విఘ్నములగుట ఇవి కలుగును॥

శనియొక్క గోచారమునకు ఫలము॥

శ్లో॥ తేజోహాని ర్మతిభ్రంశః మనఃపీడా భయంతథా ।
రోగార్తి ర్బంధువైరంచ వ్యసనం జన్మగేశనా ॥

తా॥ శని జన్మరాశిని బొందెనేని తేజోహాని, మతిభ్రంశము, హృదయమున సంకటము, భీతి, వ్యాధివలనబాధ, బంధువులతో వైరము, దుఃఖము ఇవి కలుగుననుట॥

శ్లో॥ సదాక్లేశం వృథావైరం సతతం కార్యనాశనం ।
సంచార స్స్వజనద్వేషం పాపచింతాం ధనేశనాః ॥

తా॥ శని రెండవరాశియందు ప్రవేశించెనేని ఎల్లప్పుడు కష్టము, కారణములేక, విరోధము, ఎల్లప్పుడు కార్యములు నశించుట, త్రిప్పుట, తన మనుష్యులతో విరోధము, పాపచింతనము కలుగును॥

శ్లో॥ స్త్రీభోగంచ మనస్సౌఖ్యం బుద్ధియత్నాది సిద్ధికృత్ ।
స్వస్థాన ప్రాప్తిమారోగ్యం రవిపుత్రే తృతీయగే ॥

తా॥ శని మూడవయింటనుండగా స్త్రీసంభోగము హృదయసుఖము, స్వబుద్ధిచే ప్రయత్నించిన కార్యము సిద్ధించుట, స్వస్థలప్రాప్తి, ఆరోగ్యము ఇవి కలుగును॥

శ్లో॥ వాతశూలం మనఃక్లేశం భయ స్వస్థాన హానికృత్ ।
ప్రసూతి దేహపీడాచ సూర్యపుత్ర శ్చతుర్థగః ॥

తా॥ శని నాల్గవరాశికి వచ్చెనేని వాతమువలన శూల, మనస్సున క్లేశము, భీతి, స్వస్థానహాని, ఇంటియందు ఎవరైన ప్రసవించుట. దేహములో నలకువ. ఇవి కలుగఁజేయును॥



శ్లో॥ కార్యహాని ర్మనస్తాపః జ్ఞాతివ్యాజ్య కలాపకం ।
హీనస్త్రీ భోగసంతాపః పంచమస్థే భవేచ్ఛనా ॥

తా॥ శని పంచమరాశికి ప్రవేశించెనేని, కార్యములు చెడుట, మనస్తాపము, దాయాదులతో వ్యాజ్యములు మెండుగాజరుగుట, హీనజాతిస్త్రీతో సంభోగించి దానివలన పరితపించుట ఇవి కలుగును॥

శ్లో॥ ధనధాన్యాభి వృద్ధించ బంధు సంతోషవర్ధనం ।
స్త్రీసౌఖ్యం గృహ నిర్మాణం షష్ఠస్థాన గతశ్శనిః ॥

తా॥ ఆరవరాశిని బొందిన శని ధనధాన్యములు వృద్ధియగుటను, బంధువులకు సంతోషము కలిగించుటను, స్త్రీలవలన సౌఖ్యము, ఇల్లుకట్టుట, ఇవి కలుగఁజేయును॥

శ్లో॥ వ్యాధింపీడాం ప్రవాసంచ అంతఃక్లేశం మహద్భయం ।
అర్థనాశం మనస్తాపం సప్తమ స్థానగశ్శనిః ॥

తా॥ ఏడవరాశిని బొందిన శని వ్యాధిని, వేదనను, దేశాంతరవాసమును, హృదయమున కష్టములను, గొప్ప భీతియును, ద్రవ్యనాశమును, హృదయతాపమును, ఇచ్చును॥

శ్లో॥ నానాకార్య విరోధశ్చ వ్యాధిపీడా ధనక్షయః ।
అపమృత్యు భయప్రాప్తి రష్టమస్థే శనౌభవేత్ ॥

తా॥ శని ఎనిమిదవరాశికి వచ్చెనేని ఎల్ల కార్యములు చెడిపోవును, రోగములవలన బాధకలుగును, ధనవ్యయముకలుగును, అపమృత్యువువలన భయము సంప్రాప్తమగును॥

శ్లో॥ శోకంరోగం మహాదుఃఖం క్వచిద్ద్రవ్యం క్వచిత్సుఖం ।
స్వదార స్వసుతక్లేశం నవమస్థో శనిర్దిశేత్ ॥

తా॥ తొమ్మిదవరాశిని బొందినశని దుఃఖమును, వ్యాధిని, కొన్నివేళల తీరనిదుఃఖమును, ఒకానొకప్పుడు ధనలాభమును, ఒకానొకప్పుడు సుఖమును, పెండ్లామును గుఱించియు కుమారులను గుఱించియు కష్టము ఇచ్చును॥

శ్లో॥ వ్యాకులం శోకసంతాపః పాపముద్యోగ విఘ్నకం ।
కృష్యాది సర్వవిఘ్నంచ దశమస్థే భవేచ్ఛనా ॥

తా॥ శని పదవరాశికివచ్చెనేని వ్యాకులము దుఃఖమువలన పరితాపము పాపకృత్యముచేయుట ఉద్యోగమునకువిఘ్నము, కృషి మొదలగుసమస్తకార్యములకు విఘాతముసంభవించుట,ఇవికలుగును॥

శ్లో॥ ఆరోగ్య మర్థలాభశ్చ స్త్రీపుత్ర సుఖవర్ధనం ।
చిత్తశుద్ధి రభీష్టార్థ ఏకాదశ గతేశనౌ ॥

తా॥ శని పదునొక రాశిని ప్రవేశించెనేని దేహారోగ్యము ద్రవ్యలాభము స్త్రీవలనను పుత్రునివలనను విశేషసుఖము గలుగుట, మనస్సు నిర్మలముగనుండుట, ఇష్టార్థసిద్ధి ఇవి సంభవించును॥

శ్లో॥ మానహాని ర్మనఃక్లేశః కృషిర్భోజన మల్పశః ।
నిత్యసంవాద దారిద్ర్యం ద్వాదశ స్థానగేశనౌ ॥

తా॥ శని పండ్రెండవరాశిని ప్రవేశించెనేని మానహాని సంభవించును, మనస్సున క్లేశముగలుగును, కృషి జబ్బుపడును, భోజనపదార్థములు అమరకుండుటచే భోజనము ఇంపుగాదు ఎల్లప్పుడు ఇంటియందు పోరుకలుగుచుండును దారిద్ర్యము ప్రబలియుండును॥

గోచారఫలము సంపూర్ణము.

---

శని సంచారమువలనఁ గలుగు ఫలముల వివరము॥

అశ్వినినక్షత్రమునఁ బుట్టినవానికి సింహము కన్య యీరాసుల యందుఁ శనియుండెనేని ఉద్యోగమువలన ధనప్రాప్తియు,క్రయవిక్రయ మూలకముగ ఆదాయమును ఎల్లకార్యములయందు జయమును కలుగును, ధనుస్సులో శనిసంచరించునప్పుడు జీవనహాని, బుద్ధివినాశము, లోవైనమువలన ధననష్టము, మానభంగము, దేశత్యాగము బ్రాహ్మణద్వేషము, దారిద్ర్యము, ఇవి లభించును. మిథునము, కటకము, ఈ రాసులయందు శని సంచరించునప్పుడు గృహమందు తిలసంబంధము గిలకర్మము. ఋణబాధ, సొత్తులుకుదువపెట్టుట, గొప్పవాతూలము, ఇవిలభించను. తక్కినరాసులు సమఫలములు, పైనఁజెప్పఁబడిన స్థానములలో శనియుండినప్పుడు జన్మముకలిగినను అయాస్థానములందున్నప్పుడు శనిదశసంప్రాప్తమయినను శనికి ఆయారాసులయందు సంచారమువలనఁ గలిగినఫలములు తప్పక సంభవించును.



భరణినక్షత్రమునబుట్టినవానికి మిథునములో శనిసంచరించునప్పుడు వర్తకమూలకముగగాని వ్యవహారమూలకముగగాని విశేషధనలాభము, ఇతరకుటుంబ సంరక్షణము పరిపూర్ణజయము కలును. మేషము, వృషభము ఈరాసులలోకివచ్చినప్పుడు, కర్మసంబంధము, దుఃఖము కలుగును. తులకువచ్చెనేని జీవనహాని, స్త్రీమూలకముగసొత్తులనష్టము ఋణబాధ దేహజాడ్యము, స్థానభ్రంశయు, మనోవ్యాకూలత, దారిద్ర్యము, కలుగును, కటకములో శని సంచరించునప్పుడు సహోదరనష్టముకలుగును. తక్కినరాసులలో నుండునప్పుడు సమఫలము. ఇదిగాక జననకాలములో పైరాసులలో శనియుండి శనిదశవచ్చినయెడల పూర్వోక్త ఫలములు తప్పక కలుగును.

కృత్తికనక్షత్రములోబుట్టినవానికి మేషములోనికి శనివచ్చెనేనియు బ్రభుమూలకముగను రాళ్లమూలకముగను, ఉద్యోగమూలకముగను విశేష ధనలాభము కలుగును, కుంభములో శని సంచరించునప్పుడు కర్మసంబంధము ఋణము, వ్యాకులము, కారాగృహవీక్షణము, కలుగును సింహములోతిరుగునప్పుడు జీవనహాని, రాజకీయవ్యవహారములవలన మానభంగము, పలాయనము, వ్యాకులము, దారిద్ర్యము మహాకష్టముకలుగును, తక్కినరాసులలోనుండునప్పుడు సమఫలము కలుగును. ఇదిగాక పైనఁ జెప్పిన స్థానములలో శని యుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

రోహిణి నక్షత్రములో బుట్టినవానికి శని కుంభముకువచ్చినప్పుడు నీచులమూలకముగ, సేవకావృత్తిమూలముగ, దొంగలమూలకముగ విశేషఫలమును సంతోషము, భాగ్యము ఇవికలుగును. ధనుస్సులో శనిసంచారము చేయుచుండగా కర్మసంబంధము ఋణమూలకముగ వ్యాకులముకలుగును. తక్కినరాసులు సమఫలములు ఇదిగాక పైనజెప్పిన స్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈ ఫలములు తప్పకజరుగును.

మృగశిరనక్షత్రములోబుట్టినవానికి ధనుస్సులో శనితిరుగునప్పుడు బ్రాహ్మణమూలకముగను దేవతానిర్మాణమూలకముగను ధనలాభము ఉద్యోగము ఇవి కలుగును. కన్యా తులలలో సంచరించు

నప్పుడు కర్మసంబంధము ఋణమూలకముగను వ్యాపార మూలకము గను నష్టముకలుగును. మీనములో శనిసంచరించునప్పుడు జీవనహాని జలగండము విరోధము మహాక్రూరము ఇవికలుగును. తక్కినరాసులు సమఫలములు ఇదిగాక పైనఁజెప్పినస్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

ఆరుద్రనక్షత్రములో బుట్టినవానికి శని కన్యాతులలలో సంచరించునప్పుడు క్రయవిక్రయమూలకముగ ధనప్రాప్తి, శుభమూలక సంతోషము. కటకములో సంచరించునప్పుడు జ్ఞాతినాశము, ఋణమూలకవ్యాకులము. సింహములో సంచరించునప్పుడు కర్మసంబంధము మకరములోనికిరాఁగాజీవనహాని లోపమయినమువలన యావదాస్తినాశము, మానభంగము, మహిషమూలకముగ గండము, జలగండము ఇవికలుగును. తక్కినరాసులు సమఫలములు. ఇదిగాక పైనజెప్పినస్థానములలో శనియుండి శనిదశాభుక్తులు వస్తే ఈ ఫలములు తప్పక జరుగును.

పునర్వసునక్షత్రములో బుట్టినవానికి శని కటకములోసంచరించునప్పుడు జలసంబంధకార్యములవలన విశేషధనలాభము, (అనఁగా వోడవర్తకమువలననుట) వృషభములో సంచరించునపుడు జలసంబంధకర్మము, దాయాదినాశము, ఋణబాధ, వ్యాకులము. వృశ్చికములో తిగునప్పుడు జీవనహాని, రాజకీయవ్యవహార కార్యములవలన మానభంగము దేహజాడ్యము ఇవికలుగును తక్కినరాసులు సమఫలములు. ఇదిగాక పైనఁజెప్పినస్థానములలోశనియుండి శనిదశాభుక్తులు వస్తే ఈఫలములు తప్పక జరుగును.

పుష్యమినక్షత్రములోబుట్టిన వానికి శని వృషభములో తిరుగునప్పుడు కళత్రమూలకముగ స్త్రీలమూలకముగ భార్యాదృష్టమువలనను ధనప్రాప్తి, శుభకార్యమువలన ఉల్లాసము, సింహాకన్యలలోతిరుగునప్పుడు జీవనహాని లోవైనములోనుండు సొత్తులనాశము. మీనములోసంచరించునప్పుడు తిలసంభంధకర్మ బంధునాశము ఋణసంకటము క్రూరకార్యములు ఇవికలుగును. తక్కినరాసులు సమఫలములు



ఇదిగాక పైనఁజెప్పినస్థానములలో శనియుండి శనిదశాభుక్తులు వస్తే ఈ ఫలములు తప్పక జరుగును.

ఆశ్లేషనక్షత్రములో బుట్టినవానికి శని మీనరాశిలో తిరుగునప్పుడు జీవనదులవద్ద సుఖజీవనము తన్మూలకముగధనలాభము దేవీసంబంధములైన కార్యములు మీనకర్కటములలో తిరుగునప్పుడు జీవనహాని పరదేశములో విశేషసంచారము, దేహఅసౌఖ్యము ధనుర్మకరములలో సంచరించునప్పుడు విశేషముగకర్మములుచేయుంచుట ఋణవిశేషము వ్యాకులత్వము జలమువలనభీతి, దారిద్ర్యము ఇవికలుగును తక్కినరాసులుసమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈ ఫలములు తప్పకజరుగును.

మఖనక్షత్రములోబుట్టినవానికి శని ధనుర్మకరములలో సంచరించునప్పుడు, బ్రాహ్మణమూలకముగ నీచులమూలకముగ, ఉద్యోగమూలకముగ, ధనలాభము సంతోషము. తులావృశ్చికములలో, సంచరించు నప్పుడు, ఋణవ్యాకులము తిలసంబంధకర్మము, శత్రుత్వము మహాక్రూరతయు మేషములోతిరుగునప్పుడు జీవనములేకపోవుట, మానహాని, మహాదారిద్ర్యము, ఇవికలుగును తక్కినరాసులు సమఫలములు. ఇదిగాకపైనజెప్పినస్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పకజరుగును.

పుబ్బానక్షత్రములో బుట్టినవానికి శని తులావృశ్చికములో తిరుగునప్పుడు ప్రభుమూలకముగ స్త్రీలమూలకముగ మంచియుద్యోగ శిఫారసులవలనను, ధనలాభము, సింహ కన్యలలో తిరుగునప్పుడు ఋణమూలకముగ తిలసంబంధముగు కర్మమూలకముగ వ్యాకులము. మిథునములో నుండునప్పుడు బంధునాశము. కుంభములో నుండఁగా జీవనములేక లోవైనము భాగ్యముకూడా తొలఁగి దారిద్ర్యములు కలుగును. తక్కినరాసులు సమఫలములు ఇదిగాక పైనఁ జెప్పిన స్థానములలో శనియుండి శనిదశాభుక్తులు వస్తే ఈ ఫలములు తప్పక జరుగును.

ఉత్తరానక్షత్రములోఁ బుట్టినవానికిఁ శని వృషభములో తిరుగునప్పుడు చతుష్పాద జీవవశముగ, వృక్షమూలకముగ, మంచి ధన

లాభము కలుగును. మిథున కటకములలో తిరుగునప్పుడు బంధు సంకటము, కర్మము, ఋణము, ధనుస్సులో తిరుగునప్పుడు జీవన నాశము హీనజీవనము కలుగును. తక్కినరాసులు సమఫలము. ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శనిదశా భుక్తులువస్తే ఈ ఫలములు తప్పక జరుగును.

హస్తానక్షత్రములో బుట్టినవానికి శని మిథునములో తిరుగునప్పుడు వర్తకమూలకముగ వైశ్య శూద్ర మూలకముగ మంచి యుద్యోగలాభము, సర్వ కార్యజయము. కన్యా, తులలో తిరుగునప్పుడు జీవనహాని సొత్తులుకుదువ స్త్రీమూలకముగ ప్రాణసంకటము, బుద్ధినాశము స్థానభ్రంశము, మేషములో తిరుగునప్పుడు ఋణబాధ బంధునాశము, తిలసంబంధకర్మ, మనోవ్యాకులత్వము ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు ఇదిగాక పైనఁ జెప్పినస్థానములలో శనియుండి శనిదశా భుక్తులువస్తే ఈ ఫలములు తప్పకజరుగును.

చిత్తానక్షత్రములో బుట్టినవానికి శని మేషములో తిరుగునప్పుడు ప్రభువుల వాక్సహాయము బొంది భూములలోను అరణ్యములలోను, కొండల సమీపములలోను ధనలాభము ఉద్యోగము సంతోషము. కటకములో తిరుగునప్పుడు జీవనహాని క్రూరజీవనము. మకర కుంభములలో దాయాదినాశము. ఋణబాధ, పైతృకకర్మ, ఇవి కలుగును తక్కినరాసులు సమఫలములు ఇదిగాక, పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.
స్వాతీనక్షత్రములోబుట్టినవానికి శని మకరకుంభములలో నుండేనేని జీవనదీసమీపమున నీచులమూలకముగ శూద్రులమూలకముగ ఉద్యోగమూలకముగ మంచిధ లాభము, వృశ్చికములోతిరుగునప్పుడుఋణబాధ వ్యాకులముబంధునాశము వృషభములో సంచరించునప్పుడు బుద్ధివినాశము చతుష్పాదజీవములనాశము, జీవనహాని ధనుస్సులోసంచరించునప్పుడు పైతృకకర్మ ఇవికలుగును తక్కినరాసులు సమఫలములు ఇదిగాకపైనఁ జెప్పిన స్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే యీఫలములు తప్పకజరుగును.



విశాఖ నక్షత్రమున బుట్టినవానికి శని వృశ్చికములోనికి వచ్చునప్పుడు ప్రభువుల వాక్సహాయమువలన యెత్తైటిభూములు గల స్థానములవద్ద యుద్యోగమువలన లాభము, కన్యాతులలలోనుండునప్పుడు ద్రవ్యనష్టమయిపోవుట, పైతృకకర్మ, మీనములో నుండేటప్పుడు, జలగండము సత్కర్మమూలకముగ విశేష ద్రవ్యహాని ఇవి కలుగును తక్కినరాసులు సమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శని దశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

అనూరాధా నక్షత్రములో బుట్టినవానికి శని మకరములో సంచరించునప్పుడు జలసమీపమున మంచి జీవనము అందువలన ధనలాభము, ధనుస్సులో తిరుగునప్పుడు జీవనహాని, మహాకష్టము, కటకములో సంచరించునప్పుడు జలగండము వ్యవహారస్థానములో మానభంగము, ఋణబాధ, బంధునాశము, కర్మ, శత్రుత్వము, ఇవి కలుగును. తక్కిన రాసులు సమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శని దశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

జ్యేష్ఠానక్షత్రములో బుట్టినవానికి శని కటకములో సంచరించునప్పుడు పరిపూర్ణ జీవ నదీతీరమునందు వ్యవహార మూలకముగ మంచి ధనలాభము, మేషవృషభములలో తిరుగునప్పుడు కర్మ బంధునాశము ధనవ్యయము వ్యాకులము ఋణము స్థానభ్రంశము, చతుష్పాజ్జీవముల నాశము, తులావృశ్చికములలో నుండునప్పుడు జీవనము దొరకకయుండుట, వుండేసొత్తులు కుదువలవలన నాశముగుట స్త్రీలవలన మానభంగము ఇవి కలుగును. తక్కిన రాసులు సమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శని దశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

మూలానక్షత్రములో బుట్టినవానికి శని మేషవృషభములలో సంచరించునప్పుడు ప్రభువులవలనను చతుష్పాద జీవములవలనను భూములవలనను మంచి ధనలాభములు అధికారములవలన

పరిపూర్ణసంతోషము సింహములోనుండునప్పుడు జీవనములేక పోవుటయులో వైనంలోనుండు సొత్తులనాశము శత్రుత్వము కష్టమైన జరుగుబాటును, కుంభ మీనములలోనుండెనేని దాయాదినాశనము ఋణబాధ, వ్యాకులము ఇవి కలుగును. తక్కిన రాసులు సమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

పూర్వాషాఢా నక్షత్రములో బుట్టినవానికి కుంభమీనములలో శనియుండెనేని దాసవర్గమువలస మంచి ధనలాభము, వ్యవహారమువలన లాభము. మిధునములో సంచరించునప్పుడు చిక్కులెక్కలవలన వ్యాకులము జీవనహాని ధనుస్సులో నుండునప్పుడు కర్మ ఋణము, వ్యసనము బంధునాశము, ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శని దశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

ఉత్తరాషాఢా నక్షత్రములో బుట్టినవానికి శని ధనస్సులో సంచరించునప్పుడు బ్రాహ్మణమూలకముగ మంచి ధనలాభము వ్యవహారము. మేషములో సంచరించునప్పుడు దేహజాడ్యము చేయుచున్న జీవనము నష్టమగుట కష్టము లోవైనంసొత్తుల నాశము. సింహములో సంచరించునప్పుడు దాయాదినాశము. తులావృశ్చికములలో సంచరించునప్పుడు ఋణము వ్యాకులము కర్మ ఇవిగలుగును. తక్కిన రాసులు సమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శని దశాభుక్తులువస్తే ఈఫలము తప్పక జరుగును.

శ్రవణ నక్షత్రములో బుట్టినవానికి శని తులారాశిలో సంచరించునప్పుడు ధనమూలకముగ విశేషధనలాభము, సింహమునందు సంచరించునపుడు కర్మము, ఋణము వ్యాకులత్వము. మకరకుంభముల యందు సంచరించునపుడు పూర్ణజల ప్రవాహమువద్ద నుండెకి యుబ్బరిలో దిగఁబడి తప్పించుకొనుట, జీవనహాని, దారిద్ర్యము ఇవి కలుగును. తక్కినవి సమఫలములు ఇదిగాక. పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పకజరుగును.



ధనిష్ఠా నక్షత్రములో బుట్టినవానికి శని సింహములో సంచరించునపుడు రాజద్వారమున మంచి ధనలాభము వృషభమిధునములలో దిరుగునప్పుడు చెడుఋణము, మహావ్యాకులము దాయాది నష్టము కటకములో దిరుగునప్పుడు కర్మ వృశ్చికములో జొచ్చినప్పుడు జీవనహాని రాజకీయదండనా వ్యవహార కార్యములయందు మానభంగము ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శని దశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

శతభిషా నక్షత్రములో బుట్టినవానికి శని వృషభములో సంచరించునపుడు చతుష్పాద జీవముల వలన మంచి ధనలాభము, మేషము ప్రవేశించునప్పుడు కర్మము కన్యలో సంచరించునప్పుడు జీవనహాని దేశత్యాగము. మీనములో నుండునప్పుడు బంధునాశము ఋణమువలన వ్యాకులము ఇవి కలుగును. తక్కినరాసులు సమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

పూర్వాభాద్రా నక్షత్రములో బుట్టినవారికి శని మీనములో సంచరించునప్పుడు దివ్యస్థలములందు జీవనదీప్రదేశములయందు మంచి ధనలాభమును వ్యవహారమును, కటకములో సంచరించునపుడు జలభీతి లోవైనపుసొత్తులునష్టము దేశత్యాగము జీవనహాని మకరములో నుండునప్పుడు కర్మ ఋణవ్యాకులము ఇవికలుగును. తక్కినవి సమఫలములు ఇదిగాక పైనఁజెప్పిన స్థానములలో శని యుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పకజరుగును.

ఉత్తరాభాద్రా నక్షత్రమునఁ బుట్టినవానికి శని మకరములో సంచరించునప్పుడు నీచుల సహాయమువలన జలప్రదేశములయందు జలముమీఁద సంచరించెడు వస్తువులవలన (అనఁగా ఓడలవలన) మంచి ధనలాభము, మేషవృషభములలో సంచరించునప్పుడు జీవనములేక దేశమువిడిచి మరియొకదేశము ప్రవేశించుట, అక్కడను కష్టము, మీనములో దిరుగునప్పుడు బంధుదాయాది నాశము, వృశ్చిక

ములో నుండునప్పుడు, కర్మచేయుట, ఋణవ్యాకులము, ఇవికలుగును, తక్కినరాసులు సమఫలములు, అదిగాక పైజెప్పినస్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పకజరుగును.

రేవతీ నక్షత్రములో బుట్టినవానికి శని వృశ్చికములో సంచరించునప్పుడు అధికారుల వలనను రాజ్ల వలనను మంచి ధనలాభము, కుంభమీనములలో సంచరించునప్పుడు, జీవనహాని. కష్టము కన్యయందు సంచరించునప్పుడు కర్మచేయుట. సింహమునందు సంచరించునప్పుడు, ఋణము, దాయాదినాశము ఇవికలుగును. తక్కినరాసులు సమఫలములు, ఇదిగాక పైనజెప్పినస్థానములలో శనియుండి శనిదశాభుక్తులువస్తే ఈఫలములు తప్పక జరుగును.

గద్య॥ స్వస్తి శ్రీమత్సకల జగత్కారణ శ్రీసదాశివ కూర్చనయనా విర్భూత చౌడాంబానుగ్రహ సమాసాదిత పంచవర్ణతంతు బ్రహ్మవిష్ణు మహేశ్వరాది దేవాసుర వసనోపవీత దానసంలబ్ద నంది ధ్వజాది ద్వాత్రింశ ద్బిరుదాంకిత మహాయశ స్సప్తావతార విరాజిత శ్రీదేవలవంశసంజాత, శ్రీమత్పుష్పల వంశ పయఃపారావార రాకా సుధాకర కశ్యపాన్వయపవిత్ర గంగయాఖ్యస్య జ్యేష్ఠపుత్రేణ శరభప్రసిద్ధాంతినా విరచితమిదం ఆంధ్రతాత్పర్యోదహరణ సహితం శ్రీదైవజ్ఞశిఖామణి ర్నామ కోయం గ్రంథరత్నె చతుర్థకాండః






శ్రీరస్తు.

శ్రీబాలా పరమేశ్వరీ దేవ్యైనమః.



# దైవజ్ఞశిఖామణి.

## పంచమ కాండః.



### ఇష్టదేవతాప్రార్థన.

శ్లో॥ వందే విశ్వేశ్వరం దేవం గణనాథం గజాననమ్।
ధ్యానేన యస్య ప్రత్యూహా విలయంయాంతి దూరతః॥

తా. ధ్యానము చేయుటవలన సకల విఘ్నములును, దొలగించువాడును, ప్రపంచమున కీశ్వరుడును, గణాధిపతియును, సర్వప్రపంచములకు నధిపతియును, ఏనుగుయొక్క ముఖము గలవాడును, నగు విఘ్నేశ్వరునకు నమస్కారము చేయుచున్నాను.

### గండపురుషలక్షణము.

శ్లో॥ మాఘ ఫాల్గున వైశాఖ, శ్రావణేషునభోగతః।
పాతాళమాశ్వయుక్చైత్ర భాద్రపత్కార్తికేషుచ ॥
జ్యేష్ఠాషాఢేమార్గశీర్షైపుష్యేపృథ్వీతలోపరి ।
గండాఖ్యః పూరుషస్తిష్ఠే త్తత్ఫలం తత్వతోవదేత్ ॥
శుభంభవతిపాతాళే భూమేరుపరి గండదః ।
జన్మమాసానుగుణ్యేన విజ్ఞేయం తత్ఫలంబుధైః॥

తా. గండపురుషుడు మాఘ, ఫాల్గుణ, వైశాఖ, శ్రావణ, మాసములయందు ఆకాశమునందును - ఆశ్వయుజ, చైత్ర, భాద్రపద, కార్తికమాసములయందు పాతాళమునందును - జ్యేష్ఠ, ఆషాఢ, మార్గశీర్ష, పుష్యమాసములయందు భూమిమీదను ఉండును, ఈగండపురుషుడు ఆకాశము నందుండగాను పాతాళముననుండగాను పుట్టినవారికి శుభఫలము, భూమిమీద నుండగా బుట్టినవారికి నశుభఫలము కలుగుచుండును.

## గ్రహసమయములు.

శ్లో॥ మేషాదిలగ్న సంఖ్యాభి ర్మేషాదస్థిత ఖేచరాత్।
సంగుణ్యచ సమైరాప్తం ఫలమూహ్యంచ శేషకాత్॥
స్వశేషం స్వదశావర్షం సంఖ్యాయా గుణయేత్పునః।
నక్షత్రైర్భాజితం శేషం గ్రహాణాం సమయాస్మృతాః॥
స్నానంవస్త్ర ధృతిశ్చైవ తిలకంజప సంజ్ఞికం।
శివపూజాచ హోమశ్చ విష్ణుపూజా ద్విజార్చనం॥
నమస్కారంచ నవమం పశ్చాదద్రి ప్రదక్షిణం।
వైశ్వదేవో తిథేఃపూజా భోజ్యవిద్యా వివర్ధనం॥
ఆక్రోశశ్చైవ తాంబూలం వాగ్విలాస సభాస్థితిః।
జలపానం మదాలస్యం శయనామృత భక్షణే॥
గంధలేపశ్చసల్లాపో భోగోనిద్రాతథైవచ।
పరిక్షాచ గజాదీనాం గ్రహాణాం సమయాస్మృతాః॥
తచ్ఛేష మంగభృచ్ఛేషం స్వదశాబ్దేన వర్ధయేత్।
అంగేనహారితంచేష్టా చేష్టాస్స్యు స్సామవాయికాః।
ఏకైకసమయేషట్చా వస్థాస్యురితికీర్తితాః॥

తా. మేషము మొదలుకొని లగ్నమువరకు అయిన లెక్కను, తాను యేగ్రహముయొక్క సమయ మెరుగగోరు చున్నాడో ఆ గ్రహము జన్మకాలమునందుండెడి రాశివరకు మేషము మొదలు కొని యెంచగా నైయిన సంఖ్యచేత నెచ్చగుణించి, వచ్చిన మొత్తమును ఉద్దిష్టగ్రహముయొక్క దశాసంవత్సరముల సంఖ్యతో నెచ్చ గుణించివచ్చిన మొత్తము యిరువైయేడింట హరించగా శేషము గ్రహసమయ సంఖ్యయగును. అవియే స్నానాది సమయములు యిరువదియేడు. ఆగ్రహ సమయసంఖ్యను ఆగ్రహ దశావత్సరములచే నెచ్చగుణించి ఆరింట హరింపగా వచ్చిన శేషము సమయావస్థ సంఖ్యయగును. అట్టి యవస్థలు ఒక్కొక్క సమయమునకు ఆఱు, అవి ఈక్రింద వివరింపబడును, శేషము లేనియెడల ౬-వ యవస్థయని యెంచుకోనగును.



## గ్రహములకు సమయావస్థలు.

౧ స్నానసమయము.
1 మృత్తికాశౌచము.
2 దంతధావనము.
3 ముఖప్రక్షాళనము.
4 శీతోదకస్నానము.
5 ఉష్ణోదకస్నానము.
6 అభ్యంగస్నానము.

౨ వస్త్రధారణసమయము.
1 వస్త్రానయనము.
2 వస్త్రగ్రహణము.
3 ఉత్తరీయధారణము.
4 వస్త్రాచ్ఛాదనము.
5 పాదప్రక్షాళము.
6 ఆచమనము.

3 తిలకసమయము.
1 ఆనయనము.
2 గ్రహణము.
3 ధారణము.
4 దర్పణవీక్షణము.
5 ఆమోదము.
6 దర్పణవిసర్జనము.

౪ జపసమయము.
1 భూశోధనము.
2 ఆసనానయనము.
3 ఆసీనత్వము.
4 ప్రాణాయామము.
5 అంగన్యాసము.
6 మూలమంత్రము.

౫ శివపూజాసమయము.
1 మృత్తికానయనము.
2 లింగాకరణము.
3 ఆవాహనము.
4 పూజనము.
5 ప్రదక్షిణము.
6 విసర్జనము.

౬ హోమసమయము.
1 అగ్న్యానయనము
2 అగ్న్యావాహనము.
3 ఆజ్యాహుతి.
4 పరిషేచనము.
5 స్తోత్రము
6 విసర్జనము.

౭ విష్ణుపూజాసమయము.
1 పాత్రశోధనము.
2 అభిషేచనము.
3 అర్ఘ్యపాద్యాచామము.
4 అర్చనము.
5 నైవేద్యము.
6 స్తోత్రము.

౮ ద్విజార్చనసమయము.
1 ఆనయనము.
2 పాదప్రక్షాళనము.
3 గంధపుష్పాద్యలంకారము.
4 అర్చనము.
5 ప్రదక్షిణము.
6 నమస్కారము.

౯ నమస్కారసమయము.
1 ఊర్ధ్వం
2 పూర్వం.
3 దక్షిణము.
4 పశ్చిమము
5 ఉత్తరము.
6 ఉపచారము.

౧౦ అద్రిప్రదక్షిణసమయము
1 ఉద్యుక్తము.
2 నిర్గమనము.
3 మధ్యప్రవాసము.
4 గిరిప్రవేశము.
5 సేవనము.
6 అధిష్ఠానము

౧౧ వైశ్వదేవసమయము.
1 అగ్న్యానయనము.
2 భూమ్యలంకారము.
3 హవిష్యానయనము.
4 ఆజ్యస్పర్శము.
5 పానీయము.
6 ఉపస్థానము.

౧౨ అతిథిపూజనసమయము
1 దర్శనము.
2 శూన్యము.
3 స్థితి.
4 వందనము.
5 అన్నదానము.
6 స్వస్థానము.

౧౩ భోజనసమయము.
1 క్షుధాస్నము.
2 సూపభోజనము.
3 పాయసాన్నభోజనము.
4 ఇష్టాన్నభోజనము.
5 బంధుసహితభోజనం
6 పుత్రమిత్రసహితభోజనము.

౧౪ విద్యాసమయము
1 విద్వజ్జనసల్లాపము.
2 విద్యాప్రసంగము.
3 వేదాంతశ్రవణము.
4 పురాణశ్రవణము.
5 వివాదన.
6 విప్రపూజ.

౧౫ ఆక్రోశసమయము.
1 భృత్యకోపము.
2 ప్రయాణకోపము.
3 కోపప్రసాదము.
4 తీవ్రప్రకోపము.
5 కోపఘాతము.
6 కోపము.

౧౬ తాంబూలసమయము.
1 ఆనయనము.
2 నిదానము
3 గ్రహణము.
4 భుక్తము.
5 ఉల్లాసము.
6 హాసము.

౧౭ రాజవిలాసస్థితిసమయం
1 పురాగమనము.
2 దూతప్రేరణ.
3 మంత్రిజనాగమనము
4 ఏకాకిత్వము.
5 మంత్రులతో ఆలోచన
6 ఛత్రచామరాదివిహారణము.

౧౮ సభాస్థితిసమయము.
1 రథారోహణము
2 గజానయనము.
3 అశ్వానయనము.
4 గజారోహణము.
5 అశ్వారోహణము.
6 దేవతాసల్లాపము.

౧౯ జలపానసమయము.
1 మంత్రులకు జలదానము
2 అందరకు జలదానము
3 తాళవృంతానయనము.
4 సేవనము.
5 సమంతాజ్జలసేచనము
6 జలవిసర్జనము.

౨౦ ఆలస్యసమయము.
1 హస్తప్రదానము
2 ఆసీనత్వము.
3 శిఖామర్దనము.
4 కంఠమర్దనము.
5 స్తంభనము.
6 తన్నివారణము.

౨౧ శయనసమయము.
1 శయ్యాసనము.
2 శయ్యాసూత్రధారణము.
3 శయ్యోపరికనకసూత్రధారణము.
4 శయ్యోపరిశయనము
5 శయ్యోపరిపరిసరణము
6 శయనోల్లాసము.

౨౨ అమృతభక్షణసమయం
1 అమృతస్ఫుటశోధనము.
2 స్వపరిజనానామమృతదానము.
3 ప్రాశనము.
4 అత్యంతమనోల్లాసము
5 అఖిలభూమివిహారము
6 అశ్వగజామృతదానము

౨౩ గంధలేపనసమయము.
1 గంధాలంకారము.
2 పుష్పాలంకారము.
3 కస్తూరి తిలకధారణము.
4 ఆభరణాలంకారము
5 కిరీటధారణము.
6 కిరీటవిసర్జనము.

౨౪ సల్లాపసమయము.
1 గృహసల్లాపము.
2 శృంగారము.
3 ఆలింగనము
4 హాస్యము.
5 భుజగము.
6 గీతము.

౨౫ భోగసమయము.
1 భోగము.
2 భోగ్యము.
3 ఉపరతి
4 బాధనము.
5 స్ఖలనము.
6 ఉచ్చైశ్శ్రవము.

౨౬ నిద్రాసమయము.
1 నిద్ర.
2 ఉన్మీలనము
3 గాఢనిద్ర.
4 ఉత్కృష్టనిద్ర.
5 స్వప్ననిద్ర.
6 ఉన్మీలనదర్శనము.

౨౭ రత్నపరీక్షసమయము.
1 అశ్వపరీక్ష.
2 గజపరీక్ష.
3 రత్నపరీక్ష.
4 వీణాప్రసంగము.
5 ఉభయచామరప్రాప్తి.
6 ఉభయచ్ఛత్రవిసర్జనము.



## సూర్యాది గ్రహములకు సమయావస్థా ఫలములు.

| | | |
|---|---|---|
| 1 | స్నానసమయమునందు | ధైర్యమునుబొందును. |
| 2 | వస్త్రధారణ సమయమందు | రాజగును. |
| 3 | తిలకధారణసమయమందు | క్షేమమునుబొందును. |
| 4 | జపసమయమందు | శత్రుజయముగలుగును. |
| 5 | శివపూజాసమయమునందు | దుఃఖముగలుగును. |
| 6 | హోమసమయమందు | శత్రుజయముగలుగును. |
| 7 | విష్ణుపూజాసమయమందు | జయముగలుగును. |
| 8 | ద్విజార్చనసమయమందు | రాజతుల్యుడౌను. |
| 9 | నమస్కారసమయమందు | శుభకరుండౌను. |
| 10 | అద్రిప్రదక్షిణసమయమందు | దారిద్రముగలుగును. |
| 11 | వైశ్వదేవసమయమందు | అమంగళప్రదుండౌను. |
| 12 | అతిథిపూజాసమయమందు | భోగముగలుగును. |
| 13 | భోజనసమయమునందు | భోగవంతుడౌను. |
| 14 | విద్యాసమయమందు | పండితుడగును. |
| 15 | ఆక్రోశనసమయమందు | వ్యసనముబొందును. |
| 16 | తాంబూలసమయమందు | స్త్రీలవలనసుఖముగలుగును. |
| 17 | రాజవిలాససమయమందు | జయముగలుగును. |
| 18 | సభాస్థితిసమయమందు | సుఖమునుబొందును. |
| 19 | జలపానసమయమునందు | సుఖమునుబొందును. |
| 20 | ఆలస్యసమయమందు | మిక్కిలి భయముగలుగును. |
| 21 | శయనసమయమునందు | కాంతిహీనత్వముగలుగును. |
| 22 | అమృతపానసమయమందు | జయంబునుబొందును. |
| 23 | గంధలేపనసమయమందు | రాజ్యముగలుగును. |
| 24 | సల్లాపసమయమునందు | భోగముగలుగును. |
| 25 | భోగసమయమందు | భార్యాపుత్రులుగలుగుదురు. |
| 26 | నిద్రాసమయమందు | అసుఖంబుగలుగును. |
| 27 | రత్నపరీక్షసమయమందు | ధనప్రాప్తిగలుగును. |

ఉదాహరణం—సింహలగ్నమునకు క్షేమము పొందదలచగా ౫ వృశ్చికములో నున్న కుజునివలన క్షేమము పొందలు ౮ పై సంఖ్యచే గుణించగా ౪౦ దీనిని కుజదశచే

గుణించి వది ౨౫౦ దీనిని ౨౭ చే భాగించిన శేషం ౧౦ సమయం దీనిని కుజదశచే గుణించి ౭ చే భాగించగా ౪ శేషము గిరిప్రవేశావస్థ గాన సర్వత్ర సెరుంగవలెను.

### పుత్రజననకాల కర్తవ్యము.

శ్లో॥ అథాతస్సం ప్రవక్ష్యామిజాతేనైవ శుభాశుభం ।
జాతమాత్రేకుమారేతు ముఖంతస్యావలోకయేత్ ॥
పితాఋణాద్విముచ్యేత పుత్రస్యముఖదర్శనాత్ ।
కృత్వాజాతంపితాసూనోః సచేలస్నానమాచరేత్ ॥
ఉత్తరాభిముఖోభూత్వా నద్యాంవాదేవఖాతకే ।
హ్రదేవాపుష్కరిణ్యాంవా బ్రాహ్మణై రనుమంత్రితః ॥
దత్వాగోభూహిరణ్యాది పశ్చాల్లగ్నం పరీక్షయేత్ ।
లగ్నమేవప్రశంసంతి జ్యోతిశ్శాస్త్రవిదోజనాః ॥

తా. పుత్రజననమువలన కలుగునట్టి శుభాశుభఫలముల నిక వచించెద:—పుత్రుడు జన్మించినతోడనే శిశువుయొక్క ముఖమును తండ్రి చూడవలయును. అటులచూచుటవలన తండ్రికి తనపితృదేవతల ఋణము విమోచనమగును. పిదప బ్రాహ్మణానుజ్ఞనుపొంది నదియందుగాని, తటాకమునందుగాని, బావియందుగాని, హ్రదమునందుగాని, ఉత్తరాభిముఖముగా సచేలస్నానముచేసి తర్వాతజాతకర్మ, గోభూసువర్ణాది దానములుసలిపి శిశువుయొక్క జననకాల లగ్నమును జ్యోతిశ్శాస్త్ర పండితులగు పెద్దలవలన తెలుసుకొనవలయును, ఏలననగా - జ్యోతిశాస్త్ర వేత్తలయినవారు లగ్నమే ప్రధానమని చెప్పుచున్నారు.

శ్లో॥ తిథ్యర్క్షగండేపితృమాతృహాని ర్లగ్నస్యగండే తనయస్యనాశః ।
సర్వేజనోజీవతిహంతి లగ్నజీవే సుతస్యా దభివాహ్నకశ్చ ॥

తా. తిథినక్షత్ర గండములు తల్లికితండ్రికి అరిష్టము లగ్నగండము శిశువుకు ఆరిష్టము.తిథి నక్షత్ర లగ్న గండములు చేరియుండిన పితృమాతృ శిశువులకు అరిష్టము. లగ్నమునందు గురువుపుండిన పై దోషములు నివర్తించును.



(జనన కాల దుష్ట నక్షత్ర పాద భేదములు.)

శ్లో॥ అశ్విన్యాః ప్రథమేపాదె జన్మచే త్పితృ దోషకృత్ ।
త్రిమాసావధితద్దోషః శామ్యతి స్వర్ణ దానతః ॥

తా. అశ్వినీ ప్రథమ పాదమునందు, జననమైతే, పితృగండము గ్రంథాంతరమందు శిశుగండమని చెప్పిరి, ఈ దోషము 3 మాసముల వరకుండును సువర్ణదానమువలన నివర్తించును.

శ్లో॥ యామ్యేతృతీయ పాదేచ జాతోయది భవేచ్ఛిశుః।
శిశోర్దోషో భవేత్తత్ర యానత్పాద చతుష్టయం ॥

తా. భరణి తృతీయపాదములో జననమైన శిశువునకు ౨౩ దినములవరకూ దోషము, కొన్నిగ్రంథములయందు, స్త్రీపురుష జననములకు మాతృపితృ గండములనియు, మిగతా ౧-౨-౪ పాదములకు స్వల్పదోషము గలుగుననిరి.

కృత్తికా నక్షత్రములో మూడవపాదమున స్త్రీపురుష జననములకు, మాతాపితృ గండములనియు, ౧-౨-౪ పాదములకు స్వల్ప దోషమని ధర్మశాస్త్రనిర్ణయము.

శ్లో॥ రోహిణ్యాః ప్రథమేపాదె మాతులస్తు వినశ్యతి ।
ద్వితీయేపితరంహంతి తృతీయేమాతం తథా ।
చతుర్థేయదిజాయేత పుత్రస్సర్వశుభావహం ॥

తా. రోహిణీనక్షత్ర ప్రథమపాదమునందు పుత్రుడు జన్మించిన మేనమామకును, ద్వితీయపాదమునందు తండ్రికి, తృతీయపాదమునందు తల్లికిని దోషము, చతుర్థపాదము అందరకూ క్షేమము, గ్రంథాంతరమందు, రోహిణీనక్షత్రము సామాన్యముగా మేనమామకుగండము, అందులో ౧-౨ పాదములు మాతకు, 3-౪ పాదములు మేనమామకు గండము, నవగ్రహహోమముసువర్ణతిలదానాదులవలన నివర్తియగును.

శ్లో॥ పుష్యర్క్షే కటకేలగ్నే దివాచేత్పితృదోషకృత్ ।
పుత్రీజన్మ నిశాయాంతే న్మాతృదోషం వినిర్దిశేత్ ॥

తా. పుష్యమినక్షత్ర కర్కటక లగ్నమందు పగలు పుత్రజన

నమునకు పితృగండము, కర్కాటకలగ్నమందు రాత్రి పుత్రికాజనన మునకు మాతృగండము గలుగును, మరియు.

పుష్యమీ నక్షత్ర ప్రథమ చరణమున మేనమామకు, ౨-3 పాదములలో పుత్రజననమునకు పితృగండము స్త్రీజననమునకు, మాతృగండమును గలుగును చతుర్థపాదము సామాన్యదోషము, ఈ దోషము 3 మాసములు వరకుండును, గంధపుచెక్క దానము చేసిన శమించును.

శ్లో॥ సర్పర్క్షే ప్రథమే పాదే జన్మచేచ్ఛుభకృద్భవేత్ ।
ద్వితీయే శిశుదోషస్స్యా త్తృతీయే మాతృదోషకృత్ ।
చతుర్థే పితృదోషస్స్యా న్నినృత్తిస్త్వన్నదానతః॥

తా. ఆశ్లేషయొక్క మొదటి పాదములో జననమైతే శుభము. రెండవపాదములో జననమైతే శిశువుకు గండము మూడవపాదము లోనైతే మాతృగండము నాలుగవ పాదమునందైతే పితృగండము ఈ దోషము మూడు నెలలవరకు వుండును. ఇది అన్నదానమున నివర్తించును.

శ్లో॥ ఆశ్లేషాంతే మఖాదౌచ జ్యేష్ఠాంతే మూలభాదిమే।
రేవత్యంతేశ్వినీ భాదౌ ద్వే ద్వేతు ఘటికే క్రమాత్॥
షండితై ర్దోష ఘటికే ప్రోక్తేత త్సంభవస్యహి।
గ్రహశాంతిశ్శిశోః కార్యే త్యాహుర్జ్యోతి ర్విదోబుధాః॥

తా. ఆశ్లేషాంత్యము రెండుఘడియలు మఖాప్రథమమున రెండుఘడియలు జ్యేష్ఠాంతమున రెండుఘడియలు మూలమొదట రెండుఘడియలు రేవతి అంత్యమున రెండుఘడియలు అశ్వని మొదటి రెండుఘడియలు ఇవి దోషఘడియలనియు, వీనియందు బుట్టిన వారికి గ్రహశాంతి చేయించవలెననియు జ్యోతిశ్శాస్త్రవేత్తలు వచింపుచున్నారు.

శ్లో॥ మఖర్క్షే ప్రథమే పాదే జన్మచేపితృదోషకృత్।
మాసపంచక పర్యంతం సదోష స్తన్నశాంతయే ।
కర్తవ్య మశ్వదానంస్యాత్ పశ్చాత్పావత్రిమంశుభం॥



తా. మఖ మొదటిపాదములో జననమైతే అయిదు మాసములవరకు పితకుదోషము, కొందరుశిశుగండమందురు, 3 పాదములో స్త్రీ పురుషులకు పితృమాతృ గండమని ఇది అశ్వదానమువలన నివర్తించును తక్కినమూడుపాదములు శుభములు.

శ్లో॥ ఉత్తరాప్రథమే పాదే చతుర్థేచ జనిర్యది।
పిత్రోస్సహోదరస్యాపి త్రిమాసావధి దోషకృత్ ।
తిలపాత్రప్రదానేన తచ్ఛాంతి స్తుభ వేద్ధ్రువం॥

తా. ఉత్తర మొదటి పాదములోను నాలుగవ పాదములోను జననమైతే మాతృపితృ సహోదరులకు రెండు మాసములవరకు దోషము. తిలపాత్ర దానమువలన నదినివర్తించును.

హస్తానక్షత్ర తృతీచరణమున పురుషజననమునకు పితృగండము. స్త్రీజననమునకు మాతృగండము గలుగును. శేషించిన ౧-౨-౪ పాదములకు దోషములేదు.

శ్లో॥ చిత్తాద్యద్విత్రిపాదేషు జననంతు శిశోర్యది।
పితుస్సహోదరాణాంచ షణ్మాసావధిదోషకృత్ ।
తచ్ఛాంతిర్వస్త్రదానేన భవిష్యతి నసంశయః॥

తా. చిత్త మొదటిపాదములోను రెండవ పాదములోను మూడవపాదములోను జననమైతే మాతాపితృ సహోదరులకు ఆరు నెలలవరకు దోషము. ఇది వస్త్రదానమువలన నివర్తించును.

విశాఖా నక్షత్రములో పురుషుడు జనియించిన భావమరిది కైనా, లేక మరిదికైనా గండము, స్త్రీజన్మించిన మరిదికి గండము.

శ్లో॥ జ్యేష్ఠర్క్షఘటికా స్సర్వావిభజ్య దశధాదిమే।
భాగేమాతామహీదోషః పితామహ్యాద్వితీయకే॥
పిత్రోర్దోష స్తృతీయేతు మాతృష్వసురరిష్టకృత్।
చతుర్థేసోదరారిష్టం పంచమే శిశుదోషకృత్॥
షష్ఠేతుశుభదంజన్మ సప్తమేదారదోషకృత్ ।
అష్టమేశిశుదోషస్స్యా న్నవమే పితృదోషకృత్ ।
దశమే మాతృదోషస్స్యా దేవం జ్యేష్ఠా ఫలంవిదుః॥

తురీయపాదేజ్యేష్ఠర్క్షే శిశోఃజన్మభవేద్యది।
నవమాసావధి తద్దాపితుర్దోషశ్చజాయతే।
దోషస్యాస్యభవే చ్ఛాంతిర్గోదానేన నసంశయః॥

తా. జ్యేష్ఠానక్షత్రముయొక్క ఆద్యంతఘడియలను పదిభాగములుచేసి వానిలో మొదటిభాగమున జననమైతే జాతకునియొక్క మాతామహునికిదోషము రెండోభాగమునందైతే మాతామహునికి దోషము. 3వ భాగమునందైతే తల్లితోడబుట్టినవానికి దోషము, నాల్గవభాగమునందైతే సహోదరులకుదోషము, అయిదవభాగమునందైతే జాతకునికి దోషము, ఆరవభాగమునందైతే ఎవ్వరికి దోషము లేదు, ఏడవభాగమునందైతే కళత్రవర్గమునకు దోషము. ఎనిమిదవ భాగమునందైతే జాతకునికి నాశము, తొమ్మిదవభాగమునందైతే తండ్రికి దోషము. పదవభాగమునందైతే తల్లికిదోషము అని జ్యేష్ఠా నక్షత్రమునకు ఫలముచెప్పబడినది మఱియు జ్యేష్ఠానక్షత్రనాల్గవ పాదమునందు జననమైతే తొమ్మిదిమాసములవరకు తండ్రికిదోషము ఇది గోదానమువలన నిశ్చయముగ శాంతి బొందునని చెప్పెదరు.

శ్లో॥ జ్యేష్ఠాంతేపాదఘటికా మూలాదావాదనాడికా।
మిళితైత్వేయాఽర్ధఘటీ సాంతరాళాభిధాస్మృతా।
తత్రాంతరాళే జాతస్యదోషః పుత్రస్య సంభవేత్।
స్త్ర్యపత్యంయదిజాయేత తస్యదోషోన సంభవేత్॥

తా. జ్యేష్ఠాంతమున పాతికఘడియ మూలా నక్షత్రము మొదట పాతికఘడియ వెరశి అరఘడియకు అంతరాళమనిపేరు. దీనియందు మొగశిశువుపుట్టితే శిశువుకు దోషము కలుగును. ఆడశిశువు పుట్టితే దోషములేదు.

శ్లో॥ మూలస్యఘటికా స్సర్వాః విభజ్య ద్వాదశాంశతః।
ఆద్యేభాగే పితుర్దోషః ద్వితీయే మాతృదోషకృత్॥
తృతీయేభ్రాతృదోషస్స్యా చ్చతుర్థే స్వర్ణదోషకృత్।
పంచమేశ్వశురారిష్టం షష్ఠేపితృవ్యదోషకృత్॥
మాతృష్వసురరిష్టంచ సప్తమేభవతిధ్రువం।



అష్టమేధనహానిశ్చ నవమేజీవనవ్యయః॥
దారిద్ర్యందశమే జన్మ భృత్యదోషస్తథాభవేత్।
ఏకాదశే ద్వాదశేతు జాతస్యారిష్టమావహేత్॥
మాసత్రితయపర్యంతం దోషోయమనువర్తతే।
శాంతిర్మహిష్యా దానేనదోషస్యాస్య భవిష్యతి॥
మూలర్క్షేప్రథమేపాదే జన్మచే త్పితృదోషకృత్।
ద్వితీయే మాతృదోషస్స్యా త్తృతీయే ధనహానికృత్।
చతుర్థే జన్మశుభద మేవం జ్యోతిర్విదోవిదుః॥

తా. మూలానక్షత్రముయొక్క ఆద్యంత ఘడియలను పండ్రెండు భాగములుచేసి వానిలో ౧-వ భాగమునందు జననమైతే పితృదోషము ౨-వ భాగమునందు జననమైతే తల్లికి దోషము ౩-వ భాగమునందు జననమైతే భ్రాతకు దోషము ౪-వ భాగమునందు జననమైతే భగినికి దోషము ౫-వ భాగమునందు జననమైతే పిల్లనిచ్చిన మామగారికి దోషము ౬-వ భాగమున జననమైతే తండ్రితోడబుట్టినవారికి దోషము ౭-వ భాగమున తల్లితోడబుట్టినవారికి దోషము. ౮-వ భాగమున ధననాశమును ౯-వ భాగమున జీవననాశనము ౧౦-వ భాగమున దారిద్ర్యము. ౧౧-వ భాగమున భృత్యులకు దోషము. ౧౨-వ భాగమున జాతకునికి దోషము. ఇవి మూడు నెలలవరకు తన్నివృత్తి మహిష దానము, మఱియు మూలానక్షత్రము మొదటిపాదములో జననమైతే తండ్రికి గండము. రెండో పాదమునందైతే తల్లికి గండము ౩-వ పాదమునందైతే ద్రవ్యనాశము ౪-వ పాదమునందైతే శుభము. అని జ్యోతిశ్శాస్త్రవేత్తలు వచించెదరు. ౧౫-భాగలని కొందరు గ్రంథాంతరమందు జెప్పియున్నారు.

1. మరియు వృషభ,వృశ్చిక, సింహ,కుంభమాసములయందు మూలానక్షత్రము దేవలోకమందుండును. గనుక రాజ్యప్రాప్తి గలుగును.

2. మిథున, కన్య, తులా, మీనమాసములయందు పాతాళలోకమునందుండును. గనుక, ధనప్రాప్తి గలుగును.

3. మేష, ధనుః, కర్కి, మకర, మాసములయందు మనుష్య లోకమునం దుండును. గాన, సర్వఫలశూన్యము గలుగును.

శ్లో॥ పూర్వాషాఢర్క్షకేచాపే దివాపుత్రజనిర్యది।
పితృనాశం తదా ప్రాహు ర్జ్యోతిశ్శాస్త్రవిచక్షణాః॥

తా. పూర్వాషాఢ ధనుర్లగ్నమందు, పగలు పుత్రజననమగునేని పితృనాశమః అని జ్యోశ్శాస్త్రవేత్తలు వచించెదరు. 3-వ పాదమునకు స్త్రీ పురుషజననములకు పితృమాతృ గండములని పలుకుచుందురు.

శ్లో॥ పూర్వాషాఢాధనుర్లగ్నే పుష్యర్క్షే కర్కటేతథా।
సూర్యోదయే స్తసమయె హ్యర్ధరాత్రేచ సంగతే।
యదిచేత్పుత్రజన్మస్యా చ్ఛిశోర్దోష స్తదాభవేత్॥

తా. పూర్వాషాఢా ధనుర్లగ్నమందును, పుష్యమి కర్కటక లగ్నమునందును, సూర్యోదయకాల సూర్యాస్తమయ కాలములయందును, అర్ధరాత్రియందును పుత్రజననమయితే ఆ శిశువుకు దోషము. తండ్రి కరిష్టము గల్గునని గ్రంధాంతరం.

శ్లో॥ రేవతీతుర్యపాదేచే జ్జననం పితృదోషకృత్।
సత్రిమాసావధిర్దోష స్తచ్ఛాంతిస్స్వర్ణదానతః॥

తా. రేవతి నాల్గవ పాదమునందు జననమైతే 3- మాసములవరకు పితృగండము సువర్ణ దానమువలన నది నివర్తించును. శిశుగండమని గ్రంధాంతరమందు వ్రాసియున్నది.

దుష్టనక్షత్రాణాం పుత్ర ధర్శనవర్జ్యం.

ఉత్తరకు ౨ మాసములు. పుష్యమికి 3 మాసములు. చిత్రకు ౬ మాసములు. పూర్వాషాఢకు ౮ మాసములు. ఆశ్లేషకు ౯ మాసములు. జ్యేష్ఠకు ౧౫ మాసములు. మూలకు ౮ సంవత్సరములు, పర్యంతము తండ్రి పుత్రదర్శనము వదలి వెయ్యవలెను.

( తిథ్యంతరాశి గండములు. )

అమావాస్య ప్రతిపత్తులు దశమ్యేకాదశలు పూర్ణిమా ప్రతిపత్తులు మధ్యసంధి ౨ ఘడియలు శిశుగండము మీన మేషముల



యొక్కయు, కటక సింహముల యొక్కయు, వృశ్చిక ధనస్సుల యొక్కయు, సంధి అర్ధఘటిక శిశుగండము, ఈ దుష్టనక్షత్రాదుల యందు జననమైన శిశువుకు, అష్టవాక్య జపమును, నవగ్రహ జపమును, అర్ఘ్యమును, హోమమును, రుద్రాభిషేకమ్మును, అశ్వత్థప్రదక్షిణమును, అన్నదానమును, యధావిధిగా జేసినయడల, ఆయా గండములకు శాంతి గలుగును. తిథిగండమునకు, వృషభమును, నక్షత్ర గండమునకు గోవును, లగ్నగండమునకు కాంచనమును దానము యివ్వవలయును.

గద్య॥ స్వస్తి శ్రీమత్సకల జగత్కారణ శ్రీసదాశివ కూర్చ నయనా విఖ్యాత చౌడాంబానుగ్రహ సమాసాదిత పంచవర్ణతంతు బ్రహ్మవిష్ణు మహేశ్వరాది దేవాసుర వసనోపవీతదాన సంలబ్ధ నంది ధ్వజాది ద్వాత్రింశ ద్బిరుదాంకిత మహాయశ స్సప్తావతార విరాజిత శ్రీదేవలవంశసంజాత, శ్రీమత్పుత్సల వంశ పయఃపారావార రాకా సుధాకర కశ్యపాన్వయపవిత్ర గంగయాఖ్యస్య జ్యేష్ఠపుత్రేణ
సీరభద్రసిద్ధాంతినా విరచితమిదం ఆంధ్రతాత్పర్యో
దహరణ సహితం శ్రీదైవజ్ఞశిఖామణి ర్నామ
కోయం గ్రంథరత్నే పంచమకాండః





శ్రీరస్తు.

శ్రీ బాలా పరమేశ్వరీ దేవ్యై నమః.

# దైవజ్ఞ శిఖామణి.

## షష్ఠమ కాండః.

### ఇష్ట దేవతా ప్రార్థన.

శ్లో॥ గౌరీశ్రవః కేతకపత్రభంగ మాకృష్య హస్తేన దదన్ముఖాగ్రే।
విఘ్నం ముహూర్తాకలితద్వితీయ దంతప్రరోహో హరతుద్విపాస్యః॥

తా. తల్లియైన పార్వతీదేవియొక్క కర్ణమందున్న కేతకీపత్రమును తొండముచేత లాగి నోటియం దుంచుకున్నవాడై క్షణకాలము ద్వితీయ దంత సద్భావశోభను వహించిన, గజాస్యుడైన విఘ్నేశ్వరుడు విఘ్నములను హరించుగాక.

### వివాహాంతర విషయములు.

### అథ పొంతనముల వివరము.

శ్లో॥ గ్రహమైత్రం ద్విజాతీనాం క్షత్రియాణాంగణ స్తథా।
కన్యాదూరంతు వైశ్యానాం శూద్రాణాం యోని రేవచ॥

తా. బ్రాహ్మణులకు గ్రహమైత్రమున్ను, క్షత్రియులకు గణకూటమున్ను, వైశ్యులకు దీర్ఘమును, శూద్రులకు యోనిపొంతనమున్ను ముఖ్యముగా చూడదగినది.

### యోనిపొంతనము.

| నక్షత్రములు | యోని |
|---|---|
| అశ్వినీ శతతారలు. | అశ్వములు. |
| భరణి రేవతులు. | ఏనుగులు. |
| కృత్తికా పుష్యములు. | మేకలు. |
| రోహిణి మృగశీర్షలు. | సర్పములు |
| ఆర్ద్రా మూలలు. | కుక్కలు. |



| నక్షత్రములు | యోని |
|---|---|
| మఖా పుబ్బలు. | ఎలుకలు. |
| పునర్వసూ ఆశ్లేషలు. | పిల్లులు. |
| స్వాతీ హస్తలు. | మహిషములు. |
| చిత్రా విశాఖలు. | వ్యాఘ్రములు, |
| అనూరాధ జ్యేష్ఠలు. | లేళ్లు. |
| ఉత్తరోత్తర భాద్రలు. | గోవులు. |
| ఉత్తరాషాఢా అభిజిత్తులు. | ముంగిసలు. |
| పూర్వాభాద్రా ధనిష్ఠలు. | సింహములు. |
| పూర్వాషాఢ శ్రవణములు. | కోతులు. |

### విరోధ జంతువులు.

గో వ్యాఘ్రములకును, గజ సింహములకును, అశ్వ మహిషములకు, లేళ్లు కుక్కలకు, సర్ప ముంగిసలకు, కోతులు మేకలకు, మార్జాల మూషకములకును, లోక వ్యవహారంబువల్ల శత్రుత్వంబు లెరింగి వివాహంబున కన్యావరుల నక్షత్రములబట్టి యోనికూటములో శత్రుత్వము గలవానిం బరిత్యజింప వలయును.

మరియు యోనిపొంతనములో అశ్వినీ శతతారలు మొదలగు నక్షత్రముల జంటలలో మొదట నక్షత్రము పురుషనక్షత్రము. రెండవది స్త్రీనక్షత్రము. అనగా అశ్విని పురుషుడు. శతతార స్త్రీ యీ సంజ్ఞలందు, బురుష నక్షత్రమందు బుట్టిన వరుండును. స్త్రీ నక్షత్రమందు బుట్టిన కన్యయు వివాహమైన శుభకరమగును. స్త్రీ నక్షత్రమునందు బుట్టిన దంపతులును, శుభకరు లగుదురు. ఉభయులు పురుష నక్షత్రమునందు పుట్టినవారై యున్నను స్త్రీ పురుషనక్షత్రము. పురుషుడు స్త్రీ నక్షత్రమునందు బుట్టిన నిత్యము కలహమును గలుగుచుండును.

### స్త్రీ దీర్ఘము.

కన్యక నక్షత్రం మొదలు తొమ్మిదేసి నక్షత్రములు వరుసన ౨౭ నక్షత్రములును మూడు నవకములు గావింప, వర నక్షత్రము మొదటి నవకములోనున్న కలహము, రెండవ నవకములోనున్న

మధ్యమఫలం, 3-వ నవకములోనున్న సుఖంబు గలుగును, మరి యొక పక్షములో కన్యక నక్షత్రమునకు ౧౩-వ నక్షత్రములపైన వర నక్షత్రమున్న శుభంబనియు, అంతకులోపల నున్న నశుభంబు, వధూవరుల జన్మరాసులు సమసప్తకములైన బుత్రప్రదంబు, దంపతుల జన్మరాసు లొకటియైయున్న నుత్తమంబు, స్త్రీరాశికి పురుష రాశి. ౩-౪-౫-౧౦-౧౧. గలదైయున్నను, పురుష రాశికి స్త్రీరాశి 3-౪-౯-౧౦-౧౧. గలదైయున్నను దంపతుల జన్మరాశ్యాధిపతులు పరస్పర మిత్రత్వము గలవారైననూ ఉభయ జన్మరాసుల కొక గ్రహ మధిపతియైననూ, స్త్రీరాశికి ౯-వది యైన పురుషరాశియు, పురుషరాశికి ౫ వదియైయున్న స్త్రీరాశియునైయున్న శుభంబు గలుగును, ఇందుకు వ్యతిరిక్తమైన నశుభకరంబు గలుగుననుట.

మరియు, స్త్రీ జన్మరాశి మొదలు పురుషుని జన్మరాశి ౨గా నుండి పురుషరాశికి ౧౨గానున్న దుఃఖకరం, పురుషరాశి ౬గాను స్త్రీరాశి ౮గానున్న కలహాకరం పురుషరాశి ౬-౧౨గానుండి స్త్రీరాశి ౨-౮ గా నున్న మధ్యమం. స్త్రీరాశి వృషభాది సమ రాసులలో నొకటై ౨ గానుండి పురుషరాశి ౧౨గానున్న శుభకరం. స్త్రీరాశి మేషాది విషమరాసులలో నుండి ౬ వదిగానున్న పురుషరాశియు, ౮వదిగానున్న స్త్రీరాశియు శుభకరంబులగును.

వర్ణకూటము.

| | |
|---|---|
| కటక, వృశ్చిక, మీనరాసులు. | బ్రాహ్మణ రాసులు. |
| మేష, సింహ, ధనస్సులు. | క్షత్రియరాసులు. |
| వృషభ, కన్యా, మకరములు. | వైశ్యరాసులు. |
| మిధున, తులా, కుంభములు. | శూద్రరాసులు. |

దంపతుల రాసు లొక వర్ణము గలవైయున్నశుభకరంబు, పరు నిరాశికంటె. స్త్రీరాశి యధికవర్ణమైతె అధమం, తక్కువ వర్ణము గలదైన మధ్యమం.

( భూతవర్గ. )

ప్రసిద్ధంబగు, పృధివ్యాప్తేజో వాయురాకాశములనెడు, పంచ



భూతములకు నశ్విని మొదలు ౨౭ నక్షత్రములలో క్రమంబుగ. పృధివికి ౫, జలమునకు ౬, తేజస్సునకు౬, వాయువునకు౫,ఆకాశమునకు ౫,ఈరీతివిభజింపగా దంపతుల జన్మనక్షత్రములలో నొకనక్షత్రము తేజోనక్షత్రముగా నుండి మరియొకరిది జల భూత నక్షత్రముగా నున్న మృత్యుప్రదంబు నట్లుగాకున్న శుభకరంబగును.

గోత్రవర్గ.

గోత్రాధిపులగు, మరీచ్యత్రి వసిష్ఠాంగీరః పౌలస్త్య పులహ క్రతువులనెడి, సప్తరుషులయందును గ్రమంబున నభిజిత్సహితముగా అశ్విన్యాది నక్షత్రములు నాలుగేసి నక్షత్రములు వరుసనైన్నగా వధూవరుల జన్మనక్షత్రములు నొకగోత్రములో నున్నయడల కలహకరంబగును.

| | | |
|---|---|---|
| 1 | మరీచిః. | అశ్వినీ, భరణీ, కృత్తికా, రోహిణీ, నక్షత్రములు. |
| 2 | అత్రిః. | మృగశీర్షా,ఆర్ద్రా,పునర్వసూ, పుష్య,నక్షత్రములు. |
| 3 | వసిష్ఠః. | ఆశ్రేషా,మఖా, పూర్వోత్తరఫల్గునీ,నక్షత్రములు. |
| 4 | ఆంగీరసః. | హస్త, చిత్రా, స్వాతీ, విశాఖా, నక్షత్రములు. |
| 5 | పౌలస్త్యః | అనూరాధ,జ్యేష్ఠా, మూలా,పూషా, నక్షత్రములు. |
| 6 | పులహః. | ఉషా, అభిజిత్, శ్రవణ, ధనిష్ఠా, నక్షత్రములు. |
| 7 | క్రతుః. | శతతారా, పూభా, ఉభా. రేవతీ, నక్షత్రములు. |

అథ జన్మనామనక్షత్ర వివేకవర్గ.

మూ॥ జన్మర్క్షేణ వరస్య యోజ్య మనిశం స్త్రీజన్మధిష్ణ్యంబుధై।
ర్జన్మర్క్షం పురుషస్య యోజ్య మనిశం స్త్రీనామభేనాధవా॥
పున్నామ్నాన కదాచనాపియునతే ర్జన్మర్క్షయోగః పున।
ర్దంపత్యోర్వ్యదినామధిష్ణ్యయుగళం యథ్యాశుభంస్యాత్తయోః॥

తా. వరుని జన్మనక్షత్రముతో స్త్రీజన్మనక్షత్రము జేర్చుట ముఖ్యము,అటుగాకున్న స్త్రీనామనక్షత్రముతో వరునిజన్మనక్షత్రము జేర్పవలయును, అటుగానిపక్షమున, నుభయులనామ నక్షత్రములు చేర్చి చూడవలయు, గాక. వరుని నామనక్షత్రముతో స్త్రీజన్మనక్షత్రము నొకప్పుడును జేర్పవలదు.

( దేవమానుష రాక్షస గణములు. )

శ్లో॥ మృగః పునర్వసూపుష్యం స్వాతీశ్రోణాచరేవతీ ।
అనూరాధాశ్వినీ హస్తా ఏతె దేవగణాస్మృతాః॥

తా. మృగశీర్ష, పునర్వసు, పుష్యమి, స్వాతి, శ్రవణం, రేవతీ, అనూరాధా, అశ్విని, హస్త, ఇవి దేవగణములు.

శ్లో॥ ఉత్తర త్రితయంపూర్వ త్రితయం రౌద్ర మేవచ।
భరణీ రోహిణీచైతె తథామనుష్యగణాస్మృతాః ॥

తా. ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, రోహిణి, ఆర్ద్ర, ఇవిమానుష గణములు.

శ్లో॥ మఖాధనిష్ఠా శ్లేషాగ్ని విశాఖా జ్యేష్ఠమూలకాః ।
చిత్రా శతభిషక్చైవ గణాః రాక్షస సంజ్ఞకాః॥

తా. మఖ, ధనిష్ఠ, ఆశ్లేష, కృత్తిక, విశాఖ, జ్యేష్ఠ, మూల, చిత్ర, శతతార, ఇవిరాక్షసగణములు. మరియు, దంపతుల జన్మనక్షత్రము లేకగణమైన శుభకరంబు, మనుష్య దేవగణంబులు మధ్యంబులు, కొందరిపక్షములోనివియు శుభకరంబులని జెప్పియున్నారు, దేవరాక్షస గణంబుల శుభకరంబులగును, మనుష్యరాక్షస గణంబులు మృత్యుప్రదంబు లగును, గ్రంథాంతర వచనంబున, పురుషునిది రాక్షస గణమైయున్న శుభకరంబగును.

పక్షి వర్గు.

| | |
|---|---|
| అశ్వినిమొదలు. | ౫ నక్షత్రములు గరుడపక్షి |
| ఆర్ద్రమొదలు. | ౬ నక్షత్రములు పింగళమనుపక్షి |
| ఉత్తరమొదలు. | ౬ నక్షత్రములు. కాకమనుపక్షి |
| జ్యేష్ఠమొదలు. | ౫ నక్షత్రములు కుక్కుటమును. |
| ధనిష్ఠమొదలు. | ౫ నక్షత్రములు నెమలియు. |

వధిపతులగుట వలన. నీయాధిపత్యములో వివాహవిషయమై వధూవరుల జన్మనక్షత్రముల కొకపక్షి యధిపతియైయున్న దంపతుల కొకరియందొకరికి ప్రేమగలిగియుండును. రెండుపక్షులైన కలహము.



యోగినీవర్గు.

బ్రహ్మాణి, కౌమారి. వారాహి, సిద్ధవైష్ణవి, మాహేంద్రి; చాముండీ, శ్రీమాహేశ్వరిఅనునివి. గ్రమంబునప్రాగాద్యష్టదిక్కులకు శక్తులనంబడుటయె గాక, యుత్పత్తిస్థితినాశములకు గారణభూతంబులగు ననియు జెప్పుచున్నారు.

మరియు తూర్పుదిక్కుమొద లష్టదిక్కులకు. అశ్వినిమొదలొక్కొకదిక్కున కొక్కొక నక్షత్రము వరుసన క్రమముగ ౨౭ నక్షత్రములు సంపూర్ణమగువరకును విభజింపగా వధూవరుల జన్మనక్షత్రము లొకశక్తిసంబంధులైయున్న పరస్పర మైత్రిగలుగును నటుగాకున్న కలహాకరంబగును.

తదపవాదము.

దంపతులలో స్త్రీరాశిఓజరాశియై ఆరాశికి. పురుష రాశి ౬-౮ వది యైన మిత్రత్వంబుగలుగును; స్త్రీరాశియుగ్మరాశియై ౨-౧౨ వ రాశిపురుషరాశియైన శుభప్రదంబు, మరియు, ౧-౧౨-౬-౮ రాసులైననూ ఏకగ్రహాధిపత్యము గలుగుచుండగా నైననూ దంపతుల రాశ్యాధిపతులు మిత్రత్వము గలవారైననూ, దంపతులరాసులు ౪-౧౦ రాసులు, సమసప్తకంబులై యున్నయెడల, రాక్షసగణము, గ్రహమైత్రి, పొంతనము, మొదలగునవి శోధింపవలసిన పనిలేదు.

ఇత్యాదివింశతివర్గులు, దైవజ్ఞ విలాసము మొదలగుననేక గ్రంథములలో జెప్పియున్నవిగాని, జ్యోతిశ్శాస్త్రజ్ఞు లావశ్యకముగా జూడదగినవి, పూర్వముద్రాశినప్రకారము చాతుర్వర్ణములకు క్రమంబుగ, గ్రహమైత్రి. గణకూటము, స్త్రీదీర్ఘం, యోనివర్గులు ముఖ్యంబులు, తక్కిన ౧౬ వర్గులును, దేశభేదముచే నుపయోగించబడును.

( మాతులసుతో ద్వాహము. )

శ్లో॥ పితృష్వస్రు సుతాయాశ్చ సుతాయా మాతులస్యచ ।
వివాహో దినకూటాది నవిచార ప్రవర్తతే॥

తా. మేనమామ కుమార్తెయొక్కయు, మేనయత్త కుమార్తెయొక్కయు, వివాహము జేసుకొను నపుడు, దిన గణకూటము,

శాంతనములు మొదలైనవానిని విచారింప నిమిత్తములేదు.

శ్లో॥ రాశీశ శత్రుత్వ మథైకనాడీ
షష్టాష్టమంవా నవపంచమంవా।
కరగ్రహే మాతులకన్యకా
యాశ్శుభోయదిస్యా చ్ఛకునం త్వభీష్టం॥

తా. స్త్రీపురుష రాశ్యాధి పతులకు శత్రుత్వంబైనను, స్త్రీపురుష నక్షత్రంబు లేక నాడియందుండినను, స్త్రీపురుష రాసులు, పరస్పరము, షష్ఠాష్ఠములైననూ, నవపంచమంబులైననూ, మేనమామ కుమార్తెను పాణిగ్రహణము చేసుకొనుట యందు శుభప్రదము గలుగును.

శ్లో॥ గౌతమ్యాయా మ్యదిగ్భాగే కావేర్యాశ్చోత్తరేతటే।
మాతులస్య సుతోద్వాహం ప్రశంసంతి మనీషణః॥

తా. గౌతమీనదియొక్క, దక్షిణ దిశయందును. కావేరీ యొక్క ఉత్తరభాగము నందును, మేనమామ కుమార్తెను పెండ్లి చేసుకొనుట, విద్వాంసులు ప్రశంశింపుచున్నారనుట.

( అభిజిద్గోధూళ్యుషః కాల నిర్ణయః. )

మూ॥ సూర్యస్థాలయత శ్చతుర్థమభిజిద్యద్వా ముహూర్తోష్టమః
స్సాన్యత్సశ్చేష్వపిమంగళేషు శుభకృద్గోధూళికం సప్తమ్।
ప్రాక్సూర్యోదయతో ముహూర్తఉష ఇత్యంతద్వయంతూత్తమం।
వేశ్యాదేః కరపీడనతు పరస్యాన్యత్ర తత్పూర్వవత్॥

తా. సూర్యోదయ లగ్నముకు ౪వ లగ్నముగాని ౮వ ముహూర్తముగాని, యభిజిన్ముహూర్తమనియు, ౭వ లగ్నము గోధూళికమనియు, ఉదయమునకు బూర్వ ముహూర్త ముషఃకాలమనియు, వీనిలో బ్రాహ్మణాది వర్ణత్రయమున కభిజి న్ముహూర్తము ముఖ్యమనియు, దక్కినవి యశుభకరంబు లనియు, వేశ్యాది సంకరులకు, 3 కాలములు ముఖ్యములగునని యనుట (కాలామృతనిర్ణయః.) మరియు సకలమైన వారికి జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు సాక్షిమాత్రుడేగాక, లగ్న ప్రదాతగాడు.



వివాహప్రశ్న.

మూ॥ ఆదాస్వేప్సిత దేవతాం గ్రహగణం సంపూజ్యకర్తుస్తధా।
తారాచంద్ర బలాన్వితే శుభదినే లగ్నేశుభేవాసరే।
జ్యోతిశ్శాస్త్రవిదం ప్రశాంతమనసన్నత్వా యథాస్వంగురుం।
తాంబూలాంది సమర్ప్యతస్య తు వదేద్వధ్వా వరస్యాపిభమ్॥

తా. వివాహకర్తయగు వరునితండ్రి వివాహప్రయత్నారంభమునందు, నిష్ఠదైవమును, సూర్యాది నవగ్రహములను, భక్తి యుక్తుడై పూజచేసి, తనకు తారాచంద్రబలములు చక్కగానున్న దివసమందు శుభదిన, శుభలగ్న, శుభవారముల యందు, శాంతచిత్తుండగు జ్యోతిశ్శాస్త్రవేత్తను. గురుభావముతో నమస్కరించి, తాంబూల దక్షిణాదులచే సంతుష్టింజేసి, యాజ్యోతిష్కునికిఁ గన్యావరుల, నక్షత్రములఁ దెలిపి, మేమువచ్చిన లగ్నమును బట్టి, శుభాశుభఫలములఁ జెప్పవలయునని వివాహకర్త ప్రార్థించవలెను.

( కన్యకా వివాహ నిర్ణయం. )

వివాహకర్తయగు వరునితండ్రి, శుభలగ్నమును విచారించి మనంబున తనయిష్టదైవమును స్మరింపుచు, కన్యక నిచ్చువారి గృహమును ప్రవేశించి, వారితో సంభాషించి, సదాచారవతియై, సాముద్రికశాస్త్రమందుఁ జెప్పబడిన లక్షణములతోఁ గూడినదై, తనుకులమందు బుట్టినదై, నక్షత్రరాశి, గ్రహమైత్రాదులచే, ననుకూలవతియై, బంగారు, ముత్యములు, పగడములు, మొదలైన వానిచే నలంకరింపబడినదై యున్న కన్యకను, వరునికి దండ్రినిశ్చయింపవలెను.

గోత్రవర్జ్యం.

శ్లో॥ స్వగోత్ర ప్రవరోపేతా హీనాది కులోద్భవా।
కన్యా వయోధికానేష్టా దుర్లక్షణ గుణాన్వితా॥

తా. వరునియొక్క గోత్రప్రవరలతో గూడినట్టియు ఎక్కువ తక్కువ కులమున బుట్టినదియు, దుష్టగుణములతో గూడినదియు,

వరునికంటె నధికవయస్సుగల కన్యక వివాహంబునకు విహితంబై నది గాదని తెలియవలెను.

శ్లో॥ కులంచ శీలంచ వపుర్వయశ్చ
విద్యాంచ విత్తంచ సనాథతాంచ।
ఏతాన్ గుణాన్ సప్తపరీక్ష్య దేయాః
కన్యాబుధైః శ్శేషమచింతనీయమ్॥

తా. వరునికులశీల స్వభావము, సదాచారము, శరీరసుఖము, సౌందర్యము, వయస్సు, వేదశాస్త్రాదివిద్య, భాగ్యము, సౌఖ్యము మొదలగు సప్తగుణంబులు విచారించి, కన్యాదాతయగువాడు దన కుమార్తెను వరునకిచ్చి వివాహము చేయవలయునని యభిప్రాయము.

( యేకనక్షత్ర వివాహము నామాంతరము. )

శ్లో॥ రోహిణ్యార్ద్రామఖేంద్రాగ్నితిష్య శ్రవణపౌష్ణభం।
అహిర్బుధ్న్యర్క్షథాష్టౌచ నక్షత్రైక్యే శుభావహం॥

తా. రోహిణి, ఆర్ద్ర, మఖా, విశాఖ, పుష్య, శ్రవణం, రేవతి, ఉత్తరాభాద్రా, ఈ ఎనిమిది నక్షత్రములయందు వధూవరులకు ఏకనక్షత్రమైన వివాహము శుభకరంబు, తక్కిన నక్షత్రములయం దశుభకరంబు, ఏకనక్షత్రమునందు భిన్నపాదములైనను, నక్షత్ర భేదము గల్గి ఏకరాశియైనను వివాహము శుభప్రదంబని గ్రంథాంతరము.

మరియు, వివాహసమయమునందు బ్రాహ్మణోత్తముడు జలముతో గూడిన క్రొత్తకలశము, మఱ్ఱి, మామిడి, నేరేడు, రావి, జువ్వి, చెట్లయొక్క చర్మములతోటిన్ని, తెల్లని యావగింజలుతోటిన్ని, కరిక రావిచిగుళ్ల చేత కన్యకను ప్రోక్షించి జలప్రోక్షణానంతరము ఒక ముత్తైదువ ఆ కన్యకకు పూర్వముందుంచిన నామమును పరిత్యజించి శుభకరంబగు మరియొక నామాంతరము పెట్టవలయును.

గండనక్షత్ర జాతకవివాహః

శ్లో॥ మూలజాశ్వశురంహంతి వ్యాళజాచ తదంగనామ్।



జ్యేష్ఠజా బావికంహంతి దేవరంతు ద్విదైవజాః॥

తా. మూలానక్షత్రమందు బుట్టిన కన్యక మామకును, ఆశ్రేషా నక్షత్రమునం దుదయించిన పడుచు అత్తకును, జ్యేష్ఠా నక్షత్రములో జనియించిన కన్య బావకును, విశాఖ నక్షత్రమున బుట్టినస్త్రీ మరదికిని, మారకురా లగుచున్నది. గాన వివాహమందు వర్జింపవలెను.

మరియు మూల, ఆశ్రేష, జ్యేష్ఠా, విశాఖా, నక్షత్రములయం దుదయించిన స్త్రీలకేగాని పురుషులు దోషకరులుగారు కాలామృత గ్రంథములో గ్రంథాంతరమున పురుషుడున్ను దోషకరుడేయని వ్రాసియున్నది.

( షడ్జన్మనక్షత్రే సర్వకర్మనిషేధః. )

మూ॥ జన్మర్క్షం జననోడుకర్మదశమం సాంఘాతికంషోడశం।
వైనాశాఖ్యమథ త్రివింశమపిభం తత్పంచవింశంయది।
ఋక్షంమానససంజ్ఞకం ద్వినవమం తత్సాముదాయాభిదం।
త్యాజ్యంసప్తమభంతు నైధనమిదం సర్వేషు కర్మస్వపి॥

తా. ఏనక్షత్రమందు జన్మించునో ఆనక్షత్రము జన్మనక్షత్రమనియు, ఆ జన్మనక్షత్రమునకు ౧౦-వ నక్షత్రము కర్మనక్షత్రము. ౧౬-వది సాంఘాతికము. ౨౩-వది వైనాశము. ౧౮-వది సాముదాయకము. ౭-వది నైధనము. ౨౫-వది మానసము. నీప్రకారము నీ సంజ్ఞలుగల నక్షత్రములయం దుపనయనము మొదలైన సమస్త కార్యములు చేయరాదు.

( జన్మనక్షత్రమందు కార్యాకార్య నిరూపణ. )

మూ॥ జన్మర్క్షంశుభదం నిషేకసుఖయో శ్చౌలాన్నభుక్త్యోఃకృషౌ।
మౌంజీబంధన పట్టబంధనమహీ ప్రాప్తక్షురావాప్తిషు।
ఏభ్యోన్యేష్వ శుభప్రదంచ సువనే సీమంత సంగ్రామయో।
ర్గర్భాదాన పితృక్రియా త్వురభిమగావ్యశ్రితా వివాహేష్వపి॥

తా. జన్మనక్షత్రమునందు నిషేక, యోగ, చౌలకర్మ, అన్నప్రాశన, వ్యవసాయ, ఉపనయన, పట్టాభిషేక, భూసంపాదన, అక్షరా

భ్యాసములయందు శుభకరమనియు, ఈచెప్పబడిన నిషేకాదుల కంటె నితర కర్మలయం దనగా పుంసవనము, యుద్ధము, సీమంతము, గర్భాధానము, శ్రాద్ధము. క్షౌరకర్మ, ఔషధసేవ, ప్రయాణము, వివాహము, వీనియం దశుభప్రదమనియు స్త్రీలకు వివాహ విషయమై జన్మనక్షత్రము శ్రేష్ఠమని గ్రంథాంతరమందు జెప్పియుండుట వలన నీ వివాహ నిషేధము. పురుష విషయమని తెలియదగును.

( త్రిజ్యేష్ఠా స్వరూపం. )

మూ॥ జ్యేష్ఠే మాసికరగ్రహాణశుభకృజ్జ్యేష్ఠాంగనా పుత్రయోః।
జ్యేష్ఠే మాస్యపి జాతయోశ్చ యదివా జ్యేష్ఠోడు సంభూతయోః।
దంపత్యోర్వ్యరధియేన.కేన విధినా జ్యేష్ఠాత్రయంచాస్తిచే।
త్రిజ్యేష్ఠా హ్వయదోషదోహి సతతం నాప్యాద్యగర్భద్వయే॥

తా. కన్యావరులకు మూడు జ్యేష్ఠశబ్దములు గూడెనేని త్రిజ్యేష్ఠమను దోషము గలుగుచున్నది. గాన సహోదరులలో జ్యేష్ఠ స్త్రీపురుషులకు జ్యేష్ఠమాసమందు వివాహము చేయగూడదనియు, జ్యేష్ఠమాసమందైననూ జ్యేష్ఠానక్షత్రమందైనను, బుట్టిన కన్యావరులకు జ్యేష్ఠమాసమందు జేయగూడదనియు, త్రిజ్యేష్ఠలు గూడకపోయినను కన్యావరు లిరువురు ప్రథమ గర్భ జనితులైన వివాహమునకు నిషేధము. జ్యేష్ఠ కన్యావరులైన దంపతులకు రాశి మిత్రత్వముగాని మాసాధిపు మిత్రత్వముగాని గలిగియుండెనేని శుభకరమని మన్వాదుల యభిప్రాయము.

పుట్టిన ౧౬-వ సం॥ మొదలుకొని, బేసిసంవత్సరమున గోదాన వ్రతము జేయునియమల పురుషులకు ౫ సం॥ ల గాయుతు. బేసిసంవత్సరమునందును, స్త్రీలకు సమవత్సరము నందును, వివాహము పుత్రప్రదంబనియు, ౧౦ సంవత్సరముల పైన స్త్రీలకు రజోదర్శన సమయమౌటవలన బేసి సంవత్సరములయందు జేయవచ్చును.

( ఏకోదర వివాహము. )

ఒక వరునికి నిరువుర సహోదర కన్యకల నీయవగదు నన్నదమ్ములకు నక్కచెల్లెండ్ల నీయుగూడదు. నొకలగ్నమందు భిన్నోదరులనగా సవతి కుమారునకైనను, యిరువుర కన్యకల నీయగూడదు, ఒకలగ్నమునందు బుత్రీపుత్రులకు వివాహము చేయగూడదు; సోదరులకు రెండు వివాహములుగాని, ఉపనయనములుగాని చేయగూడదు, నొకనికి నుపనయనము, నొకనికి వివాహము, నొకగృహమందొక లగ్నమందు జేయగూడదు, ఆపత్కాలమందు, మన్వాదులు కొందరు మాసాంతరమందు జేయవచ్చుననియు, గొందరు లగ్నాంతమందు జేయవచ్చుననియు, గొందరొక లగ్నమందంశాంతర మందన్యగ్రామాంతరమందు జేయవచ్చుననియు, గొందరు, పుత్రికా వివాహాంతరమందు, బుత్రవివాహము జేయవచ్చుననియు, కవలలకు ఏకకాలమందే జేయవచ్చుననియు చెప్పియున్నారు.



మరియు॥ బుత్ర వివాహానంతరము పుత్రికా వివాహము బుత్రోపనయనము చేయగూడదు, పుత్రోపనయనా నంతరమున పుత్రికా వివాహము శుభకరము.

ఏకోదరులకు ౬ మాసములు లోగా వివాహము చేయకూడదు, అటుల జేసి రేని 3 సంవత్సరములలో విధవయగును, ఏకగర్భజనితులగు స్త్రీలకు ౬ మాసములలోగా వివాహము జేయగూడదు, అటుల జేసిరేని, ఆవత్సరములో భర్తృవిహీనురాలగుచున్నది బుత్రవివాహము జేసిన ౬ మాసముల పర్యంత మేకోదరుల కుపనయనాదు లశుభకరంబులని చెప్పియున్నారు.

మరియు. నీవివాహవిధి యీక్రమమున నాసంవత్సరమందు ౬ నెలలు చేయగూడదని చెప్పబడినను, సంవత్సరభేదమైన పక్షమందు, నీచెప్పబడిన పరిమితిలేకనే వివాహములు చేయుట యుక్తము గాన ఫాల్గుణమాసమందు వివాహముజేసి, చైత్రమాసమందు మరల నేప్రయోజనమునైనా జేయవచ్చును.

వివాహయోగ్యాయోగ్యాః.

కూటస్థ పురుషుడు, మొదట. ౭వ పురుషుడు ౭వ స్త్రీనిన్ని, ౫వ స్త్రీనిన్ని వివాహము చేయవచ్చును. చతుర్థపురుషుడు షష్ఠస్త్రీని వివాహము చేసుకొనకూడదు. ౫వ పురుషునకు ౫వ స్త్రీని

వివాహము చేయకూడదు, తృతీయ పురుషునికి, తృతీయ స్త్రీని వివాహము చేయవచ్చునని కొందరును చేయకూడదని కొందరి మతము. ఈచెప్పంబడిన నియమము సప్తమపురుష పర్యంతమేగాన అనంతరము సామాన్యబంధు సంబంధమువలె, వివాహము చేయవచ్చును ఈపంచమస్త్రీ పంచమపురుష వివాహము తండ్రివరుస గూడదనియు, తల్లివరుస నుత్తమంబని కొందరిమతము.

( ద్వితీయ వివాహయోగ్యకాలః. )

వివాహమైన తరువాత భార్యజీవతియై యుండగా, మరల వివాహము గోరువాడు, ప్రథమ వివాహసంవత్సరము మొదలు బేసి సంవత్సరము నందును, భార్యామృతినొందిన వెనుక, చనిపోయినది మొదలు బేసిసంవత్సరము నందును, కొందరి మతానుసారముగా సరి సంవత్సరములలో బేసినెలలయందును, ద్వితీయ వివాహము జేయవచ్చుననియు. ఇచ్చట భార్యా పుత్రహీనురాలై మృతినొందిన సరి వర్షములందు సమ మాసములయందు జేయ వలయునని కొందరి మతము.

వివాహయోగ్య మాసములు.

శ్లో॥ మాఘఫాల్గుణవైశాఖ జ్యేష్ఠమాసాశ్శుభప్రదాః।
మధ్యమం కార్తికోమార్గశీర్షో వై నిందితాఃపరే॥

తా. మాఘఫాల్గుణ వైశాఖజ్యేష్ఠమాసములు, శుభప్రదంబులు, కార్తీకమార్గశిర్ష మాసములు మధ్యంబులు, ఇతరమాసములు నిందితములు.

శ్లో॥ అగజోయుగ్మకుంభాళి మృగరాశి గతేరవౌ।
ముఖ్యఃకరగ్రహస్త్వన్య రాశికేవకదాచన॥

తా. సూర్యుడు మేష,వృషభ,మిథున, కుంభ,వృశ్చిక, మకర రాసులను బొందియుండగా, వివాహము శ్రేష్ఠంబైనది. ఇతర రాసులయందు జేయగూడదు.

( శూన్యమాసః. )

శ్లో॥ ఉత్తరాయణగే సూర్యే మీనచైత్రంతు వర్జయేత్।
మీనచైత్రో ధనుః పుష్యో మిథునాషాఢ కోపిచ।



కన్యా భాద్రపదోమాసః శూన్యమాసాః ప్రకీర్తితాః॥

తా. సూర్యుడు ఉత్తరాయణమును బొందియుండగా, మీనచైత్రం, ధనుఃపుష్యం, మిథునాషాఢం, కన్యాభాద్రపద మాసములు శూన్యములు గాన నాయా మాసములయందు వివాహములు చేయదగదు.

మరియు. సూర్యుడు మీనచైత్రమునం దుండగా గలిగెడు దోషము, వింధ్యపర్వతోత్తర దేశమునకేగాని, దక్షిణదేశమునకు లేదుగాన, దక్షిణదేశస్థులు మీనచైత్రమందు, మేషాయన ప్రవేశమైననూ వివాహము చేయవచ్చును.

శ్లో॥ ముండనం మీనచైత్రేతు మండనం మేషచైత్రగే।
ముండనం మండనంచైవ మేషచైత్రే విధీయతే॥

తా. మీనచైత్రమం దుపనయనవ్రతమును, మేషచైత్రమునందు వివాహమును, ఉపనయనమును రెండునూ జేయవచ్చును.

వివాహ వారనక్షత్రాణి.

శ్లో॥ శుక్రార్యేందుజ వాసరేషు శుభదో మందార్కయోర్మధ్యమః।
శ్చేద్వాహఃకుజవాసరే నిధనదస్సోమే సపత్నీప్రదః।
రేవత్యుత్తర రోహిణీకర పితృస్వాతీందు మిత్రానురే।
పాపానన్వితపాపవేధ రహితే పాణిగ్రహశ్శోభనః॥

తా. బుధగురు శుక్రవారములు శుభములు, ఆదిత్య శనివారంబులు మధ్యమంబులు, భౌమవారంబు మరణప్రదంబు, సోమవారము పునర్వివాహప్రదము మరియు, రోహిణి, మృగశీర్ష, మఖ, ఉత్తర, హస్త, స్వాతీ, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి, వీనిలో పాపగ్రహములు లేని నక్షత్రములయందు వివాహము శ్రేష్ఠంబు లనియు. తిథులు ౨- ౩- ౫- ౧౦- ౧౩- ౧౫ ౧ మీ, వృష, కర్కి, కన్య, తుల, ధనుర్మీనములు శ్రేష్ఠంబులు.

సూర్యుడార్ద్ర ప్రవేశే దోషాపవాదము గార్గ్యసంహిత.

శ్లో॥ ఆర్ద్రాదికేస్వాతి విరామకాలే నక్షత్రబృందే దశకేతథైవ।
వివాహ చౌలవ్రత బంధనాఖ్యం సురప్రతిష్ఠాంచసకార్యమేవ॥

